# విషయసూచిక

# కృతి సమర్పణ

సీ॥ అమలాపురపు వంశపాదోధి చంద్రుండు
గురవయ్య నాముంత్సు గురుయశుండు
ఆడంబరంబను అక్షరంబులువాని
శబ్దరత్నాకరము జేరవెరచె
విష్రామసేవయే నిగమ సారంబను
గీత పాఠమునకు గీటురాయి
గుప్తదానంబులో గూఢంబుగానున్న
పరమార్థమాతని పాలిసొమ్ము

తే॥గీ॥ ఆకలనివచ్చు వారికి అన్నమిడుట
ధనము కోరినవారికి ధనములిడుట
యొరులకేగాక తన వామకరమ్మునైన
గుర్తునొసగక జేసెడి గుప్తదాత.

కం॥ కృతిభర్తగ దగిపోనవి
యతిముదమారంగ మనముయలజడి జేయఁగా
కృతనిశ్చయముతో దీనిని
మతిమంతుడు గురవయాఖ్యమాన్యునకిడితిఁగా.

కం॥ గౌరియు, గౌరీపతియును
సారసనాభుండు, రమయు, శారద, ధాతల్
పరమోత్సాహముతోడను
గురవయ్యను బ్రోచుగాక గురుతరప్రేమన్.

# ఆంధ్రప్రదేశ్ హోమియోపతి బోర్డు సభ్యుల అభిప్రాయములు

ప్రియమిత్రులు శ్రీ పేర్రాజు గార్కి—

మీరు వ్రాసిన కార్డు, పంపిన పుస్తకము అందినవి. ఇందుకు చాల కృతజ్ఞుడను.

నేను ఆ పుస్తకము (విద్యార్థుల సారూప్యౌషధ లక్షణ దీపిక) ఆమూలాగ్రముగా చదివితిని. మందులయొక్క ప్రధాన లక్షణము లన్నియు అతి సమర్థతతోను, క్లుప్తముగాను మనస్సుకు హత్తునట్లు వ్రాయుటచే ప్రతి ఔషధముయొక్క సూచకలక్షణములు సులువుగా గ్రహింపనగును. ప్రశ్నోత్తరముల రచన విద్యార్థుల కెంతైన ఉపకరించును. వైద్యమును చేయుచు వైద్యానుభవము నొందుగాగలవారు రచించిన యీ పుస్తకప్రచురణకు నా సుస్వాగతము. గ్రంథాభివృద్ధికి నా ఆశీస్సులు.


39, ు చేరీ రోడ్
మైలాపూర్, మద్రాస్
30—3—1959

డా. వి. వెంకటసుబ్బారావు
H. L. M. S. (Cal)
సభ్యులు
ఆంధ్రప్రదేశ్ హోమియోపతి బోర్డు.

ప్రియమిత్రులు డా. పేర్రాజుగార్కి-

సకాలములో మీ పుస్తకము(విద్యార్థుల సారూప్యౌషధలక్షణ దీపిక) నందుకొంటిని. పనితొందరలో వెంటనే జవాబు వ్రాయలేక పోయినందుకు చింతిల్లుచున్నాను. ప్రశ్నోత్తర రూపములోనున్న మీ "విద్యార్థుల హోమియోపతి మెటీరియా మెడికా" ఆమూలాగ్రముగా చదివాను.

అది మిక్కిలి ఉత్తమ గ్రంథమని తెలుపుటకు సంతసించుచున్నాను. సారూప్య వైద్యుల రిజిష్ట్రేషను కొరకు జరుగనున్న పరీక్షల పాఠ్య ప్రణాళికకు పూర్తిగా సరిపడి సమగ్రమముగా నున్నది. పరీక్షలకు హాజరగువారికి సారూప్య వైద్యము చేయువారికి యిది వరప్రసాదము. ఈ విధముగా యీ పుస్తకమును రూపొందించి మీరు హోమియోపతి వైద్యవిధానానికి గొప్ప సేవ చేసినవారయ్యారు.

విజయవాడ-2
1—4—1959

యస్. చంద్రమౌళి M.B., B.S.
ఆంధ్రప్రదేశ్ హోమియోపతి బోర్డు సభ్యులు.

ప్రియమైన డా. పేర్రాజు

నేను 'విద్యార్థుల సారూప్యౌషధ లక్షణ దీపిక'ను ఆమూలాగ్రముగ చదివితిని. అందు మంచి భోగట్టాయు, ఉపయోగపడు పెక్కు-హాంశములు ఉన్నవని తెలుపుటకు సంతసించుచున్నాను.

స్వతంత్రముగా హోమియోపతి వైద్యవిధానము చదువువారికి చాల ఉపకరించునని నేను చెప్పగలను.

యమ్. గురురాజు
ఆంధ్ర హోమియో మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్,
ఆంధ్రప్రదేశ్ హోమియోపతి బోర్డు సభ్యులు,

# పత్రికా సమీక్ష

'విద్యార్థుల సారూప్యౌషధ లక్షణ దీపిక' రచయిత శ్రీ తోలేటి పేర్రాజు "స్టూడెంట్సు హోమియో పబ్లిషింగు హౌసు" భీమవరం (ప॥ గో॥ జిల్లా) వారిచే ప్రచురింపబడినది. మూల్యము రు. 4/- సభ్యులకు రు. 3-50. శ్రీ పేర్రాజుగారు ప్రాచీన భారతీయ సాంప్రదాయ ప్రకారము గురు శిష్య సంవాదరూపంలో వ్యావహారిక భాషలో పాఠకులకు సూటిగా అర్థమయ్యేటట్లు ఈ గ్రంథమును వ్రాశారు.

మెడికల్ బోర్డువారు తమ పాఠ్యప్రణాళికలో నిర్ణయించిన 'కెంటు' 'నేష్' గార్ల మెటీరియా మెడికాల నాధారము చేసికొని తమ ముప్పది వత్సరాల వైద్యానుభవమును జోడించి హోమియో వైద్యుల పరీక్షలను దృష్టియందుంచుకొని సంగ్రహ రూపంలో రచయిత యీ గ్రంథమును వ్రాశారు. ఆంధ్ర హోమియో వైద్యులు, అభిమానులు సంపూర్ణ సహకారం డాక్టరుగారి కృషికి తప్పక లభింపగలదనుటలో ఎట్టి సందేహమును లేదు.

విజయవాడ }
3-5-1959 }

"శర్మ"
విశాలాంధ్ర.

# మనవి

ఈ గ్రంథములు చదివినవారలు, మిత్రులు, సారూప్య అభిమానులు, పలు తావులలోగల యితరులు పెక్కుమందినుంచి యీ గ్రంథమును శ్లాఘించుచు ఎల్లరకు అవగాహన అగునట్లు శ్రమతో యీ గ్రంథమును రచించిన రచయితలను అభినందించుచు ప్రచురణార్థము మాకు లేఖలను పంపుచున్నారు. స్థలవిస్తర భీతిచే ప్రస్తుతం అన్నిటిని ప్రచురింపజాలనందుకు క్షమింప ప్రార్థన.

ఇట్లు,
పబ్లిషర్సు.

## 75. కాలి - బైక్రోమియం (Kali - Bichromium)

(ఏంటి - సోరిక్, ఏంటి - సైకోటిక్, ఏంటి - సిఫిలిటిక్.)

1. "కాలి - బైక్రోమియం" నందలి సామాన్య సహజలక్షణములను వ్రాయుము.

ఇది అన్ని అమత్వచలమీాదను పనిచేస్తుంది; స్రావాలు ముద్దగా జిగురుగా తీగలు సాగుతూండడం దీనికి సహజం. స్రావాలు సాధారణంగా పసుపురంగుగా వుంటాయి. అమత్వచలనుండి జిగటగా, బంకగా జెల్లీలాంటి ఆమం కూడపడుతుంది.

గుండ్రని గంట్లవంటి లోతైన పుండ్లు పడడం, వాటి వంచలు కొనతేలి ఉడడం మరొక సహజగుణం.

నొప్పులు, బాధలు తరచు ఒకచోటినుండి మరొక చోటికి మారడం; నొప్పి రావడం పోవడం, క్షణంలో జరుగుతుంది. వేలు మోపేజాగాలో మాత్రమే సాధారణంగా కంటి రెప్పపైన తలనొప్పి; ముఖ్యంగా కుడి పార్శ్వాన్నే వస్తుంది. ఆలాటి తలనొప్పికి ముందు కళ్లు చీకట్లు కమ్ముతాయి; లేదా మసగ; నొప్పి వృద్ధి అయినకొద్దీ కళ్ళచీకట్లు తగ్గి బాగా చూపు అనుతుంది.

నాలుక పైభాగంలో పసుపురంగు గార; లేదా నాలుక పొడారి మెరుపుగా నున్నగా ఉండి పీటలు తీస్తుంది. కీళ్ళ నొప్పులు, జిగట లేక మామూలు విరోచనాలు, ఒకదానితరువాత మరొకటి వస్తుంది. అంటే కీళ్ళ నొప్పులు తగ్గితే విరోచనాలు; విరోచనాలు తగ్గితే కీళ్ళ నొప్పులు.

ముక్కు :- ముక్కు మొదట నొప్పి, దుర్వాసన, తీపు, పక్కులు కట్టడం; సాధారణంగా సీతకాలంలో దగ్గు, పడిశం.

ప్రతిరోజున ఒక నిర్ణీత సమయంలో నరముల సంబంధమగు బాధ, రొమ్ము ముందెముక (Sternum) మధ్య భాగమునుండి వెనుకకు పోటు పొడుస్తున్నట్లు బాధ. అన్నము తినిన వెంటనే పొట్టలో బరువు, బాధ; పెట్టిలో పెట్టినట్లు ఇరుకుగా ఉండడం.

స్థూలకాయులకు సంభోగేచ్ఛ తగ్గిపోతుంది (ఏలెన్). గజ్జి, కురుపులు, మొటిమలు, నీటిపొక్కులు, తట్లు, దగ్గరదగ్గరగా తట్లు తట్లుగా వచ్చే నూకలు కూడువంటి చిన్న చిన్న కురుపులు; పచ్చని రసి, కొద్ది దురద ఈలాటివి సాధారణంగా సవాయివ్యాధి జీర్ణించుటచే సంభవిస్తాయి.

2. తీగలు సాగే స్రావంగల మూడు మందులేవి ?

(1) హైడ్రాస్టిస్ (2) లిసిన్ (3) కాలీ బైక్రోమికం

3. తలనొప్పి రావడానికిముందు దృష్టిమాంద్యంవచ్చు మందులేవి ?

అయిరస్; నేట్రం-మూర్; కాలీ-బైక్రోమికం.

4. నొప్పులు ఒకచోటునుండి మరొకచోటుకు మారేస్వభావంగలవి 5 మందులున్నవని "నేష్" అంటారు అవిఏవి ?

(1) పల్సటిల్లా (2) కాలీ-సల్ఫ (3) కాలీ-బైక్ (4) లేక్-కేనినం (5) మెంగనం - ఏసిటికం,

5. పై అయిదు మందులయందు నొప్పులు మారుట్పులతోకూడిన బాధలను పోల్చుము.

'కాలీ బైక్రోమికం' నొప్పి స్థలం "పల్సటిల్లా" ఉన్నంత సేపు ఒక చోట సలపడగా వుండదు. "పల్సటిల్లా"లో వలె నొప్పిదగ్గు

వాపు అంతవిస్తారంగా 'కాలీబైక్రోమికం'కు వుండదు. అదిన్నీగాక 'కాలీబైక్రోమికం'కు వ్యాధి రూపమే మారిపోతుంది. అంటే కీళ్ళ నొప్పులు పోయి విరోచినాలు, విరోచనాలు తగ్గి కీళ్ళనొప్పి; ఒకటి పోయి మరొకటి (ఎలోయి, అబ్రాటినం).

'కాలీసల్ఫ' అన్నివిధాలా "పల్సాటిల్లా"ను పోలివుంటుంది. మిాదుమిక్కిలి "పల్సకు" కాలికం (Chronic) "కాలీసల్ఫ"

'మేంగనం'లో నొప్పులు అయిమూలగా ఒక కీలునుండి మరొక కీలుకు మారుతాయి. అంటే కుడిభుజం, ఎడమమోకాలు

'లేక్ కేనినం' ఒక ప్రక్కనుండి మరొక ప్రక్కకు మారుతుంది. కుడినుండి ఎడమకు, మళ్లా ఎడమనుండి కుడికి మారుతుంది.

6. ఎట్టివారికి "కాలీ బైక్రోమికం" సరిపడుతుంది ?

తరచు రొంప-పడిశంతో బాధపడు ఊటకాయులకు సరిపడు తుంది. పల్చని జుట్టు, బొద్దుగా ముద్దొచ్చే పిల్లలు; తరచు రొంపపట్టి తీగలు సాగే చీమిడితో వుండు బొద్దుగానుండు పిల్లలు.

7. కాలీ-బైక్రోమికంకువచ్చు తలనొప్పి ఎట్టిది ?

తలనొప్పి వచ్చుటకుముందు కండ్లు కనిపించవు. తలనొప్పి వచ్చాక చూపు ఆనుతుంది. దృష్టి సరిగావస్తుంది. కంటిపైన వ్రేలు మోపేటంత జాగాలో విపరీతమగు నొప్పి. ఆ నొప్పి క్షణంలోవచ్చి క్షణంలో పోతుంది. ఈనొప్పి సాధారణంగా కుడితట్టునే వస్తుంది.

8. కాలీ బైక్రోమియంకు నాసికా వాహినికి సంబంధించిన లక్షణాలు మెండని "కెంటు" గారి అభిప్రాయము, సమర్థించుము.

కాలికంగాను, తరుణంగాను (Chronic and acute) కూడ రొంప -పడిశం, ముద్దగా తీగలుసాగే పసుపురంగు చీమిడి, లేక తెల్లని జిగటలు

సాగే కళ్ళె, ముక్కులో దుర్వాసన, ముక్కు ఆరిపోయినట్లుండి మంట, వాసన తెలియదు. ముక్కులో పక్కులుకట్టి రాత్రిలందు ఊపిరాడదు, పసుపురంగు చీమిడి చిక్కనిది ముక్కులో బిగబట్టటచే ఊపిరాడదు. ఎంతగట్టిగా చీదినా స్రావము బైటపడదు. ఈలా పడిశ భారంలో ముక్కు మొదటలో భరించరాని బాధ - పోటు వుంటుంది. ముక్కు లోపల అంతటా పుండ్లు, ముక్కులో పుళ్లు, ఒరుపు, మంట, పక్కులు, దుర్వాసన; ఏమియు తోచక రోగి బిగబట్టి ముక్కులు ఊదుతాడు. ప్రయోజనముండదు. ఆలా ఊదగా ఊదగా ఆకుపచ్చని గట్టి చీమిడి ఊడిపడుతుంది. ముక్కులో బాధ, ఒరుపు, ధనారింపు. ఈలా రొంప, పుళ్ళు వుండగా మధ్యాహ్నం పొద్దు వాలేటప్పుడు మొదలు సాయం కాలం అంతా ముక్కు మొదలునుండి దాపుగావున్న కంటికొన లేక దూరపుకంటి కొనదాకా పొడుస్తున్నట్లు పోట్లు. ముక్కులో విపరీత మగు ఒరుపు, తీపు, ముక్కులో కొయ్యగండలు (Snuffles). ఇట్టి కాలిక మగు నాసిక రుగ్మతేగాక తరుణంకా రొంప, ముక్కువెంట నీరు, ఒరుపు, మంట, వాసనపోవడం సహజం. ఒరుపు, మంట, తీపు; ఒకప్పుడు పుళ్ళుపడి ముక్కుదూలం సిధిలమవుతుంది. ఒకప్పుడు చిక్కని రక్తం ముద్దలుగా పడుతుంది. సవాయికి సంబంధించిన నాసికా రుగ్మతలకు నిరుపమానమగు మందు (కెంటు).

9. కాలీబైక్రోమికంకు ఉదరము, పొట్టకు సంబంధించిన వ్యాధులేవి?

తినిన తిండి బరువుగా పొట్టలో పడివుంటుంది. అరుగుదల పూర్తిగా పోతుంది. తిన్న వెంటనే పొట్టలో బరువు, భారం, దుర్వాసనవేయు తేనుపు. అకస్మాత్తుగా వికారం వస్తుంది. ఒకప్పుడు తింటూ వుండగాను, మరొకప్పుడు తిన్న వెంటనే వికారం; తిన్నది బొళుక్కున కక్కేస్తాడు. వమనం పుల్లగా వుంటుంది. ఉదరంలో చల్లగాను, తీపు

గాను వుంటుంది. అన్నాశయంలోని వుండ్లకు చాల వుపయోగమైన మందు. పుండు, పుట్టువ్రణానికి సంబంధించిందైతే "కాలీబైక్రోమియం" ధరించ శక్యంగాకుండా వుండే పుట్టువ్రణం (Cancer) బాధను నివారిస్తుంది. ఆ వ్యాధిలో అయ్యే వమనాన్ని నిరోధిస్తుంది. బాధలేకుండా రోగి చాలాకాలం జీవించేటట్లు ఉపకరిస్తుంది. కేవలం యిది వుపశాంతి మాత్రమే (Palliation). ఒకప్పుడు కడుపులో శోషవచ్చినట్లుండి తరచుగా తినవలసి వస్తుంది.

కాలేయంలో (Liver) సన్నని సూదిపోట్లు. పొట్ట ఉబ్బుతుంది. తిన్న తరువాత పొట్టలో గాబరాగావుండి వికారం; తరువాత తిన్నది కక్కడం, తరువాత విరోచనం. ఈ విధంగా క్రిమప్రకారం జరుగుతుంది. 'సల్ఫర్'లో వలెనే వుదయాన్ని విరోచినాలు. క్షయవ్యాధిలోను, సన్నిపాత (Typhoid) జ్వరంలోను అయ్యే విరోచినాలకు పనిచేస్తుంది. ఒకప్పుడు కాలేయంచెడి తెల్లని విరోచనమవడం కూడ కద్దు.

కీళ్ళలో నొప్పులు తగ్గి సీళ్ళగాను. జిగుసుగానుకూడ విరోచనాలు అవుతాయి. సాధారణంగా వేసవిలో విరోచనాలు, సీతకాలం రొంప – పడిశం; శ్వాసకోశ సంబంధమగు వ్యాధులు.

మలవిసర్జనానంతరం ఆసనంలో మంట, ఆసనకండరం (Rectum) ఒకప్పుడు జారుతుంది. (Prolapsus). ఆసనంలో ఒరుపు, తీపు, గసిక కొట్టినట్లు బాధ. మూలశంఖ; మలవిసర్జనానంతరము విపరీతమైనబాధ ముందుకు పొడుచుకు వస్తుంది.

10. కాలీ బైక్రోమికం నివారణచేయగల శ్వాసకోశముల వ్యాధి లక్షణములేమి?

నుస, పొడిదగ్గు ఒకప్పుడు కళ్ళెదగ్గు, మరొకప్పుడు శ్వాసకోశాలలో విపరీతంగా కళ్లె పెరిగి 'గుర గుర'మంటుంది. సాయంసమయాన్ని,

ఎక్కువగా తెల్లవారుఝామున 2, 3 గంటలకు మధ్యలో ప్రారంభించి ఉదయం వరకు వుంటుంది. ఏదైనా తిన్నా, త్రాగినా ఎక్కువైపడుకున్నా, వెచ్చగావుండే గదిలోవున్నా వుపశాంతి కలుగుతోంది. ఛాతీమధ్యఎముక (Sternum) నుండి వెన్నుకు పొడిచేబాధ. రొమ్ములు యెడమ పార్శ్వం పైభాగంనుండి భుజంలోనికి పోటు. కొండనాలుక వాలి నీటిసంచిలా వాచి వుంటుంది. (ఏలెన్) దగ్గు.

11. కన్ను కాలీబై క్రోమికంలో ఏ బాధలు పొందుతుంది ?

కంటి రెప్పలు ఎరుపు, ఒరుపు, దురద, వాపు, రెప్పలో మొటిమలు (Grnaules) పగలు వెలుతురు చూడలేడు. (Photophobia) 'కెంటు' తలనొప్పి రావడానికి ముందు చూపుఆనదు తలనొప్పి వచ్చాక స్పష్టంగా చూపు వచ్చుటకు పనిచేస్తుంది.

## 76. కాలీ - బ్రోమేటం (Kali - Bromatum)

1. కాలీ - బ్రోమేటంనుగూర్చి మానసిక లక్షణములతోసహా అర్ధ పుటలో వ్రాయుము

'కాలీ – బ్రోమేటం' రోగులు చాలా స్థూలకాయులు, పెద్దల కంటే పిల్లలకు బాగా వాడేమందు. నిలకడగా ఒక చోట వుండలేరు; స్థిమితం వుండదు. నరములలో దుర్బలత్వం; సర్వదా యేదో పని కల్పించుకు చెయ్యాలి. లేదా తోచదు. చేతులు వణకు, వ్రేళ్ళు కొంకర్లు; చెయ్యి కదుపుతూనే ఉండాలి (కాళ్ళు – జింకం) తూల్తాడు నడిచేటప్పుడు కాళ్లు సరిగాపడవు.

అణచుకోలేనంతగా ఏడుపు లోపలనుండి పొర్లి పొర్లి వస్తుంది. ఏవో భయంకరమైన భావాలు.

పరధ్యాహ్నం, మందమతి, మరపు; మాట్లాడ్డం మరచిపోతాడు; మాట అందిస్తేనేగాని మాట్లాడలేడు. విచారం, దిగులు, బెంగ, ఆదుర్దా.

కండరాలు చెప్పినట్లు వినవు. నరాల దుర్బలత్వంచే కాళ్ళు, చేతులు పట్లుండవు. తిమ్మిరలు.

ఆరాటం, నిద్రపట్టకపోవటం, విచారం, బెంగ, దిగులు. వ్యాపారంలో నష్టంరావడంవల్ల ఆస్తిపాస్తులు పోవడంవల్ల కలిగే మనోవ్యథ, దిగులు. ఈ హేతువుచే వచ్చే రుగ్మతలు, నిద్రపట్టకపోవడం, నిద్దట్లో పిల్లలు వులికిపడి భయంతోను ఆందోళనతోను 'కెవ్వు' మని కేక వేయడం, ఏడ్పు. పెద్దలుకూడ నిద్దట్లో కేకలువేసే నైటుమేరు (Nightmare) అనే రుగ్మతలో బాగా పనిచేస్తుంది. నిద్దరలో పాడు కలలు, పళ్ళుకొరకడం, మూలుగు, కేకలు. నిద్దర్లో తెలియకుండా లేచి తలుపులు తీసికొని వెళ్ళిపోయే వింతరోగమగు 'సోమ్నామ్బిజము'లో బాగా పనిచేస్తుంది.

భయంచేత, కోపంవచ్చుటచేత, పిల్లలకు పళ్ళువచ్చేసమయములోను, పురిటిసమయానా, బాలింతకాలంలోను వచ్చే కొంకర్లకిది మందు. ప్రతిరోజున తెల్లవారగట్ల 5 గంటలకు చంటిపిల్లలకువచ్చే శూలనొప్పికి పనిచేస్తుంది. గర్భవతులకు విపరీతమగు నుసతో కూడిన పొడిదగ్గు. ఒకప్పుడు యీదగ్గుకు పిండం అదిరి స్రవిస్తుందా అను పిస్తుంది. సన్నిగా, మెల్లిగా కష్టంతో మాట్లాడుతాడు (బొవిస్టా. స్ట్రమోనియం). యుక్తవయస్కుల్లో వచ్చే ముఖంమీది మొటిమలకు మంచి మందు. మొటిమలను చిదపకూడదు, చిదిపితే ఒకప్పుడు ప్రమాదం, నల్లని మచ్చలు పడుతాయి.

అతిమూత్రం, మధుమేహాన్ని తగ్గిస్తుంది.

# 77. కాలీ - కార్బోనికం (Kali - Carbonicum)

(ఏంటిసోరిక్, ఏంటిసైకోటిక్, ఏంటిసిఫిలిటిక్)

1. "కాలీ-కార్బోనికం" యొక్క ప్రధాన నైజగుణములేమి ?

సూది పోట్లు: దీని ప్రధాన నైజగుణము. కుడి వెంప్రు ఊపిరి తిత్తి యొక్క క్రిందిభాగమునుండి వెనుకకు సూదిగుచ్చినట్లు పోట్లు. పాండురోగం, ఎఱ్ఱరక్తకణాలసంఖ్య తగ్గుటచే రోగులు పాలిపోయి తెల్లగా రక్తవిహీనంగాఉండి ఉబ్బువ్యాధివస్తుంది. ముఖ్యంగా పై కనుపొట్టలుఉబ్బి, నీటిబుగ్గల్లా వేలాడుతూవుంటాయి. నడుంనొప్పి, నిస్సత్తువ, చిరుచమట్లు, నిలబడలేక కుర్చీలో వాల్తాడు. ఒకకాలు మాత్రం ఉబ్బుతుంది (కెంటు). పొట్ట వుబ్బుతుంది, రాండోలులా తయారవుతుంది. తిన్నతిండంతా గాలిగా మారిపోయిందా అనుపిస్తుంది.

గుండె నీరసం, నాడి వక్రంగా విడిచివిడిచి కొడుతుంది. తెల్లవారగట్ల కోడికూతవేళ 3-4 గంటలకు అన్నియు వుద్రేకిస్తాయి. సంభోగానంతరం నిస్సత్తువచేకూడ బాధలన్నియు హెచ్చుతాయి.

వుబ్బసం, దగ్గు తెల్లవారుఝామున 2 - 3 గంటలకు విపరీతంగావుండి పడుకోలేడు; కూర్చుని ముందుకు ఆనుకోవాలి. లేదా ఊగాలి కుర్చీలో.

బహిష్టుకుముందు, బహిష్టులోను, నడుంనొప్పి.

లావుగావుండి రక్తంలేక పాలిపోయినవారికివచ్చు పక్షవాతం, వుబ్బు, తాకితే వులిక్కిపడుతాడు. ముట్టుకుంటే సహించలేడు. పాదాలు తాకితే చక్కలగింత, వులిక్కిపడడం, వంటరిగా వుండలేడు.

పుంటేభయం (ఆర్స్, లైకో, వంటరిగా వుంటాడు – నక్స్, యిగ్నేషియా)

హృదయం దంతధావనసమయాన్ని ముక్కువెంట రక్తంపడుతుంది. తరచు రొంపపడుతుంది. ఋతుమతికానప్పుడు 'నేట్రమ్యూర్' సూచింపబడి దానిని వాడినను ఋతుమతికానప్పుడు 'కాలీకార్బ్' పనిచేస్తుంది. (హానిమన్) హృదయంనోరు అసహ్యం, దుర్వాసన. పళ్ళవెంట దుర్మాంసంతో చీము. పుక్రోషతనం, కోపం, భయం, నుయ్యి అంటే భయం, సిరస్సు ఒకపార్శ్వం వేడి రెండవది సీతలం.

2. సూదిపోట్లు "కాలీ-కార్బ్" "బ్రయోనియా"లకు కలవు రెంటికిన్నికల పోలికలు, బేధములు ఏమి ?

సూదిపోట్లుగల మందులన్నిటిలోను దీనిదే అగ్రస్థానం. 'బ్రయోనియాలో' పోట్లు కదిలితే హెచ్చుతాయి. కదలకపోతే వుండవు. 'కాలీ-కార్బ్'కు కదలికతో నిమిత్తంలేకుండా ఎప్పుడూ వుంటాయి. 'బ్రయోనియా' పోట్లు స్రావాలుపుట్టే అవయవాల పొరలలో (సీరస్ పొరలలో) మాత్రేనే వుంటాయి. 'కాలీ-కార్బ్కు' శరీరంలో యే భాగంలోనైనా తుదకు ఎముకలు, నరాలు, పళ్ళలోసహా-సూదిపోట్లు వుండొచ్చు. (నేష్)

కుడి ఊపిరితిత్తియొక్క క్రిందిభాగం దీని ప్రత్యేక కేంద్రం. అక్కడనుంచి వెనుకకు వీపులోకి పోడుస్తుంది. (మెర్కు-డి-ఖివన్) సూతికలో సూదిపోట్లబాధకు నిరుపమానమగుమందు. "బ్రయోనియా" తరువాత "కాలీ-కార్బ్" వాడవచ్చును. "బ్రయోనియా" రోగినొప్పివైపునే పడుంటాడు. "కాలీ-కార్బ్"కు నొప్పివైపున తాకవీలుండదు.

8. "రక్తం, గుండె" వీటిపై "కాలీ-కార్బ" ప్రభావమేమి ?

రక్తంలో ఎర్రరక్తకణాలు చాలగా లోపిస్తాయి. రోగి పాలి పోయి తెల్లగా జవజవలాడుతూ నీర్సంగాను, నిస్సత్తువగాను వుంటాడు. యుక్తవయస్సువచ్చిన యువతులకు ముఖ్యంగా పై కనురెప్పలువాచి నడుంనొప్పి, పాండురోగంతో ఉబ్బగా వెలవెలబోతూ వుంటారు. స్త్రీలు ఇట్లానే ముట్లు ఉడిగేసమయంలోకూడ రక్తంవిరిగి పాండురోగంతో ఉంటూ పై కనురెప్పలువాచి ఉంటాయి. వయో వృద్ధులకు పై కనురెప్పలు నీటి సంచులలా వ్రేలాడుతూఉంటాయి. ఈలాటిసమయంలో సాధారణంగా గుండె నీరసంగాను నిస్సత్తువగాను ఉంటుంది. గుండె వక్రంగాను, ఆగిఆగి, విడచివిడచి కొట్టుకుంటుంది. నీర్సం, నడుములో పట్టుఉండదు. నడుం నిలబడదు. నొప్పి, నిలబడ లేదు; కుర్చీలో వాలాలి. కొద్దిపాటిశ్రమకే అలసిపోయిచిరుచమట్లు పోస్తాయి, మాటరాదు, ఆయాసం, ఊపిరాడదు.

'నడుంనొప్పి, నీర్సం చమట్లుకమ్మడం' ఈగుణసంపుటి యీ మందుకేగాని ఏయితరమందుకులేదు (ఫేరింగ్టన్). శ్వాసఆడదు, ఎగూపిరి, దిగూపిరి, ఆయాసం, చివరకు ఏదైనా తినేందుకుగాని, త్రాగేందుకుగాని ఎడంలేని ఆయాసం; శ్వాస వేగంగాను, నీర్సం గాను ఉంటుందేగాని దీర్ఘశ్వాస వుండదు. శ్వాసవలన శరీరమంతా అదురు, ఆయాసం, శ్వాస గొట్టనుకూడ అదరగొడుతుంది. ఇవన్నీ తెల్లవారగట్ల 3 గంటలకు ఎక్కువగా అధికమౌతాయి, అదే వృద్ధికసమయం. లేచికూర్చుని ముందుకు ఆనుకొని వంగుంటే కాస్తవిశ్రాంతిగా వుంటుంది.

నీరు, నజ్జు, జలోదరం, దగ్గు: ఉబ్బసం, క్షయ, గుండెజబ్బు, గుండెకు క్రొవ్వుచేరడం.

4. చిరకాలంనుంచి అగ్నిమాంద్యతతో (డిస్పెప్సియా) బాధపడే వాండ్రకు సరిపడుతుంది "కాలీ-కార్బ" అంటారు కెంటు. అది యెట్లు?

తిన్న వెంటనే కడుపు పిగిలిపోతుందా అన్నట్లు ఉబ్బుతుంది. తిన్నది, తాగినదీ అంతా గాలిగా మారిపోతోందా అనుపిస్తుంది. ఏమాత్రంతిన్నా వెంటనే కడుపు భేరీలాఅయి – వేడిగాఉండి నిండి పోయినట్లవుతుంది (సేప్). పైకి పుల్ల్రేనుపులు, క్రిందకు దుర్వాసన వేయు అపానువాయువులు. తినిన వెంటనే కడుపులోనొప్పి, కడుపులో ఆందోళన – పొట్టలో యేదో భయం, భీతి.

5. కడుపును ఉబ్బచేయు మరి మూడు మందులను వ్రాయుము?

(1) కార్బొవెజిటాబిలిస్. (2) చైనా ఆఫిసలిస్. (3) లైకో పోడియం. 'కాలీ-కార్బ' వృద్ధులకు, పాండురోగులకు, ఆరోగ్యం చెడినవారికి పనిచేస్తుంది.

6. "కాలీ-కార్బ"కు నరసంబంధమగు లక్షణాలేమి?

సూక్ష్మంగానే ఝడుసుకోవటం, తననీడచూచే ఝడుస్తాడు, తాకితే భరించలేడు; అరికాళ్ళు తాకినా ఉలికిపాటే; చక్కలగింత కూడాను. పాదాలు అతిసున్నితం; విపరీతంగా చక్కలగింత. కడుపులో గాబరా, ఆరాటం–భయంగా ఉంటుంది. తలుపు చప్పుడైతే పొట్టలో గాభరా, ఆందోళన. అకస్మాత్తుగా ముట్టగుంటేకూడ కడుపులో ఆందోళనతో తుళ్ళిపడుతాడు లేక ఉలిక్కిపడుతాడు.

7. పురుషసంభోగావయువములపై "కాలీ-కార్బ" పనియేమి?

"కాలీ-కార్బ"రోగి ఆరోగ్యమంతా కోల్పోతాడు. సంభోగానంతరం నీరసం, నిస్సత్తువ; కళ్లు చీకట్లుకమ్మి చూపుఆనదు. సంభోగా

నంతరం రెండు మూడు రోజులవరకున్నదడ, వణకు, నీరసం, పడుకుంటే నిద్రపట్టదు. నీరసంచే రాత్రిలు కలవచ్చి స్ఖలనం. వృషణాలు వాచి రాళ్ళలాఅయి దురద. నీరసంలో పురుషాంగం ఎక్కువగా లేస్తుంది. యవ్వనంలో మంచిచెడ్డలు లేకుండా వ్యభిచరించుటచేత, మితిమీరి సంభోగించడంచేత యీలక్షణాలువస్తాయి.

8. "కాలీ-కార్బ" స్త్రీలకు ఆప్తమిత్రువు అని "కెంటు" అంటారు: అదెట్లు ?

గర్భకోశాన్నుంచి స్రవించే రక్తానికి ఉత్తమమైనమందు, పాలిపోయి రక్తహీనంగావున్న యువతులకు విరామంలేకుండా స్రవించే రక్తస్రావానికి పనిచేస్తుంది. గర్భస్రావానంతరం విరామంలేని రక్తస్రావం, నిర్ణీతకాలానికి ముందుగానే ఋతువు కుదపకుదపల్లా చాల కాలం పదిరోజులు విడవకుండా రేయింబవళ్ళు స్రవించి తరువాత ఊటలా నెలాఖరువరకు అయి మరల పదిరోజులు విస్తారంగా అవుతుంది. ఈలా విరామం లేకుండా సర్వదా మైల స్రవిస్తూనేఉంటుంది. గర్భాశయంలోపుట్టే 'ఫైబ్రాయిడ్సు' అపాయస్థితికి పోకుండా నివారణ అవుతాయి, సకాలంలో గుర్తించి మందు సరిగా వాడాలి.

వేవిళ్ళు: రోగియొక్క తత్వలక్షణాలు గుర్తించి వాడాలి. రోగికేగాని రోగానికి మందివ్వకూడదు.

ప్రసవవేదన: వెనుకతుంటిలో నొప్పులుపుట్టి కీళ్ళగుండా దిగజారుతాయి. నొప్పులు సరిగారావు, బలహీనమైన నొప్పులు, బిడ్డ జన్మించడానికి సహాయపడే నొప్పులురావు. 'నడుమో నడుమో'అని గోలచేస్తూ వేదనపడుతుంది. నడుంనొప్పి చాల విపరీతం. నడుంలో పట్టుండదు. నడుం నిలబడదు. ఈస్థితిలో 'కాలీ-కార్బ' 200 ఒక్కటే మోతాదుయిస్తే బిడ్డను బైటకు నెట్టేటందు కగత్యమగు కండరాల

ముకుళింపుశక్తిని యిచ్చేనొప్పులువచ్చి క్షణంలో శీఘ్రోదయమై శిశువు బైటపడుతుంది. నొప్పులతో నలిగిపోతుంది. ప్రసవానంతరం యెక్కువగా బట్టలవుతాయి.

నడుం పూర్తిగా పట్టులేకుండాపోతుంది, నడుస్తూ నడుస్తూ నడుం పడిపోతున్నట్లుండి రోడ్డుమీదే అడ్డంగా పడుకుందామనుపిస్తుంది. నడుంపట్టు కొద్దిమాత్రంకూడ వుండదు. ప్రథమరజస్వల ఆలశ్యంగా అవుతుంది.

దురద, మంటతోకూడిన పసుపురంగు కుసుమ.

9. ఊపిరితిత్తులపై "కాలీ-కార్బ" ఎట్లు పనిచేయును ?

కఠినమైన పొడిదగ్గు అలసటతోకూడి వుంటుంది. ఒక్కొక్కప్పుడు బురదలాటి కళ్లి పడుతుంది.

ఆమం, రక్తం లేక తెల్లటి కఫం-కాండ్రిస్తే ఎగిరిపడుతుంది (బెడిగా)

ఎడమవైపు పరుండలేదు; వునయాన్నే భోంచేస్తే దగ్గు తగ్గుతుంది. ముఖ్యంగా కోడికూతవేళ తెల్లవారగట్ల 3-5 గం॥ మధ్యదగ్గు లేచి కూర్చోపెడుతుంది. కుడిఊపిరితిత్తి క్రిందిభాగంనుండి వెనక్కువీపులోకి సూదిపోట్లు. సీతగాలి పడదు, తరచుగా రొంప. దారుణంగా వేడిచేసి సీతంచేస్తుంది. రక్తహీనమై పాలిపోయే పాండురోగులకు, రక్తస్రావమయే తత్వంవార్కి బాగా పనిచేస్తుంది. ముట్లుకాక, నడుం పట్టుతప్పిపోయి నీర్సం, నిస్సత్తువులతోఉన్న యువతులకు క్షయరాకుండా కాపాడుతుంది.

ఉబ్బసం:- రాత్రి 3 గంటలకు లేచి కూర్చుని ముందుకువంగి ఉంటేనేగాని ఊపిరాడక ఉక్కిరి బిక్కిరయే ఆయాసంలో బాగా పని చేస్తుంది.

10. "కాలీ-కార్బ్" వాడకంలో వహించవలసిన జాగ్రత్త లేమి ?

ఆమవాతం (Gout)లో యిది చాల అపాయకరమగు మందు (కెంటు) రెండువెంపులా వాడిగల కత్తిలాటిది; వాడడానికి భయావహమైనమందు. (కెంటు)

"కాలిక ఆమవాతం (Gout) కాలిక బ్రయిట్సు డిసీజ్ ముదిరి క్షయలోకి దింపినప్పుడు జాగ్రత్త. ఎక్కువ పొటెన్సీలో వాడకు, వాడితే అనవసరంగా రోగికి బాధలు కలుగజేసినవాడవౌతావు. తప్పక వాడవలసివస్తే 30వ పొటెన్సీ దాటి వాడకు"(కెంటు)

## 78. కాలీ మ్యూరియాటికం (Kali - Muriaticum)

1. "కాలీ-మ్యూరియాటికం" లోపిస్తే ఏమి సంభవించును ?

జీవరసాయనశాస్త్రమందు "కాలీ-మ్యూరియాటికం" అను కోశ లవణములేకుండిన జల్లీవలెనుండు 'ఫైబ్రిన్' అను పదార్థముతయారు కానేరదు. ఆహేతువుచే రక్తమందుండదగు 'ఫైబ్రిన్' రక్తములో సరిపడగా ఉండదు.

కొన్ని జల్లీవంటి జిగటపదార్థములు, శ్వేతధాతువు మిశ్రమమై వలవంటి సున్నితమగు "ఫైబ్రిన్" యేర్పడును. 'కాలీమూర్' లోపించినచోనున్నా లేక తగినంతగా లేకున్ననూ యీమిశ్రమము ఉద్భవించదు. నల్లరక్తనాడులలోని రక్తములో వెయ్యింట మూడుపాళ్ళు "ఫైబ్రిన్" ఉండును. ఎర్రనగు శుద్ధరక్తనాడులలో కొలదిగాలోపించి యుండును.

రొంప, పడిశము, అంగుడుపుండు, పుళ్ళు వీటినుండివచ్చు స్రావములలో తెల్లని బురదవంటి 'ఫైబ్రిన్' 'కాలీమూర్' లోపముచే

కోశాభివృద్ధికి ఉపయోగపడక బహిర్గతమగును. వాపులన్నిటికి 'ఫెరం ఫాస్' వెంట 'కాలీమూర్' వాడనగును. రక్తములో 'ఫైబ్రిన్'లోపిస్తే లోహకణములు ప్రాణవాయువును తమవెంట తీసికొనిపోవును. 'కాలీ-మూరు' ప్రాణవాయువు సహాయముతోను, శ్వేతధాతువు సహాయముతోను రక్తమందు వలయు ఫైబ్రిన్ను తయారుచేయును.

'కాలీమూర్' ప్రాణవాయువు ప్రసరణలోపముచే 'ఫైబ్రిన్' గా తయారుకావలసిన పదార్థము తయారుకాక ఆపదార్థము పనికి మాలినదై నాలుకపై తెల్లని తొరకగాను, ఆమముగాను, వివిధకోశములలోచేరి చర్మముపై పొట్టువలె పొరలతోకూడి బహిర్గతమగును. ఒకప్పుడు ఆపదార్థమే మెత్తని వాపులుగా వెలువడును. ఒళ్ళు కాలినపుడు ముందుగా కోశములందలి 'ఫైబ్రిన్' దగ్ధమగును. కనుకనే కాలుప్పులకు, కాలినపుండ్లకు 'కాలీమూర్' ప్రధానౌషధం.

2. "కాలీమూర్" లోపించుటచే వివిధావయవములలో కనుపించు లక్షణములేమి ?

నాలుకపై తెల్లనిపొర గోచరించుటే "కాలీ-మూర్" లోపమును గుర్తింపజేయు ప్రధానలక్షణము. ఈలక్షణమెంత స్ఫుటముగా గోచరించిన-రోగి యే రుగ్మతతో బాధపడుచున్నను రోగముయొక్క-పేరుతో నిమిత్తములేకుండా - అంతగా 'కాలీమూర్' లోపమును గుర్తించి జీవరసాయన వైద్యుడు యీలవణమును యిచ్చును.

తల:—తలనొప్పి: స్వాభావికమగు నాలుక తెలుపును గమనించవలెను. తెల్లని ఆమము, ఖఫము, వాంతులు, తెల్లని ఖఫము కాంక్రించుట. కాలేయము సరిగా పనిచేయకుండుటచే సంభవించు తలనొప్పులు.

కళ్ళు:—తెల్లని పుసులతో కూడిన అన్నిరుగ్మతలకు, కండ్ల కలకకు, రెప్పలపై కురుపులులా పుసులు, కండ్లు పుసులతో అంటుకోవటం, రెప్పలపైగరి, రెప్పలక్రింద యిసుకపోసినట్లుండడం.

చెవులు:— చెవిపోటు, చెవిచుట్టునాడుండు గ్రంధులవాపు. గొంతులోని టాన్సిల్సువాచి చెవిపోటు. చెవిలోని మధ్యభాగముజలుబుచేవాచి అందుండి తెల్లనిచీము స్రవించును. చెవి మధ్యభాగంలో వాపు, పోటు, చెముడు. చెవిలో హోరు, ధ్వనులు. చెముడు ధ్వనులకు మంచిమందు.

ముక్కు:— ముక్కుదిబ్బడ, పడిశము, తెల్లనగు చిక్కని స్రావము, మెరుపులేని తెల్లని స్రావములు. ముక్కులో పక్కులు, ముక్కు దిబ్బడవేసి శ్వాస ఆడదు.

ముఖము:—దవుడవాచి నొప్పి, యిగుళ్ళు, దవుడ వాచి నొప్పి-పోటు.

నోరు:—నోటిలోపుండు లేదా పెదవులపై పుట్టు వ్రణము, నోరుమంట, తీపు, తెల్లని ఆమముతో కూడిన పుళ్ళు, ఇగుళ్ళుఉబ్బుట లేక వాపు, గ్రంథులవాపు, పోటు. చంటిబిడ్డలనోటిలో తెల్లనిపొక్కులు, తెల్లనిపుళ్ళు, వాటినుండి విపరీతమగు చొంగ (నేట్రం-మూర్)

పళ్ళు:—పండ్లపోటు, ఇగుళ్ళవాపు, దవుడలయందుపొక్కులు, పుళ్ళు, పంటికురుపులు, చీముపట్టకముందే వాడవలెను.

నాలుక:—నాలుకపై తెల్లని లేక గోధుమరంగుపూత, నాలుక వాపుయొక్క రెండవస్థితి, ప్రథమావస్థకు 'ఫెర్రంఫాస్' నాలుకపూత, తెల్లనిపుండ్లు.

గొంతుగ:—పుండ్లతో కూడిన గొంతునొప్పి, టాన్సిల్సు ఉబుకుట, (?)ంగుడుపుండు; యీవ్యాధికి ప్రధానఔషధం. లోపలికియిస్తూ నీటిలో కలిపి పుక్కిలిపట్టవలెను. గొంతు బొంగురు, గవజలు.

జఠరలక్షణములు:—ఆకలిమందం, నాలుక తెలుపు, కాలేయముపనిలో మాంద్యత, తగినంత పసరు తయారుగాక విరోచనం తెల్లగా ఉంటుంది. అగ్నిమాంద్యత; కండ్లు పెద్దవిగా మీాదికొచ్చి నట్లుండును. క్రొవ్వుపదార్థములు అరుగవు, పడవు; త్రేనుపులు. కుడి భుజములోనొప్పి; త్రేనుపు తిన్న పదార్థము లేక క్రొవ్వుపదార్థముగానో వుండి అసహ్యముగా నుండును. బలోహారమగు తిండి కడుపులో మంట, పోటు పుట్టించును. అజీర్తి, తెల్లని ఆమము వమనమగును. కడుపు వుబ్బు, కడుపునొప్పి మలబద్ధకము; రక్తము కుదప కుదపలుగా పేర్కొని వమనమగును. ఈవ్యాధులన్నిటియందు నాలుకపై తెల్లని తొరకవుండుటను తప్పక గమనించవలెను.

ఉదరము, విరోచనము:—విరోచనము పాలిపోయిన పసుపు వర్ణముగాగాని లేక సుద్దవలెగాని అగును. కాలేయముపని సరిగా లేదని దీనివలన తెలియును. కుడిభుజంలో నొప్పి. సన్నిపాతజ్వరంలో కడుపువుబ్బి తాకినచో సున్నితముగా నుండును. పేరుకొనిన అమిత ధాతుగల రక్తస్రావము. బంకవిరోచనములు, జిగురు; తరచు విరోచ నానుమానం. ఆసనంలో పోటు; తీపు; యీబాధచే పిల్లలు "అమ్మా, బాబో" అని అరుస్తారు. లక్షణములనుబట్టి 'ఫెర్రింపాస్' 'మెగ్నీషి యాఫాస్'లు ఎట్టి జిగటవిరోచనములనైనను తగ్గించును. ఉదరము, ప్రేగులు వీటి వాపులయందు ద్వితీయఅవస్థలో పనిచేయును. కడుపు వుబ్బు, తెల్లని విరోచనములు.

పేరుకొనిన నల్లని రక్తస్రావముతో కూడిన మూలశంఖ.

మూత్రావయవములు:—మూత్రకోశము వాపుకు ద్వితీయా వస్థలో పనిచేయును. మూత్రము మిక్కిలి ధాతుగానుండును. మూత్ర పిండములవాపు ద్వితీయావస్థ.

పురుషసంభోగావయవములు :- శగకు ముఖ్యమగు మందు. వృషణములవాపు; గనోరియా జీర్ణించుటచే వచ్చు వృషణములవాపు, అడ్డగర్రలు - గ్రంధులువాచి మెత్తగానుండును. కాలికమగుసవాయి. వ్యాసులైనులోకలిపి పైనకూడ వాడవచ్చును.

స్త్రీ మర్మావయవములు:- పాలవంటి తెల్లని చిక్కగా స్రవించుకుసుమ, ఒరుపుగాని మంటగాని లేని ఆమము. గర్భాశయద్వార మందలి పుండు, అందుండి తెల్లని ముద్దలాటి స్రావము. బహిష్టు ఎగవేయుట లేక ఎగించుట. అతిత్వరితముగానూ, అతి ఆలశ్యముగా నూకూడ నెలసరి అగుట, కుదప కుదపలగానుండు నల్లని చిక్కనిమైల విస్తారముగా వెడలును. గర్భాశయమువాపు, తరచుగా బైటవుండుట. (కాలీఫాస్)

గర్భము:- వేవిళ్ళు, తెల్లని ఆమము, ఖఫము వమనమగును. స్తనములవాపు, చనుకుదుసు; సూతికాజ్వరముకు ఆదిలో నిరుపమాన మగు మందు (ఫెర్రెం-ఫాస్). మతిభ్రమణ, మెదడు చెడును, విషము తలకెక్కును (కాలీ-ఫాస్).

శ్వాసకోశములు:- శ్వాసకోశముల వాపుల ద్వితీయావస్థలో నాడాలి; క్షయలోవచ్చు విపరీతమగు దగ్గుకు, తెల్లని ఆమము లేక పాలవంటికళ్ళె పడుట, విడచి విడచివచ్చు కోరింతదగ్గువంటి దగ్గులకు, కింకవాయువులోవలె గురకతోవచ్చు దగ్గు, కింకవాయువుకు ప్రధాన మగు మందు.

విషపడిశము, ఊపిరితిత్తులలోవాపుకు ద్వితీయావస్థలో నాలుక రంగు సరిపోయిన పనిచేయును. గొంతుగ బొంగురు; మాటరాకుండుట. కోరింతదగ్గు, ఛాతీలో గురక, ఖఫము. ఖఫము తెగిపడదు, తెల్లని కళ్ళె, నాలుకపై తెల్లనిపూత.

రక్త ప్రసరణావయవములు:- గుండెదడ, కోశము లకు విస్తారముగా రక్తము ప్రవహించుట. రక్తనాళములందు రక్తము గడ్డకట్టి పరివాహమున కడ్డుతగులునట్లుచేయు తత్వమునకు దివ్యమగు మందు. 'ఎంబోలిజం' యిది చాల ప్రమాదకరము.

వెన్ను, కీళ్ళు:- కీళ్ళవాతము, కీళ్లనొప్పులు, కీళ్లవాపులకు దివ్యౌషధము. నొప్పులు కదలుటచే వచ్చును లేదా వుద్రేకించును. కాలికముగానుండు కీళ్ళనొప్పులు, వాపులు. కాళ్ళు, పాదములు కాలి కముగావాచియుండును. మెడయందలి గ్రంధులువాచి వుబ్బివుండును. కాళ్లు, చేతులు సీతలముచే పగులును.

నాడీమండలము:- కాకిచిమ్మలకు (Epilepsy) పెట్టినది పేరు. ప్రధానమగు దివ్యౌషధము. కండ్లు పొడుచుకొనివచ్చి మీాది గుడ్లుగా నుండును. నాలుకపై తెల్లనితొరక, వెన్నుపూస క్షీణించును.

చర్మము:- తెల్లని చొనవంటి రసితోకూడిన చర్మవ్యాధు లన్నిటికి యిది దివ్యౌషధం. చర్మముపై తెల్లని పొలుసులు, పొట్టు. గర్భాశయదోషములచే స్త్రీలకువచ్చు గజ్జి, మొటిమలు, పొక్కులు, మొలకలు - వీటిలో తెల్లని పదార్థమున్నచో వాడవలెను. విషసర్పి (Erysipelas) కి ప్రధానమగు మందు. కురుపులు. పుట్టువ్రణములు, రాచకురుపులు. పుళ్లు- వీటి ద్వితీయావస్థలో-చీము పట్టుటకుముందుగా వాడాలి. మెడమీాద, ముఖముమీాద గట్టిపదార్థముతోకూడిన మొటి మలు ఆటలమ్మ. పొంగు, అందలిదద్దు, గురకలకు, గ్రంధులు వాచు టకు పనిచేస్తుంది. ఆటలమ్మ చూపినవెనుక, విరోచనములు, జిగట, తెల్లని ఆంబవిరోచనములు. మాట వినుపించదు. ఆణికాయలకు లోనికి పైకికూడ వాడాలి.

కోశములు : పాండురోగము, రక్తహీనత, నరకులు, కోతలు, బెణుకులు, అన్ని బాపతుల కాల్పులకు లోనికి పైకికూడ వాడవచ్చును. గ్రంధులవాపుకుకూడ వాడవచ్చును. నీరు, పుబ్బు, నజ్జులకు పనిచేస్తుంది; కాలేయము, గుండె, మూత్రకోశములు చెడుటచే సంభవించు పుబ్బుకు వాడాలి.

జ్వరలక్షణములు : వాపులు, వాటివలనకలుగు జ్వరముల ద్వితీయావస్థకు వాడాలి. సూతిక, సన్నిపాతము, జఠరజ్వరములలో 'ఫెరంఫాసు' 'కాలిమూర్' ఒకటివిడచి మరొకటి వాడాలి. కీళ్లజ్వరములు, సన్నిపాతము, సూతికా జ్వరములందు మొదటినుండియు వాడనగు దివ్యౌషధము.

## కాలీ - ఫోస్ఫోరికం (Kali-Phosphoricum)

(ద్వాదశ కోశలవణములలో ఒకటి)

1. కాలీ-ఫాస్‌యొక్క నిర్వహణమేమి ? దీని లోపముచే శరీరమందు జనించు మార్పులేమి ?

మెదడులోగల గోధుమరంగు పదార్థము యీప్రధానకోశలవణముయొక్క ఆధ్వర్యమున పనిచేయుచుండును. ప్రాణవాయువు సహాయముతో శ్వేతధాతువతో కలసి మెదడులోని గోధుమవన్నె పదార్థము మజ్జోద్రవము వుత్పత్తియగుచున్నది. కావున నరముల దుర్బలత్వము, నరముల నిస్సత్తువయు విస్తారముగా అన్నిజ్వరములలోను దీనిస్వాభావికమగు నాలుకపై తెల్లనిపాచి లేక పొర లేక పూత వుండిన యీమందుకు సూచనగా గ్రహించవలెను.

2. ఎన్నడైనను కాలిమూర్ ఋజువుచేయబడినదా ?

లేదు. షూజ్లర్ తెలిపిన లక్షణములనుబట్టియు, అనుభవమును బట్టియు వాడబడుచున్నది.

3. సాధారణముగా నమ్మదగినవిగా గుర్తింపబడిన "కాలీమూర్"ను నిరూపించనగు సహజనైజలక్షణములను అయిదింటినివ్రాయుము.

(1) నాలుకపై తెల్లని లేక గోధుమవన్నె పూత.

(2) తెల్లని ఆమము, ఖఫము, కళ్ళి వెడలుట.

(3) తెల్లని జెల్లీవంటి కాంతిరహిత స్రావము.

(4) గ్రంధులవాపు.

(5) కొవ్వుపదార్థములు, బలోహారపదార్థములు పడవు; లేదా వుద్రేక హేతువులగును.

మానసిక కాయకశ్రమచే నాడీమండలమందలి 'కాలీ-ఫాస్' కోశలవణలోపముచే కలుగును. ఇంకనూ పెక్కు మానసికవ్యాధులకు దారితీయును. మెదడులోని గోధుమవన్నె పదార్థలోపముచే జనించు వ్యాధులు అసంఖ్యాకములు. నరముల దుర్బలత్వముకలవారు తమ వెంట సర్వదా "కాలీ-ఫాస్" ను వుంచుకొని తరచు వాడినచో భయంకరములగువ్యాధుల ననేకములను రాకుండ నివారించును.

మితిమీరి పనిచేసిన వ్యాపారస్తుడు ఒకటి లేక రెండు మోతాదులు 'కాలీ-ఫాస్'ను సేవించిన పడ్డశ్రమను మరచి ఆనందముతో యింటికేగగలడు. పిల్లల పెంపుతోను, బంధు మర్యాదలతోను,గృహమందలి నిత్య నైమిత్తిక పనితోను సతమతమై నీరసము, నిస్సత్తువ, విసుగుదలగాను వున్న గృహిణి 'కాలీ-ఫాస్'ను సేవించిన మానసిక ఆనందము, ఓపిక కలిగి గృహమును స్వర్గతుల్యముగా చేయును. శరీరములో లోపించిన కోశలవణములను, శరీరమున కేపాటి శ్రమయు

లేక సుళువుగా శరీరపోషణకు, అభివృద్ధికి తోడ్పడు యీ లవణములను సున్నితమగు అణుపరిమాణములో చేకూర్చి ఆరోగ్యమును ఒసగుచే జీవరసాయనచికిత్సావిధానము. ప్రతి దినము మనము భుజించు పండ్లు, కాయగూరలు, ధాన్యాదులుద్వారా ప్రకృతి యీలవణము లను శరీరపోషణ కొసగుచున్నది.

4. "కాలీ-ఫాస్" లోపముచే కలుగు ప్రధాన మానసిక లక్షణములేవి?

'కాలీ-ఫాస్' మెదడునకు నరములకు సంబంధించిన ప్రధాన మగు లవణముకావున యీరెంటియొక్క దుర్బలత్వముచే జనించు అన్ని మానసికవ్యాధులకు దివ్యమగు ప్రధానకోశలవణము. మితి మీరిన మానసిక పరిశ్రమచే మెదడు పనిచేయనప్పుడు కలుగు మంద బుద్ధి, మాంద్యత, విచారము, దిగులు, బెంగ, నిరుత్సాహము, కోప ము, విసుగు, మనోచాంచల్యము సంభవించును. పిల్లలు తరచుఏడ్పు, మారాము, కోపము, భయము, జ్ఞాపకశక్తి లేకుండుట- ఈ అన్ని పరిస్థితులను యీమందు సరిచేయును. పిల్లలు నిద్రలో యేడ్పు ఆదుర్దా సర్వదా విచారముగానుండుట, ఏదో ప్రమాదము రాగలదనుభీతి, భావిఅంతయు అంధకారబంధురముగా గోచరించుట, నిస్సత్తువ, నిస్పృహ, నిరాశ యివన్నియు యీమందు లక్షణములు.

తరచు సోషవచ్చుట, పిచ్చి, మనోచాంచల్యము, మనోదార్బ ల్యము.

సంధి (సేట్రంమూర్) భ్రమ - ఏదోకనుపించు చున్నట్లుండి దానిని పట్టుకొనుటకు ప్రయత్నించుట, సిగ్గు, బిడియము, వక్రమిక్కై నను వెనుకాడుట, జ్వరములలోసంధి. సూతికసమయంలోవచ్చుపిచ్చి- త్రాగుడపిచ్చి. అపస్మారము, ఏడ్పు, విపరీతమగునవ్వు, వెఱ్ఱిచేష్టలు,

వ్యాపారసంబంధమగు దిగులు, బెంగ. ఇట్టి పరిస్థితులలో విశ్రాంతిగా నుండి 'కాలీ-ఫాస్'ను సేవించిన వేలాదిజనులు పిచ్చిఆస్పత్రులపాలు కానక్కరలేదు. (కేరీ)

నిట్టూర్పులు, నిస్పృహ, నిస్సత్తువ, నిరుత్సాహము.

రాత్రి నిద్రనుండిలేచి – అటు యిటు పరుగులెత్తువ్యాధి (సోమ్నాంబులిజం)కు దివ్యమగుమందు. దీనిని కొన్నిరోజులు విడువక సేవించవలయును. విద్యార్థులు సేవించిన పరీక్షలందుపడు శ్రమఫలించును. న్యాయవాదుల మనోబలము వికసించును.

గుడిపాములా యిల్లు విడచిపెట్టకపోవుట, సభాపిరికితనం,సంఘభీతి–వీటి నన్నిటిని పోగొట్టి మనోబలమును కలిగించును.

5. "కాలీ-ఫాస్" వాడనగు శిరోలక్షణములేమి ?

నరముల దుర్బలత్వముచేవచ్చు తలనొప్పులు, కొద్దిపాటిధ్వనిని కూడ భరించలేకుండుట, మితిలేని విసుగు, ఆరాటము, తలనొప్పి, నీరసము, నిస్సత్తువ, ఆలోచనాశక్తి క్షీణించుట, మితిమీరిన ఆవులింతలు, ఒళ్ళువిరుపులు, సోమ, అపస్మారము, చెవులోహోరు, తలదిమ్ము తలనొప్పి, యిది వుత్సాహముగానున్నచో తగ్గును. వంటరిగానుండి విచారముగానున్నచో ఉద్రేకించును. తల వెనుకభాగమందలి ముచికిలగుంటలో బరువు, పోటు, విద్యార్థులకు తలనొప్పి, తలదిమ్ము, విద్యార్థులు నిద్రమాని రాత్రంతయు చదువుటచే కలుగు అలసట, బద్ధకము తలనొప్పి, కడుపులో గాభరా యీమందుతో తగ్గును. పరీక్షలన్నచో భీతి, భయము, నింపాదిగా పచార్లుచేయుటచేతను, వుత్సాహఉద్రేకములచేతను ఉపశమించును. మస్తిష్క-ఘాతకమునకు, మెదడుకు రక్తలోపము కలిగినప్పుడు వాడవలెను. మెదడు అదురు, కళ్ళుతిరట్లు

కమ్ముటట, దడ, నిస్త్రాణ యీమందుతో తగ్గును. తలతిప్పు:- అలసట వచ్చు పనిచేయుటచేతను, నీరసముచేతను కలుగును. నిద్రపట్టదు, యీకారణముచే తలలో ధ్వనులుపుట్టుట తగ్గును, మెదడుపై నీరుకు పనిచేయును.

6. "కాలీ-ఫాస్" శరీరములో లోపించుటచే కండ్లకువచ్చువ్యాధులేవి?

కండ్లు మిటకరించుట, మిడిగుడ్లు, నిర్ఘాంతపోయి చూచుట, ఏవ్యాధిలోనైనను పాప చలించకుండుట, కళ్ళుమూసుకొనిపోవుట, రెప్పలు లేవకుండుట, కంటిరెప్పల కండరముల బలహీనతచే రెప్పలు విడకుండుట, మెల్లచూపు, దృష్టినాడియొక్క నిస్సత్తువచే చూపుఆన కుండుట లేక యీ కారణముచే సంభవించు గ్రుడ్డితనము.

7. చెవి, ముక్కు, గొంతుగ వీటికివచ్చు ఏలక్షణములకు "కాలీ-ఫాస్" వాడవలెను?

నరముల దుర్బలత్వముచేవచ్చు చెముడు, చెవిలోను, సిరస్సులోను హోరు, ధ్వని. చెవిలోపుండు దానినుండి దుర్వాసనవేయురసి రక్తము; యీకారణముచే సరిగా వినుపించకుండుట, ముక్కునుండి దుర్గంధభూయిష్టమగు స్రావము, పడిశముకుళ్ళి దుర్వాసన, అర్బుదములకు ముక్కునుండి రక్తము స్రవించుట.

అంగుడుపుండు, తర్వాత సంభవించు పక్షవాతము, అంధత్వము, దృష్టిమాంద్యత, ప్రథమావస్థలో పుండు వాసన.

కింకవాయువు అంత్యావస్థలో మాటసరిగా రాకుండుట, అస్పష్టపుమాటః-పక్షవాతము వచ్చు సూచన, మాటపడిపోవుట, నరముల నిస్సత్తువచేవచ్చు గొంతుగవ్యాధులన్నిటికి పనిచేయును.

8. "కాలీ-ఫాస్" లోపముచే కలుగు నోటిలక్షణములేమి ?

దుర్వాసనతో కూడిన అన్నివిధములగు నోటిపుండ్లకు, నోటి పూతలకు, నోరు దుర్వాసన, అరుచి, అలసిపోవుటచే వచ్చిన పంటి పోటు, ఇగుళ్ళువాసన, ఉబ్బు, పండ్లుకొరకుట, నాలుకపై ఆవనూనె పూసినట్లు బూడిదరంగుగానుండుట, నోటినుండి భరించలేనిదుర్వాసన, ఉదయమున నాలుక పొడారి గొంతుగున కంటుకొనిపోవునట్లుండుట, నాలుక వాపు, పొడారి నీరసముగా నుండుట, కండ్లు గుంటలుపడి ముఖం డోక్కుపోయి నీరసము, నిస్త్రాణ.

9. "కాలీ-ఫాస్" లోపముచే కలుగు ఉదర, జఠర సంబంధమగు వ్యాధులేవి ?

అమితముగా ఆకలి, వెర్రాకలి – జ్వరము తరువాత అమిత ఆకలి. విచారము, దిగులు, అలసట, ఆరాటము – యీ మొదలగు వాటిచే ఉద్భవించు కడుపునొప్పి, శూల, తినిన వెంటనే ఆకలి, ఎంత తిన్నా తృప్తివుండదు.

రక్తవిరోచనములు, బంకవిరోచనములు, కడుపుఉబ్బు, వాపు, మలము దుర్వాసన, కుళ్ళువాసన, నీరసం, నిస్త్రాణ, నాలుక ఆరిపోవుట, కడుపు ఉబ్బుట, కలరా – కడుగువంటి దుర్వాసనతో కూడిన నీళ్ళవిరోచనములు. సన్నిపాతజ్వరములలో రక్తస్రావము. ఆసనకండరము దుర్బలత్వముచే ముందుకుజారుట.

10. "కాలీ-ఫాస్" వాడనగు మూత్రలక్షణములను వ్రాయుము ?

తరచు మూత్రానుమానము, మంట, చురుకు, మూత్రము ఆపుకొనలేకుండుట సత్తువలేకుండుట, పిల్లలు మూత్రము బట్టలలో తడుపుట, నిద్రలో మూత్రముపోయుట, మూత్రనాళమునందు రక్తము,

మూత్రకోశము వాపు, విస్రావిణ, నీర్సము. మధుమేహరోగులకు విస్రావిణ నీరసము, వెరాకలి, నిద్రపట్టకపోవుట.

11. "కాలీ-ఫాస్" లోపముచే కలుగు సంభోగ అవయవముల లక్షణములేవి ?

సవాయిపుండ్లు, వాసనతో కూడిన రసి, రక్తశగ, శుక్లనష్టము. దానిచేకలుగు నీరసము; అమితసంభోగముచేకల్గు నీరసం, దడ. స్త్రీలకు ఋతుదోషములు, నరముల దుర్బలత్వము. ముక్కోపి స్త్రీలకు ఋతువు ఆలస్యముగాఅయి కొద్దిగామాత్రమే అగును. ఋతునూల, మైల దుర్వాసనవేయుచు నల్లని కుదపలవలె అమితముగా పోవును. ఋతువు నిలచిపోయి కోపము, ఉద్రేకము హెచ్చును. అపస్మారములో గొంతుగలో ఉండ ఉంచినట్లుండి గొంతుగలో గాబరా, ఏడ్పు.

మంట, ఒరుపు కలిగించు కుసుమ.

12. గర్భవతుల ఏలక్షణములకు "కాలీ-ఫాస్" మందుగా వాడాలి ?

నీరసముగానుండి గర్భస్రావమగునట్లుండుటకు, గర్భస్రావమునకు. చనుకుదురు - చంకయందలి కురుపులకు, అందుండి దుర్వాసనతో కూడిన బూడిదరంగు స్రావమునకు, మాతికా జ్వరమునకు, మాతికాదోషములకు, మాతికచేకలుగు మతిభ్రమణ లేక పిచ్చికి. గర్భవేదన లేక నొప్పులు సరిగా రాకుండుటకు. దొంగనొప్పులకు, బిడ్డ బహిర్గతమగుట కనుకూలించు - నొప్పులురాక గర్భవతి నలిగిపోవుటకు వాడవలెను. పురుడు వచ్చుటకుపూర్వము ఒక మాసము 'కాలీ - ఫాస్' వాడిన నరములకు వాసి...రా కండరములకు తగినశక్తి చేకూరి సుళువుగాను సునాయాసముగా... సుఖప్రసవము జరుగును.

13. 'కాలీ-ఫాస్' లోపముచే కలుగు శ్వాసకోశలక్షణములేమి?

ఎక్కువ వాగుడువలన గొంతు బొంగురుపోవుటకు, కొంత దగ్గుకు దానిచేకలుగు నీరస నిస్సత్తువలకు. ఉబ్బసము, దగ్గు వీటిచే కలుగు ఆయాసముతో ఊపిరాడనప్పుడు పెద్దమోతాదులుగా తరచు వాడినచో ఆయాసము తగ్గును. పక్షవాతముచే మాట బొంగురు పోవుట లేక మాట పడిపోవుట యీమందుతో తగ్గును. ఊపిరితిత్తుల వాపు, దగ్గు, ఆయాసము, ఊపిరాడకపోవుట, కంఠవాయువుయొక్క తుది అవస్థకు, అమితనీరసము, నిస్త్రాణకు శ్వాసస్థంభించుటకు, నిట్టూర్పులు, నిద్రలో మూల్గుటకు వాడవలెను.

14. రక్తప్రసరణావయవములందలి ఏలక్షణములు "కాలీ - ఫాస్" లోపమును గుర్తింపజేయును.

నరముల దుర్బలత్వముచే నాడి చురుకుగానుండక మామూలు కంటె తగ్గి మందముగానుండును. నాడి సున్నితముగా విడచి విడచి కొట్టుకొనును. మధ్యమధ్య ఒకదెబ్బ లోపించును. గుండెదడ - ఆరాటము, విచారము, దిగులు, బెంగ, నిద్రపట్టకుండుటకు వాడవలెను. నీరసమువలన మేడ వగైరా ఎత్తుప్రదేశములను ఎక్కుటచే ఊపిరాడక ఆయాసము కలుగును. గుండె నీరసముచే చెవులహోరు, కళ్ళు చిరట్లుకమ్మి సొమ్మసిల్లుటకు వాడవలెను. భయము, యీకారణముచే స్పృహతప్పి పడిపోదురు నాడి చాల సున్నితముగానుండి ఒకప్పుడు నాడి దొరకుటకూడ కష్టము. నాడి నీరసముగానున్నప్పుడు యీమందును తరచుగా వాడాలి.

15. 'కాలీ-ఫాస్' లోపముచే కలుగు నరముల సంబంధమగు లక్షణములేవి?

ఏ అవయవమునకు పక్షవాతము సంభవించినా "కాలీ-ఫాస్" పనిచేస్తుంది. అన్నిరకముల పక్షవాతములు దీనితో తగ్గును. క్రిమ

ముగా మాట పడిపోవుటకు, మాటగొణుగు పోవుటకు మంచిమందు. జీవశక్తులు కృశించుటకు, నోరు వాసనకు, మలమూత్రములు కుళ్ళు కంపు వేయుటకు అశుచికి వాడవలెను. నరముల నిస్సత్తువ, నొప్పులు దానితో నీరసము, నిస్పృహ. వెలుతురు, ధ్వని బొత్తిగా కిట్టకపోవుట; సంతోషముగాను, ఉత్సాహముగాను ఉన్నప్పుడు, పచార్లు చేయునప్పుడు లక్షణములు ఉపశమించుట. ఒంటరిగానున్నప్పుడు ఉద్రేకించుట.

16. చర్మము, కాళ్ళు – చేతులు; వీనిలో 'కాలీ-ఫాస్' లోపముచే కలుగు వ్యాధులేవి ?

పక్షవాతమువచ్చి కాళ్ళు చేతులు పడిపోవును. కీళ్ళ నొప్పులు, కీళ్ళు పట్లుతప్పును, కీళ్ళు బిగుసుకు పోవును. వేగముగా నడచినచో బాధలుఉద్రేకించి నెమ్మదిగానడచినచో బాధలుఉపశమించును. అసలే కదలక స్థిమితముగానున్ననూ నొప్పులు హెచ్చును. పడిపోయినభాగము నొప్పి, సలుపు; తరుణ. కాలికములు రెండు రకముల కీళ్ళవాతములకు కూడ పనిచేయును. తిమ్మెర్లతో కూడిన నొప్పి, కాళ్ళయందు, చేతుల యందు, చెవులయందు సీతలము చేకలుగుపగుళ్ళుయీమందుతో తగ్గును.

గోరుచుట్లు, కురుపులు, పుళ్ళు వీటినుండి దుర్వాసనతో కూడిన రసి వెలువడుటకు, అందుచే కలుగు నీరస, నిస్రాణలకు వాడవలెను. నీటిపొక్కులు, నీటికుండలు. చర్మము ఒడిలి ముడతలు పడుట; ఒళ్ళు దురద, చీమలు పాకినట్లుండుట; కొవ్వుతో కూడిన పొలుసులు వాటి నుండి దుర్వాసన, అరికాళ్ళు, పాదములు దురద, పగుళ్లు దురద, ఉలారము, మసూచికములో మగత, నీరసము; కుండలనుండి దుర్వాసన వేయు రసి, పొక్కులు తేలకుండినచో తరచు వాడవలెను.

17. "కాలీ-ఫాస్" తో నివారణకాబడు జ్వర లక్షణములేమి ?

దుర్వాసనతోను, దుర్గుణములతోను, సంధి – పరాకుమాటలుగల జ్వరము పేరుతో నిమిత్తములేకుండా యీ మందుతో కుదు

రును. సన్నిపాతజ్వరం, దోషగుణం, సూతికా జ్వరం యీ మొదలగు రక్తదోషములతో కూడిన జ్వరములీమందుతో తగ్గును. సంధి, మగత పరాకుమాటలు, నీరసము, నిస్సత్తువ, అమితమగు జ్వరము, నాడి నీరసముగా నుండుటకు వాడవలెను మలమూత్రిములు దుర్వాసన.

18. "కాలీ-ఫాస్"కు నిద్ర సంబంధమగు లక్షణములేవి ?

ఆవులింతలు, ఒళ్ళు విరుపులు, బద్ధకం, మగత, నిద్రలో లేచి వెళ్ళిపోవుట.

నిద్ర పట్టకుండుట, దిగులు; జెంగచే కండ్లు పొడారి నిద్ర పట్టకుండుట, రక్తము విస్తారముగా సిరస్సులోనికి ప్రసరించుటచే తల దిమ్ము, బరువు, నిద్ర పట్టకుండుట.

19. "కాలీ-ఫాస్" ఋజువుచేయబడినదా ?

ఎక్కువ పొటెన్సీలో ఋజువు చేయబడినదేగాని సరియగు వివరములు సేకరింపబడలేదు. యీ హేతువుచే ఆ లక్షణములపై ఆధారపడుట సమంజసముకాదు. ఈ మధ్యనే డా॥ జార్జిరోయల్ అను లోవా విశ్వవిద్యాలయం అధ్యాపకులు దీనిని పూర్తిగా ఋజువు (Proving) చేసియున్నారు.

## 80. కాలీ - సల్ఫ్యూరికం (Kali-Sulphuricum)

(ఇదియొక ద్వాదశకోశ లవణము)

1. "కాలీ-సల్ఫ్యూరికం" యొక్క సాధారణ కార్యనిర్వాహణమును క్లుప్తముగా వ్రాయుము.

"కాలీ-సల్ఫ్యూరికం"కు చర్మోపరిభాగము (Epidermis)ఆమత్వల అంతర్భాగము ప్రధాన కేంద్రములు. ఇది ప్రాణ వాయువును

ప్రసరింపజేసి అన్నివిధముల "కాలీ-ఫాస్"కు చేదోడు వాదోడుగా నుండును. రక్తము ఊపిరి తిత్తులలోని ప్రాణవాయువును సేకరించి శరీరమందుగల ప్రతి లవణమునకు కావలసినంతగా సరఫరా చేయును. "కాలీ-ఫాస్" "ఫెర్రం-ఫాస్"ల సహాయము దీనికి చాల అగత్యము. "కాలీ-సల్ఫ్" శరీరమందు తగినంతగా లేకుండిన చర్మపరిభాగము లోను, అమత్వచల అంతర్భాగములోను తగినంత ప్రాణవాయువు లేకుండుట సంభవించి చలి, కుదుపు, భారము, నిస్సత్తువ, గుండె దడ, ఆరాటము, దిగులు, విచారము, శిరోభాగము, శరీరమందు నొప్పులు కలుగుట సంభవము.

"కాలీ-సల్ఫ్"చర్మమందలి పగుళ్లు, పుళ్ళు, చర్మము పక్కులు కట్టుటకు పనిచేయును. మసూచికము, ఆటలమ్మ, విసర్పి మొదలగు వ్యాధులలో శరీరమును త్వరలో ఆర్చి క్రొత్తచర్మమును పట్టించును.

దీని లక్షణములన్నియు సాయంసమయమున వేడిగదిలో నుండు టచే ఉద్రేకించును; చల్లగాలిసోకిన ఉపశమించును. స్రావములన్నియు పసుపురంగుగా నుండును. నాలుక పసుపురంగు పాచినికలిగి యుండు టను గమనించవలెను. అన్ని విషయములలోను ఇది "పల్సటిల్లా" ను పోలియుండును.

2. ఒకటిన్నర పుటలకు మించకుండా శరీరమందు 'కాలీ-సల్ఫ్' లో పించుటచే వివిధావయవములయందు జనించు ప్రధాన లక్షణము లను వ్రాయుము.

శిరస్సు : చుండ్రు, తలవెంట్రుకలూడుట, సీతగాలిచే నుపశ మించు శిరోభారము, తల నొప్పి, పసుపురంగు స్రావముతో కూడిన తలయందలి కురుపులు, జిగటగానుండు పసుపురంగు స్రావముచే అట్టలుకట్టు పక్కులకు పనిచేయును నాలుక రంగు గుర్తించవలె చ

కళ్లు : పసుపు పచ్చగాగాని లేక పసుపు, ఆకురంగుల మిశ్రిమ మగు పుసులు, జిగటగానుండు స్రావము. కొన్ని సమయములలో కంటినుండియు, రెప్పల నుండియు నీరుకారుట; కంటి కలకలు; మేహ పటలములు (Cataract) దృష్టిమాంద్యము; కంటి మసకలు, యీ మందుతో తగ్గును.

ముక్కు : పడిశముయొక్క ప్రిథమావస్థలో యీ లవణము తరచుగా వాడిన వెంటనే తగ్గిపోవును. చర్మము పొడి ఆరి చమట పట్టక 'బిరబిర' లాడుచుండును. ఈ మందు చమటలు పట్టించును. రొంపలోకూడ చమటలు పట్టుటచే రొంపభారము విగజారి మనస్సుకు సుఖమునిచ్చును. ముక్కు దిబ్బడ, ముక్కులో చిక్కని ఆకురంగు చీమిడి వున్నప్పుడు పనిచేయును.

ముఖము : ముఖమందలి నరములనొప్పి; విడచి విడచి స్థల మార్పులతోకూడిన పోటు, నొప్పి; సాయంకాలము ఉద్రేకించుట, సీతగాలిలో ఉపశమించుట; ముఖమందు, ముక్కుయందు జనించు పుట్టు రణములు (Cancer).

నోరు : పెదవులపై కేన్సర్. దీని ప్రత్యేక గ్రాసములు, ఉద్రేకోపశమనములను గుర్తించవలెను. క్రింది పెదవి తడిలేక పొడారి ఉండును. చర్మము పెద్దపెద్ద పొలుసులుగా ఊడిపోవును. పళ్ళ పోటు సాయంకాలము. వచ్చును; లేదా ఉద్రేకించును. నోరు అరుచి. లేక ఉప్పన. నాలుకపై పసుపురంగు పాచి; ఒకప్పుడు నాలుక ఓరచలు తెల్లగా నుండును.

జఠర లక్షణములు : అగ్నిమాంద్యము, అజీర్తి, కడుపు బరువు, నొప్పి; వేడిపానీయములు పడవు. కొద్దిపాటి దాహముకూడ ఉండదు. సాయంకాలము ఉద్రేకించు జఠరజ్వరము; చమట పట్టక శరీరము

పొడారి వుండును. శూల – 'మెగ్నీషియాఫాస్' వలన తగ్గనప్పుడు వాడవలెను.

ఉదరము, మలము : పశుపురంగు ఆంబవిరోచనములు. దారుణమగు వేడినుంచి అకస్మాత్తుగా సీతలమునకు మారుటచే కలుగు కడుపులో పోట్లు లేక శూలనొప్పి. పొట్టను తాకిన చల్లగానుండును. గంధకపువాసనగల అపానువాయువులు. వుండుతో కూడిన మూలశంక. కడుపుఉబ్బు. సన్నిపాతజ్వరము, దోషగుణజ్వరము సాయంకాలము ఉద్రేకించును.

మూత్రకృచ్ఛ్రపువాపు – మూడవ అవస్థ : పశుపురంగుస్రావము మూత్రవాహినినుండి వెడలునప్పుడు వాడవలెను.

జననేంద్రియములు : శగవ్యాధిజీర్ణించి పశుపుపచ్చగా స్రవించునప్పుడు, సవాయిబాధలు సాయంకాలము ఉద్రేకించునప్పుడు వాడవలయును.

స్త్రీలకు నెలసరి ఆలశ్యముగాను, స్వల్పముగాను ఆగునప్పుడు, ముందుపొట్ట ఎత్తుగానుండి బరువుగా నుండునప్పుడు, పశుపురంగు కుసుమ అగునప్పుడు యీమందు పనిచేయును.

శ్వాసకోశములు : పశుపురంగు కఫము, కళ్ళితో కూడినశ్వాసకోశములవ్యాధులకు, బాధలన్నియు సాయంసమయమునను, ఉష్ణముచేతను ఉద్రేకించి, చల్లనిగాలిలో ఉపశమించుటకు వాడవలెను. ఊపిరితిత్తులవాపు, క్షయ సాయంకాలమువచ్చు జ్వరములకు గినిస్వాభావికనాలుక రంగుఉన్నప్పుడు పనిచేయును.

పశుపుపచ్చని జిగురుగా తీగలుసాగు కఫము, కళ్ళి, దగ్గు. కఫము తెగిపడదు; వెనుకకుదార్లి గొంతుగలోనికి పోవుటవలన మింగివేయబడును (కళ్లి). కింకవాయువు – గురక, దగ్గు, స్వరపేటి బల

హీనమై మాట్లాడినచో నీరసము, అలసట. పసుపుపచ్చని కఫముతో కూడిన విషపడిశము. గురక, ఛాతీలో కఫము-"గుర - గుర" మను చుండును. ఊపిరాడదు, ఆయాసము వేడిగదిలో వుక్కిరి బిక్కిరగుట-ఈ హేతువుచే చల్లగాలిలో నికిపోయిన శ్వాస బాగాఆడును. నాడిధనా రించుచు దుడుకుగానుండును. శరీరము చమటపట్టక వెచ్చగానుండి పొడిఆరి "బిర, బిర" లాడుచుండును.

వెన్ను - కాళ్ళుచేతులు : కీళ్లనొప్పులు, ఒకకీలునుండిమరొక కీలుకు నొప్పులు తరచు మారుచుండును. కీళ్లనొప్పులు సాయంకాలము వేడిగదిలో వుద్రేకించి చల్లగాలిలో ఉపశమించును.

చర్మము : వెచ్చగానుండిపొడారియుండును. కొద్దిపాటి చమట కూడ పట్టదు. పసుపురంగుగల పల్చని స్రావములతో కూడిన పుళ్లు కురుపులు; చర్మము పొలుసులుకట్టును. చర్మవ్యాధులలో పొక్కులు అణగి చర్మము పొడిఆరి ఉండును. చుండ్రు, గోళ్ళవ్యాధులు, చమట పట్టి జ్వరముతగ్గుటకు అన్నిజ్వరములలోను "ఫెర్రం-ఫాస్"తో వాడ వలెను. చర్మవ్యాధులలో పక్కుకట్టి పొడిఆరి కొత్తచర్మముపట్టించు టకు ఘనమైనమందు.

జ్వరలక్షణములు : సాయంకాలము ఉద్రేకించును. రక్తదోష జ్వరములకు దీనిని తరచుగావాడిన చమటలుపట్టి జ్వరముతగ్గును. 'ఫెర్రం-ఫాస్'తో సహా దీనిని తరచు వాడవలెను. కొత్తచర్మమును పట్టించుటకు మంచిమందు. భయంకరమగు కలలు.

3. హోమియోపతి వైద్యరీత్యా "కాలీ-సల్ఫ్" ఎన్నడైనను ఉపయో గింపబడినదా ?

లేదు, షూజ్లర్ మహాశయులు దీని ప్రశస్త్యతను తెలిపినతరు వాత వాడుచున్నారు. ఇది ఋజువుచేయబడలేదు. అంతర్యామునకు

పోయి పనిచేయు పంటిపోరిక్. అనుభవముపై పెక్కు ఋగ్మతలు కుదురుటచే వాటిని సేకరించి వాడితిమని "కెంటు" గారు వ్రాసి యున్నారు.

## 81. క్రియసోట్ (Kreosotum)

1. 'క్రియసోట్'యొక్క ప్రస్ఫుటమగు ప్రధానమైనలక్షణములేమి ?

(1) ఒరుపుకలిగించుచు దుర్వాసన, మంటతోకూడిన స్రావములు.

(2) శరీరమంతయు రక్తప్రసరణచేకలుగు ఛనారింపు.

(3) చిన్నపుళ్ళనుండికూడ అమితరక్తస్రావము, రక్తస్రావ తత్వము. ముక్కునుండియు, మూత్రద్వారమునుండియు, లాలాజల ముతోను రక్తస్రావము. పళ్ళు ఊడపీకుటకు ముందు ఒక్కమోతాదు యిచ్చిన అంతగా రక్తము వెడలదు.

(4) మూత్రము హటాత్తుగా ఉబ్బుకొనివచ్చును. వెంటనే పరుగెత్తనిచో బట్టలోనే అగును. తొలిఝామురాత్రి బిడ్డలు నిద్రలో విస్తారము మూత్రమువిడచి బట్టలు తడుపుదురు.

(5) ఇగుళ్ళువాపు, నొప్పి, వాచి ఎర్రగాను ఊదారంగుగాను ఉంటాయి. పళ్ళు బైటకువచ్చినవెంటనే సిధిలమవుతాయి.

(6) పిల్లలకు విసూచి (కలరా) పెద్దపెద్దవాంతులు, కుళ్ళు వాసనగల విరోచనములు.

2. 'క్రియసోట్'కుగల మానసిక లక్షణములేమి ?

రోగికి ఏదియు సరిపడనంత ముక్కోపము. తృప్తిలేని మితిమీరిన కోరికలు; అన్నియు కోరుటలు; కోరినవస్తువుయు దొరకినా తృప్తి

లేదు. తెచ్చియిచ్చినదల్లా విసరికొట్టడం; అంతులేని కోరికలు. పిల్లాడు ఆటవస్తువులుచూచి మారాముంచేసినప్పుడు అది తెచ్చియిస్తే ముఖం పై విసరుతాడు. దేనివల్లా తృప్తిపడడు.

3. మూత్రలక్షణములలో దీనికి ప్రత్యేకత కలదని 'నేష్' వ్రాస్తారు; అది ఎట్లు ?

(1) తెల్లనిమూత్రం అమితంగా పోతుంది.

(2) మూత్రం హటాత్తుగా ఉబ్బుకువస్తుంది (పెట్రోసెలినం) ఆపుకో లేరు. తక్షణం పరుగెత్తాలి, లేకుంటే బట్టలో అవుతుంది.

(3) నిద్ర తొలిఝామములో పిల్లలు మూత్రంపోసి బట్టలు తడుపుతారు. విస్తారం తెలియకుండా నిద్రలోనే పోస్తారు; మెళుకువ రాదు. (సేపియా)

(4) పడుండి మూత్రవిసర్జన (కూర్చుండి వెనక్కువంగాలి - 'జింకం')

(5) మధుమేహం - మూత్రంలో స్యుగర్.

(6) మూత్రంలో రక్తం, రక్తకుదుపలతో మూత్రం, మూత్రం వలన ఒరుపు, మంట.

4. 'క్రియసోట్'కు ఒరుపు పుట్టించు స్రావాలు, రక్తస్రావాలు వీటిని గురించి వివరింపుము.

సాధారణంగా గుండుసూదితో గుచ్చితే ఒకచుక్క రక్తం మాత్రమే స్రవిస్తుంది; యీామందుకు అట్లుకాక విపరీతంగా కారు తుంది, రక్తంకట్టదు. రొంపపట్టి ముక్కునుండిపడే చీమిడితో రక్తం పడుతుంది. పరీక్షనిమిత్తం నాళికతో నాలుకనొక్కితే రక్తం చెమురు స్తుంది. కళ్లు ఎరుపెక్కివాచి కళ్ళవెంట రక్తంకారుతుంది. మూత్రి

వాహినిగుండా రక్తస్రావము. ముక్కునుండి, కళ్ళనుండి, గర్భాశయము మునుండి రక్తస్రావం. సంభోగానంతరము యోనినుండి రక్తస్రావము. పుళ్ళనుంచి, వ్రణములనుండి రక్తస్రావము. ఈవిధంగా యీమందుకు అన్నికోశాలనుండి రక్తంకారుతుంది. రుతురక్తం ముక్కుటంగాపోతూ చాలకాలం అవుతుంది.

కంటివెంటనీరు, యీనీరు తగిలినచోట ఒరుపు, మంట, రెప్పల ఓంచలు ఒరిసి ఎర్రగా రక్తకండల్లా వుంటాయి. చంపలు తడిసి ఒరుపు, మంట, పెదవులు, నోటికొసలు, నాలుక, నోరు ఒరిసి ఎరుపెక్కిమండు తాయి. లాలాజలము ఒరుపు, మంట.

కళ్ళుఒరుపు, ఎరుపు, మంట. పసుపురంగుకుసుమ ఒరుపు, మంట కలిగిస్తుంది. యోనిఅంతయూ ఎర్రగా ఒరిసి వాచి మంటగావుంటుంది. సంభోగసమయంలో యోని మంట, బాధ. సంభోగానంతరం యోని నుండి రక్తస్రావం. సంభోగసమయములో పురుష మర్మావయవము స్త్రీ మర్మావయవమునందుండి వెడలెడి శోణితములోతడిసి మంట, ఒరుపు, తీపు. మూత్రము మంట, ఒరుపు.

5. 'క్రియసోట్'కు సంబంధించిన ఉదర లక్షణములేమి ?

భోజనముచేసిన గంట లేక రెండు గంటలకు తినిన అన్నము అరుగక వమనమగును. కడుపులో మంట, వికారము. నీరు త్రాగిన వెనుక చాలసేపు నోరుచేదు, అరుచి. సీతలపానీయములు, ఆహారముచే వుద్రేకము. వెచ్చని ఆహారపానీయాలుచే వుపశమనము. పిల్లలకు పళ్ళువచ్చు సమయమున, వేసవికాలమున విరోచనములు, వాంతులు. శిశువులకు పళ్ళువచ్చు సమయంలో కలరా, విపరీతమగు వాంతులు. దుర్వాసనవేయు విరోచనములు.

వేవిళ్ళకు మంచి మందు.

వుదరమందలివుట్టు వ్రణములకు, జీర్ణకోశసంబంధమగు భయంకర వ్యాధులకు బాధనుపోనార్చి వుపశమింపజేయు దివ్యౌషధము.

6. స్త్రీలకు "క్రియసోట్"వలన ఏలక్షణములు పుట్టును ?

ఋతుకాలమందు చెవులు ఘుడియలుపడును, హోరు, ధ్వనులు, మంట. ఋతుశూల – మైల విస్తారముగా చాలకాలమువరకు అగును. ఋతువు స్రవించినకొలది ఋతుశూల తగ్గును. పరున్నప్పుడు ఋతుస్రావముఅగుట, లేచి కూర్చున్నను, పచార్లుచేసినను ఋతువు స్రవించడం మానుట సహజము. చల్లని పానీయములు సేవించిన ఋతుశూల తగ్గును. మైల విడచి విడచి అగును. ఒకప్పుడు పూర్తిగా తగ్గిపోయి మరల విస్తారముగా అగును. (సల్ఫర్)

మంట, ఒరుపుగల కుసుమ; దుర్వాసన; ఋతుకాలములకు మధ్యలో పసుపురంగు కుసుమ. పిండివలె బట్ట అట్టకట్టి బట్టపై పసుపురంగు మరక అగును.

గర్భవతులకు తియ్యని నీరు వాంతియగును.

ప్రసవానంతరము మైల (Lochia) నల్లగా బూడిదరంగుగా ముద్దగా మంట ఒరుపుతోనగును. పూర్తిగా నిలచిపోయి తిరిగి తిరిగి ప్రారంభించును. యోని దురద, మంట.

గర్భాశయములో పుట్టువ్రణము, దానినుండి రక్తస్రావము ఒరుపు, మంటతో కూడియుండును. రక్తము కుదప కుదపలుగా నుండును. నడుములో విస్తారం సలుపు, పోటు. స్తనములలో వ్రణము-వ్రణబాధలను వుపశమింపజేయుటకు దీనిని మించినదిలేదు. సంభోగానంతరము యోనినుండి రక్తస్రావము. ఒరుపు, మంట, పోటు.

# 82. లేక్-కేనినం (Lac Caninum)

(కుక్క-పాలు)

1. "లేక్ - కేనినం" యొక్క ప్రధాన మానసిక లక్షణములను వ్రాయుము.

నరముల దౌర్బల్యముగల అతిసున్నిత తత్వముకల ఆరాటం చెందే శరీరధారులకు వుపయోగిస్తుంది. అతిపరాకు. జ్ఞాపకశక్తి బొత్తిగా లోపిస్తుంది. బజారుల్లో సరుకులుకొని అక్కడే మరచిపోయి వట్టిచేతులతో వస్తాడు. (ఎనకార్డియం, కాస్టికం) వ్రాతలో అనవసరపు మాటలు విస్తారంగా పడుతాయి. కావలసిన అసలు పదముమాత్రం తట్టదు. వ్రాతలో మాటయొక్క చివరఅక్షరంపడదు. చదువునప్పుడు బుద్ధిని కేంద్రీకరింపలేదు.

నిరాశ, అధైర్యం, వ్యాధికుదరదని. లాభంలేదని పెదవి విరచి అకారణమగు అధైర్యపడుతాడు. లోకమంతా అంధకారంగా గోచరిస్తుంది. అవునన్న స్నేహితుడొక్కడూ కనుపించడు. అకారణంగానే ఏడుపొస్తుంది.

పిల్లలు తెరిపిలేని యేడుపు, మంకుతనం, ముఖ్యంగా రాత్రి కాలంలో హెచ్చు (జేలప్, సోరినం).

గాలిలో తేలిపోతున్నట్లు భావం, పక్కనుండి తేలిపోతున్నట్లు భావం. తనముక్కు తనదికాదని ఎదువుది అని భావన. ఎటుచూచినా పాములే. స్థిరత్వం ఉండదు. ఏపనిని కొనసాగించదు, ప్రారంభించి మానేస్తాడు. ఒంటరిగా వుండలేడు.. భయం, చస్తానని భయం (ఆస్న) పిచ్చెక్కుతుందని భయం, పడిపోతానని భీతావహం, అంతయూ అంధకారబంధురం. ఎచ్చటనుండియో యేదో ధ్వనివస్తున్నట్లుంటుంది.

ప్రళయకోపం, తిట్టడం, ఒట్టుపెట్టుకోవడం. చాల హేయమైన ప్రవర్తన, చూచేవాళ్లకు అసహ్యంగా వుంటుంది. కళ్లుమూస్తే పాములు. విషజంతువులు గోచరిస్తాయి.

2. "లేక్ - కేనినం"యొక్క ప్రధాన నైసర్గిక లక్షణములు నాలుగు ఏవి ?

వాపులు, నొప్పులు, అయిమూలగా ఒకచోటనుండి వేరొక మూలకు ప్రాకును. మరల తిరిగి యథాస్థానానికి చేరుతాయి. ఒకప్పుడు ఒక వెంపునుండి మరొక వెంపుకు హటాత్తుగామారి తిరిగి కొన్నిగంటలకో, రోజులకో మొదట ప్రారంభించిన వెంపుకు రావడం యీమందు యొక్క సహజ నిర్దిష్టలక్షణం. ఒక వెంపునుండి వేరొక వెంపుకు రోగలక్షణాలు మారుతాయి. ( శ్లేష్మవాతం - టాన్సిల్సు - తల నొప్పి వగైరా).

పుళ్ళు:— అంగుడుపుండు దీనిపై నిగనిగలాడుచూ వెండిలా మెరసే తెల్లని పొర.

సున్నితమగు చర్మం. ఏమాత్రంతాకినా భరించలేదు.

3. స్త్రీల బాధలలో వేనికి "లేక్ - కేనినం" మందుగా పనిచేయును ?

నెల కాకముందే ఋతుమతి కావడం, ఋతువు ఎక్కువగాఅవడం. ఆగిఆగి ఎక్కువగా అవడం, పైల ఎట్టిగా జిగటలుసాగుతూ తీగలలా అవుతుంది. ఋతుకాలంలో స్థనాలువాచి బరువెక్కుతాయి. (కోనియం)

యోనినుండి గాలిపోతుంది (సార్సప, లైకో, బ్రోమియం) రొమ్ములువాచి బాధగానుండి కదిలినా మెదలినా భరించరానిబాధ. మేడ ఎక్కినను, దిగినను బాధకలుగునుగాన స్థనాలను అదిమిపట్టుకో

వాలి (బై)). పాలు ఆరిపోయేందుకు మంచిమందు. (పాలు పడాలన్నా, వృద్ధికావాలన్నా "లేక్-డిప్లరేటం") పిల్లలకు పాలిచ్చేకాలంలో అకారణంగా పాలుఎండిపోతాయి. కదిలినా, మెదిలినా, తాకినా, నొక్కినా, నడచినా జననేంద్రియాలు వుత్తేజపడుతాయి. ఋతుకాలంలో గొంతు బొంగురోతుంది. స్థనాలు వాస్తాయి.

4. "లేక్-కేనినం" కలిగించే గొంతుగ, నాసికలక్షణములేవి ?

పడిశము:—చిక్కని, తెల్లని ఆసమము వెడలును. ఒకపోణము దిబ్బడగావుండి రెండవపోణమునుండి నీటివంటి స్రావము. ఈలాఒకటి విడిచి మరొకటి మారుతాయి. ముక్కు-స్రావము ఒరుపు - పెదవి, ముక్కు ఒరుపు, పచ్చి.

అంగుడువుండు, టాన్సిలిటిస్- ఇవివాచి ఒక వెంపునుండిమరొక వెంపుకు వాపు మారుతుంది.

గొంతుగనొప్పి:— దగ్గు, ఋతుకాలంలో ప్రారంభించి మైల పూర్తిగాతగ్గి తరువాత వుపశమిస్తుంది. గొంతుగను తాకినచో భరించలేదు, వట్టి గుటకవేసినచో బాధ. తరచు గుటకవేయాలనేవాంఛ; నొప్పి; నొప్పి చెవిలోనికి పోతుస్తుంది. ఎడమవెంపు ప్రారంభిస్తుంది (లెకేసిస్). గొంతుగకు ఉపయోగపడు మందులలో దీనికి మించినదిలేదు.

## 83. లెకెసిస్ (Lachesis)

1. "లెకెసిస్" అనగానేమి ?

దక్షిణఅమెరికా దేశమందలి ఒక గొప్ప సర్పము, దీనిపొడవు మూడు మొదలు పదినాలుగు అడుగులు. మనదేశమందుగల చిన్న కొండచిలువను పోలియుండును. ఆదిలో ఫిలడల్ఫియా దేశస్థుడు

డా. హెరింగు దీనివిషము (గరళము)ను ఉపయోగించిరి. ఇది త్రిదోషము (మియాజం)లు గల ఆంతర్యమునకుపోయి పనిచేయుమందు.

2. "లెకెసిస్" యొక్క పది సాధారణ నైసర్గిక లక్షణములను తెల్పుము ?

(అ) శరీరం అతిసున్నితంగా ఉంటుంది. కంఠముచుట్టునా ఏమాత్రం బట్టవున్నా ఉక్కిరిబిక్కిరి అవుతారు; ఈహేతువుచే చొక్కా బొత్తాములుకూడా పెట్టుకోరు. బట్టలుచాల వోదులుగా ఉండాలి.

(ఆ) దీనిలో రుగ్మతలు సాధారణంగా ఎడమ వంపు వస్తాయి; లేదా ఎడమపై పునపుట్టి క్రమంగా కుడికి ప్రాకుతాయి (గొంతులోని ఉండలు).

(ఇ) నిద్రలేచినతర్వాత వ్యాధిలక్షణాలు ఉద్రేకిస్తాయి. ముఖ్యంగా విచారం, దిగులు, బెంగ, గుండెదడ, తలనొప్పి.

(ఈ) స్త్రీలకు ముట్లుడిగేరోజులలో వచ్చేడి వ్యాధులకు దీనిని మించినమందు లేదు.

(ఉ) చర్మముపై వాపులు, కురుపులు. యివన్నియు ఊదారంగుగా వుంటాయి. అతిసున్నితం, ఈగవాల్తే బాధ, రక్తం.

(ఊ) అతి నీరసం, నిస్త్రాణ, దడ. వణకు, నాలుకచాస్తే వణుకుతుంది.

(ఋ) రక్తస్రావాలు. రక్తం గడ్డకట్టదు; ఎంతచిన్నగాయమైనా రక్తం మాత్రం ఎక్కువ.

(ౠ) బక్కపలచగా సన్నంగా, బక్కచిక్కినవాళ్ళకు బాగా పని చేస్తుంది.

(ఇ) విచారం, బెంగ, దిగులు, భయం; ఆరాటం, అసూయ, ఈర్ష్య, వీటి వల్ల కాని లేక ప్రేమింపబడ్డవానివలన మోసగింపబడుట చేతగాని వచ్చు వ్యాధులకు పనిచేస్తుంది.

(ఈ) అమితమగు వేడి లేక మితిమీరిన సీతలంచేత – సీర్సం, నిస్సత్తువ.

3. "లెకెసిస్"కు స్వతసిద్ధమగు మానసిక లక్షణములేమి ?

అతివాగుడు, తుదా మొదలూ ఉండదు. ఒకవిషయం మాట్లాడు చూ యింకో విషయంలోకి పోతాడు. ఈర్ష్య, అసూయ, ఓర్వలేని తనం, విషంపెట్టి చంపుతారనే అనుమానం, మందుకూడపుచ్చుకోడు. సంధి, గొణుగుడు. సీర్సంచేత క్రిందిదవుడ జారిపోతుంది. పిచ్చి ఊహాలు; తాను వదో గొప్ప దేవతయొక్క ఆధ్వర్యంలో ఉన్నట్లు తలంపు, మరుపు; పరధ్యాన్నంచే వ్రాసేటప్పుడు తప్పులువ్రాస్తాడు. ఎక్కువ దుఖం, నిస్పృహ, నిరుత్సాహం.

4. "లెకెసిస్" కలిగించు సిరోబాధలేమి ?

ఎండలో తిరిగితే తలనొప్పి, కొద్దిపాటి ఎండతాపంకూడ భరించలేడు. ఇది తాత్కాలిక మైనదైనచో "గ్లోనైన్" పనిచేస్తుంది. కాని తరచు కాలికంగా తలనొప్పివస్తుంటే "లెకెసిస్" వాడాలి. నిద్ర లేవడంతోనే ఉదయం తలనొప్పి, నశి నెత్తిని బరువు, భారం, మంట (కేక్టస్, గ్లోనైన్). నిద్రలేచిన వెంటనే ఉంటుంది. శీర్సం, మనో వ్యాకులత. ఒంటెపట్టి ప్రాణం వెడలక నిలచిపోవుటచే తలనుండి ముక్కులోనికి వ్యాపించే తలనొప్పి, విపరీతంగా తుమ్ములు, నిద్రానంతరం బాధలన్నియు ఉద్రేకించును గనుక రోగి నిద్రపోవుటకు భయపడుతాడు.

5. జీర్ణవాహినిపై "లెకెసిస్" ప్రభావమునుగూర్చి వ్రాయుము ?

జీర్ణకోశాలకు సంబంధించిన వ్యాధులలో అద్వితీయంగా పని చేస్తుంది. ఇగుళ్ళు తరచువాచి మెత్తబడి అమితంగా రక్తంకారుతూ ఉంటాయి. దీనికి సాధారణంగా "మెర్క్యూరియస్-వి" వాడుతాము. కాని యిగుళ్ళు ఈలావాచి రక్తం కారుతూ ఊదాగాఉంటే 'లెకె సిస్' వాడాలి. నాలుక పొడారిపోతుంది, కష్టంమీాదగాని ముందుకు రాదు. నాలుక బైటకుతీస్తే వణకిపోతుంది. నీరసంచే నాలుక కరుచు కుంటాడు. క్షయవ్యాధియొక్క అంత్యావస్థలలో విపరీతబాధతో కూడిన నోటిపూతలకు మంచిమందు.

గొంతుగ, మెడ, అతిసున్నితంగా ఉంటాయి. రోగి తనమెడను గొంతుగను తాకనివ్వడు. బట్టతాకుడుకుకూడ 'మొర్రో'అని గోల చేస్తాడు. ద్రవపదార్థాలకంటె ఘనపదార్థాలు సునాయాసంగా గుటక పడుతాయి. వట్టిగుటకవేసినా, నీరుత్రాగినా నొప్పి. గొంతుగలో నుంచి బాధలు చెవులలోకల్లా పోడుస్తాయి. అంగుడుపుండు, టాన్సి లైటిస్ - వ్యాదిలో ముందు వాపు ఎడమవైపు ప్రారంభించి కుడి వైపుకు వ్యాపిస్తుంది. నిద్రలేచినతరువాత వచ్చే యీబాధలన్నీ వేడి పానీయాలవల్లకూడ ఉద్రేకిస్తాయి. సవాయి జీర్ణించుటచే వచ్చే గొంతుగపుండ్లకు, గేంగ్రినులకు కూడ యీమందు పనిచేస్తుంది. కడుపు ఉబ్బి చాల బాధగాఉంటుంది, పొట్ట ఉపరిభాగంలోఉండే సున్నిత మగు నరాలు ప్రకోపించి ఉండడంచే కట్టుకున్న బట్టవత్తిడినికూడ పొట్ట సహించలేక బాధపడుతుంది.

ఆసనం క్రిందకు దిగలాగుతూ ఉబ్బుకువస్తూన్నట్లుండి మలవిసర్జ నకు వెడితే ఆసనం మూసుకుపోయి విపరీతంగా బాధలుహెచ్చడంచే అసలుప్రయత్నమే మానుకుంటాడు. మలం భరించరాని దుర్వాసన.

విరిగిపోయినరక్తం స్రవిస్తుంది. ఈలా సన్నిపాతజ్వరంలోను, విషజ్వరాల్లోను విరిగిన రక్తంతో కూడిన మలం కుళ్ళువాసనతో కూడి బైటపడుతుంది. మూలశంఖవ్యాధిలో రక్తం విస్తారంపోతుంది. ఆసనంలో చిగలాగుతున్నట్లు, చిన్న సుత్తులతో కొడుతూన్నట్లు ధరిస్తూఉంటుంది. పెదవులనుండి ఆసనంవరకూ యిలాగే "లెకేసిస్"కు బాధలుంటాయి.

6. స్త్రీ జననావయవములపై "లెకేసిస్" లక్షణములేమి ?

ఎడమ అండాశయములో పోట్లు, వాపు, కంతులు, కణుపులు. పుట్టువర్ణము – ప్రారంభమై కుడితట్టుకు వ్యాపిస్తాయి. గర్భంలో ఋతుశూల క్రమంగా హెచ్చి ఋతుస్రావం మొదలిగుండా వెడలిన కొలదీ బాధ క్రమంగా తగ్గుతుంది. తిరిగి కొన్నిగంటల్లోగాని రోజులకుగాని ఇదేరీతిగా బాధలువచ్చి తగ్గుతుంటాయి. తరచు విడవకుండా వొకేరీతిగా గర్భాశయంనుంచి వచ్చేరక్తస్రావాలకు దివ్యమగుమందు. వేడి – మంటలు, శగలు – పొగలు, నడినెత్తిని మంట – బరువు. ముఖం పాలిపోయి వెలవెలలాడుతూఉండి నీరసం, నిసత్తువులతో సొమ్మసిల్లిపోతూఉంటుంది. ముట్లుడిగేకాలంలో స్త్రీలకు యీలక్షణాలుంటాయి. ఆసమయంలో వచ్చే భరించరాని బాధలనన్నిటినీ తగ్గిస్తుంది.

స్థనాలలోగాని, గర్భాశయంలోగాని జనించే పుట్టువ్రణానికి వాడదగుమందు. కేన్సర్ సంబంధమగు పోట్లకు, విపరీత రక్తస్రావానికి మంటకు దీనికిమించిన మందులేదు. పూదారంగుగానుండుటను మాత్రము గమనించవలెను.

7. శ్వాసకోశములు, ఛాతీ వీటిపై "లెకేసిస్" ప్రభావమేమి ?

సర్వనాడులకు పక్షవాతం, అందుచే మాట పడిపోతుంది, మాటరాదు. స్వరపేటిబాధ, దానిని తాకినమాత్రాన ఉక్కిరిబిక్కిరిఅవు

తాడు. కింకవాయువునకు దివ్యమగుమందు. నిద్రలో బిడ్డకు ఊపి రాడదు - బాధ విపరీతంగా హెచ్చిపోతుంది. శ్వాస నిలచిపోతుంది, శ్వాస ఆడదు, కదలినా మెదలినా విపరీతమగు ఆయాసం. ముక్కు, నోరుకు ముందు అడ్డుఏమాత్రముఉన్నా ఊపిరాడదు. ఆయాసం, ఉక్కిరిబిక్కిరి.

ఉబ్బసంలో శగలు, పొగలు, కంఠముపై బట్టలు వాదులు చెయ్యాలి. విపరీతమగు విరామంలేని పొడిదగ్గు. నిద్దురలో తెలియకుండాదగ్గు. గుండె జబ్బుతో కూడిన పొడిదగ్గుకు 'లెకేసిస్' దివ్యమైన మందు. ఆసనములోను, ఆసనకండరములోను దగ్గితే పోటు - చురుకు బాధ.

సన్నిపాతజ్వరంలో ఊపిరితిత్తులు చెడినప్పుడు దివ్యమగుమందు.

8. "లెకేసిస్"కు నరములకు సంబంధించిన వ్యాధిలక్షణాలేవి ?

నీరసం, నిస్సత్తువుచే దడదడ, నిస్త్రాణచే రోగి కృంగిపోతాడు. నిద్రపోతే రోగి కోలుకోకపోవటమే కాకుండా బాధలుహెచ్చి మరింత నీరసిస్తాడు. దీనితోపాటు గుండెల్లో పోట్లు, బాధలుకలిగి వ్యాధిక్రమంగాముదిరి పక్షవాతంలోకి దిగుతుంది. అన్నివ్యాధుల్లాగే పక్షవాతం కూడ ఎడమవైపునేవస్తుంది. నిస్సత్తువ వలనగాని, మానసిక శ్రమ అధికమగుటవలనగాని, రుద్రవాతంచేగాని యీవిధంగా ఎడమవైపున పక్షవాతం రావచ్చు. ఆస్థితిలో "లెకేసిస్" మంచి ఫలితాలనిస్తుంది.

9. ఎండకాలంలోవాడే మందులేవి ? అందు "లెకేసిస్" యొక్కలక్షణములేవి ?

వంటిమోనియం క్రూడం జల్సిమియం గ్లోనైన్, నేట్రంకార్బ నేట్రం-మూర్, లెకేసిస్.

'లెకేసిస్':—నిస్రాణ, నీరసం, ఎండవేడిమికి సొమ్మసిల్లి శరీర మంతా నిస్సత్తువతో కృంగిపోతాడు.

10. సన్నిపాతజ్వరంలో "లెకేసిస్" వాడదగు లక్షణాలేమి ?

సన్నిపాతజ్వరాల్లో వాడదగు ఉత్తమమగు మందుల్లో యిదొకటి. జ్వరముయొక్క మొదటిస్థితిలోను, అంత్యస్థితిలోనుతప్ప మిగిలిన అన్నిస్థితులలోను ఉపయోగపడుతుంది. ఈవ్యాధిలో వాడుటకు చాల నిర్దిష్టలక్షణాలు వున్నాయి. అందు గొణుగుడు, మగత, కొన్ని వేళలలో పూర్తిగా స్పృహతప్పుట. నోరుతెరచుకొని నిద్రపోతాడు. నాలుకఆరి ఎర్రగాను, ఊదాగాను ఉంటుంది. నీరసంచే నాలుక ముందుకు సాచలేడు. సాచితే నాలుక వణకుతుంది; నాలుకను కరచుకుంటాడు. విరోచనం భరించరాని దుర్వాసన; రక్తముస్రవిస్తేనల్లగా పేరుకొని అవుతుంది. భరించరాని కుళ్ళువాసన. గొంతుగలో కఫం చేరి ఊపిరాడదు. శ్వాసదీర్ఘంగావస్తుంది. రోగి నీర్స, నిస్సత్తువులతో ఉన్నా ఆరాటపడుతాడు. గుండెలమీదగాని గొంతుమీదగాని బట్ట కప్పితే ఉక్కిరిబిక్కిరై విసరిపారేస్తాడు. నిద్రపోయినకొలదీ వ్యాధి లక్షణాలు, బాధలు వృద్ధిచెందుతాయి. ఇది 'లెకేసిస్' యొక్క వింత విపరీత ప్రధానలక్షణం. కనుగ్రుడ్లు పసుపుగానో, నారింజరంగుగానో ఉంటాయి. చల్లనిచమట్లుపట్టి రక్తంరంగుగానో, పసుపురంగుగానో మరకలవుతుంది. (లైకో)

11. చర్మం – కోశాలు – వీటిపై "లెకెసిస్" లక్షణాలను క్లుప్తముగా వ్రాయుము.

వాపులన్నియు మలినరక్తం చేరడంవల్ల నల్లగా మబ్బువర్ణంగా ఉంటాయి (తెరెంట్యులా, యాంత్రాసినం). పుళ్లు లోతుగానుండవు

గాని పళ్ళికలలా వ్యాపిస్తాయి. వాపులు సుతిమెత్తగా నుండుటచే తాకినచో నొప్పి, కదుములు, కురుపులు, పుళ్లు, వ్రణాలు కూడ తాకితే నొప్పి. ప్రతిచర్మవ్యాధిలోను నీలవర్ణంగావుంటే "లాకేసిస్" స్ఫురించాలి. వాటినుండి పేరుకొనిన నల్లనిరక్తం స్రవిస్తుంది. చాలచిన్న పుండైనను విపరీతంగా రక్తం కారుతుంది. రక్తంచెడి ముద్దకట్టుస్వభావం లేకపోవుటచే సులువుగా రక్తం స్రవిస్తుంది. వ్రణాలనుండి, గాయాలనుండి, మూత్రంలోను, ప్రసవానంతరము స్రవించురక్తము పేరుకొను స్వభావములేని నల్లనిరక్తము విపరీతంగా పోతూంటే "లెకేసిస్" స్ఫురణకు రావాలి.

12. 'లెకేసిస్' చెవికి కలిగించు వ్యాధుల లక్షణములేవి ?

చెవిలో హోరు, ధ్వనులు, ఆలాపనలు, ఇవన్నియు చెవిగూబలోనికి వ్రేలుపోనిచ్చి కదిపితే తగ్గుతాయి. చెవిలో ముద్దగానుండు వాసనతో కూడిన గులివి విస్తారముగా పుట్టును. చెవి ఎండిపోయి పొడారి వుంటుంది.

13. 'లెకేసిస్' రోగియొక్క గుండె లక్షణములేమి ?

గుండె బిగబట్టినట్లుంటుంది. నిద్రలో శ్వాసఆడక ఉక్కిరిబిక్కిరై లేస్తాడు. కునుకుపట్టేసక్షణంలోనే శ్వాస నిలచిపోతుంది. రోగి నిద్రపోలేడు. నిద్రపట్టేసమయానికి శ్వాస నిలచిపోవడంచే వుక్కిరిబిక్కిరై లేచి తిరిగి శ్వాసను అందుకుంటాడు. ఈవిధంగా నిద్రచెడి చాల బాధపడుతాడు.

సిరస్సుపైన అనగా కపాలభాగంలో బరువు, బాధ, గుండె జబ్బుతో కూడిన విపరీతంగావచ్చే పొడిదగ్గులకు నిరుపమానంగా పనిచేసేమందు యిది.

## 84. లరోసరస్ (Laurocerasus)

1. 'లరోసరస్'లో ప్రధానమగు స్వాభావికలక్షణములు అయిదింటిని వ్రాయుము.

(అ) ప్రధానంగా యిది గుండెపై పనిచేసేమందు. గుండెజబ్బుచే తరచు విడచి విడచి వచ్చేనుసదగ్గుకు అద్వితీయమగుమందు. ఈలాటిదగ్గులను మేజిక్కులా క్షణంలో నివారిస్తుందని 'బోరిక్' గారు వ్రాస్తున్నారు. పడుకోనేసరికి నే నున్నానన్నట్లు యీ దగ్గు సిద్ధం.

(ఆ) గుండెవ్యాధివల్ల ఊపిరిబిక్కిరై ఊపిరందక ముఖం నలుపెక్కి నిస్సత్తువుగావుండి లేచికూర్చుంటే వృద్ధికించి పడుకుంటే ఆయాసం వుపశమిస్తుంది.

(ఇ) దుర్బలత్వంచే శరీరశక్తులు మందగించి మందులు పట్టేయనప్పుడు 'లరోసరస్' చైతన్యాన్ని కల్పించి మందు పనిచేసేటట్లుచేస్తుంది. (రిపెక్షన్) జీవశక్తిక్షీణించి శరీరంకంది నల్లబడి ఊపిరాడక రోగి ఆయాసపడుతూండడం ఈమందు సూచన.

(ఈ) త్రాగిననీరు జీర్ణవాహినిగుండా శబ్దంచేసుకుంటూ ప్రేగుల్లోకి చేరుతుంది. నాడి నీరసంగా ఉంటుంది.

(ఉ) శరీరం సర్వదా చలవకాడలా చలువగమ్మివుంటుంది. చల్లగా వుండిగదా అని బట్టకప్పితే భరించలేక తీసేస్తాడు (సికేల్, కేంఫర్). శరీరం తాకిచూస్తే కొద్దిపాటివేడికూడ వుండదు.

2. శరీరశక్తులలో సంచలనము చైతన్యము [illegible]గజేసే ఆరుమందు లను వాటి లక్షణములతోసహా పేర్కొనుము.

(అ) 'కేప్సికం' ఊబకాయులకు అంటే లావుగా కండరాలు జవజవ లాడుచూ బూసుగ వృక్షంలాంటి వారికి పనిచేస్తుంది.

(ఆ) 'ఓపియం' స్తబ్దుగా మందకొడిగానుంటి మత్తుచే నొప్పి తెలియని వారి మందు.

(ఇ) 'కార్బో - వెజిటాబిలిస్' కాళ్ళు - చేతులు చల్లబడి, శ్వాస కూడా చల్లబడి విసనిక్కరతో విసరితేనేగాని శ్వాస ఆడనివారి మందు.

(ఈ) నరాల దుర్బలత్వంతో బాధపడేవారికి 'వెలీరియనా' 'అంబ్రా గ్రిసియా' లు పనిచేస్తాయి.

(ఉ) సోరావల్ల శరీరశక్తులుడిగి సరియగు మందును పని చేయనీయ నప్పుడు 'సల్ఫర్' - 'సోరిసం' లు చైతన్య శక్తిని వుద్రేకింప జేసి మందులు పనిచేయునట్లు చేయును.

(ఊ) 'లరోసిరస్' గుండె జబ్బులో సంచలనం కలిగించే మందు.

3. పదునైదు పంక్తులలో 'లరోసిరస్'ను గూర్చి పూర్తిగా వ్రాయుము.

గుండె నీరసము, నిస్సత్తువ; రక్త ప్రసరణము మందముగా నుండి శరీరం చల్లగా వుంటుంది. బట్ట కప్పుకొన్నను చల్లతనం తగ్గదు వేడి రోగిదగ్గర వుంచితే వికారం వస్తుంది. వేడిగానున్న గదిలో ఉంటే నుదురుమీద చల్లని చెమట్లు పడుతాయి; చల్లగాలిలో నుదురు చెమట్లు ఆరి వేడిగా వుంటుంది. శరీరంలోని ఉష్ణము క్షీణించి చలన శక్తి తగ్గుతుంది. ఎక్కువ విచారంచేత, భయాందోళనల చేత జనించే వ్యాధులకు పనిచేస్తుంది. గాఢమగు నిద్ర; నిద్రలో గుర్రు శబ్దంతో కూడిన శ్వాస, ఆయాసం; ఊపిరాడక కిక్కిరిబిక్కిరిగా వున్నప్పుడు పడుకోవాలి; పడుకుంటే విరామం లేక నుపదగ్గు.

హ్రస్వదృష్టి - బట్ట తెర అడ్డువేసినట్లు కనుపిస్తుంది.

గొంతుగ - శ్వాసకోశం :- నులిమినట్లు, బిగబట్టినట్లు బాధ, విదాహం, దగ్గు, వమనం.

పిల్లలకు ఆకురంగు నీళ్ళ విరోచినాలు; బాలవిసూచి (Infantile Cholera) మూత్రం బిగబట్టడం; మూత్రం అణగారడం (Suppression) మూత్ర విసర్జనకాలంలో కడుపులో పోట్లు.

ఊపిరాడక, ఉక్కిరిబిక్కిరవడం; ప్రక్కపై వాల్తే ఉపశమించడం - ఈ తీరుగా గుండెజబ్బులో వుంటుంది.

నాడి మందం; గుండె వక్రచలనం; గుండె అదురు, ముంజేతులపై రక్తనాళాలు ఉబ్బి నల్లగా త్రాళ్ళలా వుంటాయి. విరామం లేని ఎక్కిళ్ళు, కండరాలు అదురు; ఉలికిపాటు.

## 85. లెడం పాలస్టిర్ (Laedum Palustre)

1. "లెడం పాలస్టిర్" యొక్క సాధారణ సహజలక్షణములేమి ?

కీళ్ళ వాతానికి పనిచేసే ప్రధానమందులలో ఉత్తమమైనది. రొమేటిజం పాదాలలో ప్రారంభించి క్రమంగా శిరస్సువైపుకు వ్యాపిస్తుంది. (పైనుండి క్రిందకు వ్యాప్తి - 'కాలిమ్యా') జ్వరంలో పిస్తుంది. చాలసేపు కూర్చుని పనిచేస్తే నడుం బిగబడుతుంది.

వాపులు, పేలవంగా వుంటాయి; వేడిగావున్నను ఎర్రగా మాత్రముండదు. రాత్రిళ్ళ పక్కవేడి వలన బాధలు హెచ్చుతాయి. కప్పుకోడు సరికదా పాదాలను, వ్యాధిపీడితమైన శరీరభాగాలను మంచు వంటి చల్లని నీటిలో వుంచితే బాధ తగ్గుతుంది. వ్యాధిపీడిత భాగాలు చల్లగావున్నా మండుతూండడం 'లేడం' యొక్క అసాధారణ లక్ష

ణం (సికేల్; కేంఫర్.). మోకాళ్ళ క్రిందిభాగమంతా వాచి, కంది ఊదాగా వుంటుంది. నెప్పులు,మంటలు, నవులు చున్నట్లు బాధ, ఈ బాధలుగల శరీరభాగాలను, రోగి చల్లదనం నిమిత్తం మంచుగడ్డవేసిన చన్నీటి తొట్టిలో పెట్టుకొని కూర్చుంటాడు.
మంచు ముక్కలు క్రమంగా కరుగుటచే తేలుతూ వ్యాధి భాగాలకు తగుల్తుంటే 'హాయిగా వుందం'టాడు. రోగి (కెంటు)

దెబ్బగాని, గుద్దుగాని తిని కనుగ్రుడ్డు నల్లబడితే 'ఆర్నికాను' మించి పనిచేస్తుంది. యీ మందు (నక్స్ - వామ్. పెట్టింది పేరు) పిల్లవాడు ఆడుకుంటూ తల్లి గుడ్డుమీద గుద్దినప్పుడు యిది నిరుపమాన మగు మందు.

సర్వదా శరీరం చల్లగా నీటికుండలా ఉంటూ వేడి పైకితేలక తాకినాగాని నల్లగావుండే శరీర తత్వంగలవారి వ్యాధులకు పనిచేస్తుంది. పై వారికి రోగిని తాకితే ఎంతచల్లగావున్నా రోగికి మాత్రం తన శరీరం స్వీయంగా చల్లగావుండదు. ఇదొక వింతలక్షణం.

మేకులు, సూదులు, గునపం మొదలగు వాడిమొనగల పని ముట్లు గుచ్చుకొన్నప్పుడు; ఎలుక, తేలు, దోమలు, నల్లులు మొద లగు జంతువులు, పురుగులు కరచినను, కుట్టినను ఈ మందును వాడాలి.

ఎడమ భుజము. కుడిచట్ట బాధ (ఎగేరికస్, ఏంటి - టార్ట్స్, ట్రిమోనియా) వ్యాధిపీడిత భాగం క్షీణిస్తుంది. (గ్రాఫైటిస్, ప్లంబం) సన్నబడుతుంది. పాదాలు మోకాలువరకు వాచి, మడమ, సీలమండ లలో పోటు; పాదం క్రిందమోపితే భరించలేని బాధ. వెణికినా లేక కాలు తిరుగబడినా మడమ- సీలమండలు వాచి, వచ్చు ఆటుకు పోటుకు దివ్యమగు మందు. కాలి బొటనవ్రేలి కణుపువాచి ఆటు పోటు. పాదాలు, సీలమండలు విపరీతమగు దురద. తరచు నడచేటప్పుడు

పాదాలు తిరుగబడి సీలమండ బెణికినప్పుడు (కార్బో - వనిమలిస్) 'లేడం' బాగాపనిచేస్తుంది.

నుదురుమీద, బుగ్గలమీద ఎర్రటి మొటిమలు.

దెబ్బలు తగిలి, శరీరం కమలి రక్తం పేరుకొని నల్లగా, ఊదాగా శాశ్వతంగా నిలచిపోయిన మచ్చలకు, అవి క్రమంగా ఆకుపచ్చగా మారినప్పుడు యీ మందును మరువరాదు. పాదాలు అతిసున్నితంగా ఉండి క్రింద ఆనిస్తే బాధ (సిలికా; ఏంటిమోనియం క్రూడం; కాళ్లు-చేతులపై పుట్టే కురుపులకు లైకోపోడియం).

మోకాలికి రోహిమిటెసం :- తెల్లనిమూత్రం తరచుగా విసర్జించుటచే బాధ తగ్గే స్వభావముంటే ఉపయోగపడుతుంది.

2. "లెడంపాల్" కుదర్చగల కీళ్ళనొప్పుల స్వభావమేమి ?

కీళ్ళవాతం పాదములో ప్రారంభమై క్రమంగా ఊర్ధ్వముఖంగా పైకి పాకుతుంది. తరుణ లేక కాలిక వ్యాధులలోకూడా పనిచేస్తుంది. కీళ్ళు వాచి వెచ్చగా వుంటాయిగాని ఎరుపుమాత్రం వుండవు. కీళ్ళ నొప్పులతో జ్వరం వుండదు. రాత్రి భాగంలో పరుపు వేడికి కీళ్లు మంట, బాధ. కప్పుకోడు. మడమవాపు; సీలమండ వాపు, పోటు. పాదాలు సున్నితంగా ఉండడంచేత క్రిందమోపితే బాధ. రోగి సహజవిరుద్ధంగా విపరీతమగు చల్లగా వుంటాడు తాకి చూస్తే. సీతలోపచారాలచే బాధ తగ్గడం యీ మందుకు చాల ప్రధానలక్షణం. బాధ తగ్గాలంటే చల్లని నీళ్ళలో వ్యాధిగ్రస్తభాగాన్ని ముంచి ఉంచాలి; లేదా మంచు గడ్డల్లాటి చల్లని నీళ్ళలో తరచు ఆర ఆరగా తడుపుతూ వుండాలి. "లెడం" ఆమకీళ్లవాతానికి నిరుపమానంగా పనిచేస్తుంది.

మణికట్టు, వేళ్ళ కణుపులు, మోకాళ్ళు, సీలమండ దీని ప్రత్యేక స్థావరాలు.

మోకాలు వాపు, నొప్పి ఎంతకాలంనుంచి ఉన్నా 'లెడం' పనిచేస్తుంది. చల్లటి వుపచారాలవల్ల, మూత్రము విస్తారముగా అగుట వలన నొప్పులు తగ్గుతాయి. వాపులు, నొప్పులు క్రిందినుండి పై కెగ బ్రాకుట, గుండెలోనికిపోయి గుండె జబ్బులు పుట్టించుట ఈ మందుకు స్వాభావికము. వ్యాధిభాగం క్షీణించి క్రమంగా సన్నబడుతుంది.

# 86. లైకోపోడియం (Lycopodium)

1. "లైకోపోడియం"కు గల మానసిక లక్షణములేమి ?

శరీరం శుష్కించి రోగి బక్కచిక్కుతాడు. కాని చురుకుతనం, తెలివితేటలకు మాత్రం లోటురాదు. విసుగు, తొందర, దుడుకుతనం; "చిరుబుర్రు"మంటూ సర్వదా కోపం ముక్కుమీదుంటుంది. తాను గొప్పవాణ్ణి, మేధావంతుణ్ణి అని అహంభావంతో వుంటూ ఎదరివానిని చిన్నచూపు చూస్తాడు. కోపంతో అందరిని ఆజ్ఞాపిస్తాడు. వయోవృద్ధుల కుమరుపు. సభా సమావేశాలకు పదిమందిలోకి వెళ్ళటానికి భీతి; కోర్టులో వాదించే న్యాయవాదులు, బహిరంగ సమావేశాలలో పాల్గొనే మంత్రులు తమ కృత్యాలను నిర్వర్తింపలేమేమో అని భీతి; కాని ప్రారంభంలోనే జడుపుగాని రంగంలోకి ఉరికితే నిర్భయంగా పూర్తిచేస్తాడు. "లైకొపోడియం" రోగికి సంఘం గిట్టదు. కాని భయ మెక్కువ; ఇందుచే ప్రక్క గదిలోనో లేక యింట్లోనో ఎవరో ఒక రైనా వుండాలి. అల్ప సంతోషి; ఎంతమాత్రం సంతోషం వచ్చినా కళ్ల వెంట నీళ్ళు కారుతాయి. తుదకు ఎవరైనా కృతజ్ఞత వెల్లడిస్తే కన్నీరు కారుస్తాడు? ఆత్మ విశ్వాసం లోపిస్తుంది. అధైర్యం, పిరికితనం, దురాశ, లోభత్వం వీనిలోనే పుట్టాయా అనిపిస్తుంది.

2. "లైకోపోడియం" లోని ప్రధాన స్వాభావిక లక్షణములేమి ?

జ్ఞాపకశక్తి నశిస్తుంది. చెప్పదలచిన విషయానుకూలమగు మాటలు తట్టవు.

వ్యాధి లక్షణాలు కుడిపార్శ్వంలో ప్రారంభమై ఎడమవైపుకు ప్రాకుతాయి. లేదా వ్యాధి కుడివైపునే సంభవిస్తుంది. వ్యాధి శిరోభాగమునుండి క్రిందివైపుకుగాని, కుడినుండి ఎడమకు గాని పోవుట యీ ఔషధమునకు నైజము.

మిక్కుటమగు ఆకలితో కంచం దగ్గరకు చేరుతాడు. కాని ఆత్రంగా రెండు ముద్దలు మింగేసరికి "చేదు" మని తేనుస్తాడు. కడుపు నిండిపోతుంది, నిండుతో ఎగఊపిరి, దిగఊపిరి బాధ.

ప్రేగులు విపరీతంగా ఉబ్బుతాయి. పొట్టలో గాలి పరుగెత్తుచున్నట్లు చప్పుళ్ళు - అరుపులు, పైనుండి క్రిందికి దిగే పెద్ద ప్రేగులో "గయి-గుయి" మని శబ్దాలు, మూత్రంలో ఇసుకరజనువంటి ఎర్రని పదార్థం. మూత్రపిండములుండు నడుము ప్రాంతములో నొప్పి.

వ్యాధి లక్షణాలన్నియు సాయంకాలము 4 గంటల నుండి 8 గంటల వరకు హెచ్చుతాయి. భోజనానంతరం, వెచ్చగానుండు గదిలోను, సాయంకాలం 'లైకో' బాధలు హెచ్చి చల్లగాలిలోను, పచార్లు చేయుటచేతను కాస్త ఉపశమిస్తాయి. వేళతప్పి భోజనంచేస్తే తలనొప్పి, తిమ్మెర్లు.

యువకులు దురలవాట్లకులోనై ముష్టిమైథునం, అమిత సంభోగము చే వీర్యం కోల్పోయి నపుంసకులవుతారు. సంభోగావయవంలో చైతన్యం క్షీణించి పురుషాంగము ముదించుకుపోయి చల్లగా కలువ కాడలా ఉంటుంది. శీఘ్రస్ఖలనం, మానసిక హెచ్చరికకు లోటు లేకపోయినా శారీరకంగా దుర్బలత్వం, శిశువులకు, వయోవృద్ధులకు

అనగా జీవిత ఆద్యాంతస్థితులలో అక్కరకువచ్చు అమూల్యమైన మందు.

బిడ్డలు పగలు పోరు, రాత్రులు నిద్ర (జాలప్, సోరినం దీనికి వ్యతిరేకం) పడిశము, రాత్రి కాలములో ముక్కు దిబ్బడచే నోటితో గాలి పీల్చవలసివచ్చును. (ఎమోనియా-కా; నక్స-వా; సెంబుకస్) ముక్కులో పక్కులుకట్టి తీగలుసాగే చీమిడి విస్తారం వుంటుంది. పులి త్రేన్పులు, నోటివెంట పుల్లనినీరు ఊరుతుంది. గుండె మంట; పుల్లని తేమడవమనములు.

వెర్రిఆకలి; తినినకొద్దీ తినాలని వుంటుంది. రాత్రులు ఆకలితో లేచి కూర్చుంటాడు.

రజస్వలనాటి నుండిగాని, గత బాలెంతతనం నుండిగాని మల బద్ధకం. ఇల్లువిడచి బైటకుపోతే విరోచనంకాదు; చంటి బిడ్డల మల బద్ధకమునకు మంచి మందు.

కుడివెంపు హెర్నియా - ప్రేగు జారుట.

జీర్ణవ్యాధుల చికిత్సకు ప్రథమంలో "లైకోపోడియం" వాడ రాదు. గుణము గోచరించిన వెనుక తిరిగి మందీయరాదు.

3. కడుపుబ్బరముచేయు ఔషధత్రయమేది ? వానిని పోల్చుము.

(1) కార్బో - వెజిటాబిలిస్ (2) చైనా (3) లైకోపోడియం

'లైకోపోడియం'కు దిగువ ప్రేగులలో వాయువు పులిసి 'గుర్రు గుర్రు'మనే శబ్దం విస్తారంగా అవుతుంది.

'చైనా'కు పొట్టఅంతయూ డోలులా ఉబ్బుతుంది.

'కార్బో - వెజిటాబిలిస్'కు పై పొట్ట ఉబ్బుతుంది.

'లైకోపోడియం'కు క్రింది పొట్ట ఉబ్బి ప్రేగులు అరుస్తాయి.

"లైకోపోడియం"లో సాధారణంగా దీర్ఘకాలకాలేయ వ్యాధులకు క్రింది పొట్ట ప్రేగులలో గాలిచేరి పులిసి పెద్దగా చప్పుడగును.

4. "లైకోపోడియం" వాడనగు జఠర లక్షణములేమి ?

వెర్రి ఆకలితో రోగి కంచందగ్గర కూర్చుంటాడు. రెండు లేక మూడు ముద్దలు నోట పెట్టుకొనేసరికి కడుపు నిండిపోయి ఆయాస పెడుతుంది. భుక్తాయాసంతోపాటు తినిన వెంటనే మగత నిద్ర. వాయువు పెరిగి ఎగదన్ని ఆయాసపడుతాడు. అమితంగా ఆకలి, ఏమైనా తినకపోతే వెంటనే తలనొప్పివచ్చి అన్నంతిన్నాక తగ్గుతుంది. నోరు పులుపు, పుల్లత్రేనుపులు, ఒకప్పుడు పుల్లని తెమడ వాంతి అవుతుంది. నాభిదగ్గర పొట్ట ఉబ్బుతుంది. బట్ట పొట్టమీద వుండడంకూడ సహించలేడు; బట్ట వదులుచేసుకుంటాడు; త్రేనుపులవల్ల ఉపశాంతి ఉండదు. తీపి పదార్థాలమీద కోరిక. కాలేయం చాల కాలంనుంచి పెరిగి వుంటుంది.

5. "లైకోపోడియం"కు మలసంబంధ లక్షణాలేమి ?

తరచు విరోచనానుమానంతో కూడిన మలబద్ధకం; ఆసనంలో ఏదో ఉన్నట్లు భావన; ఆసనకండరముకు సరియగు చలనశక్తి లేక బిగబట్టి వుంటుంది. ఆసనంలో బాధ, మూలశంక.

6. "లైకోపోడియం" కల్పింపగల మూత్రలక్షణములేమి ?

ప్రోస్టేటుగ్రంథి పెరుగుతుంది, ఆసనంలో వేళ్లుపోనిచ్చి పరీక్షిస్తే వేళ్ళకు తగులుతుంది. మూత్రం బురదగా ఎర్రని ఇటుక పొడివంటి రజనుతోకూడి దుర్వాసనగావుంటుంది. మూత్రవిసర్జనకు ముందు పిల్లలు 'గిల-గిల' లాడుతారు. దీనికికారణం బాధ. బట్టలపై పచ్చని డాగుపడుతుంది. పెద్దవారికి నడుములో మూత్రపిండము లుండుతావున అమితముగా బాధ. ఎఱ్ఱని యిసుకరజనువంటి పదార్థ

ముతో కూడిన మూత్రవిసర్జనానంతరం బాధ తగ్గుతుంది. రాత్రిలందు అతిమూత్రం. రాత్రులందు చాలసార్లు లేచి ప్రతిదఫా యెక్కువగా మూత్రవిసర్జన చేస్తాడు. రాత్రిలందు అతిమూత్రం.

7. సంభోగావయవములకువచ్చు ఏఏ బాధలకు 'లైకోపోడియం' వాడాలి ?

నపుంసకత్వం, సంభోగావయవమునకు చైతన్యంలేక చల్లగా ఉండి ముడుచుకుపోతుంది. సంభోగశక్తి తగ్గుతుంది, యువకులు ముష్టిమైధనంచేతను, మితిమీరి సంభోగంచేయుటచేతను పుంసత్వాన్ని కోల్పోతారు. వాంఛ యెక్కువేగాని క్రియమాత్రం సూన్యం.

8. శ్వాశకోశాలపై 'లైకోపోడియం' లక్షణాలేమి ?

కాలికంగాఉండే ముక్కుపడిశముకువాడే మందుల్లో ముఖ్యమైనది. రాత్రిలందు ముక్కు దిబ్బడేసి శ్వాసఆడదు; నోటితో గాలి పీల్చుకోవాలి. ఊపిరాడక అమితంగా ఆయాసపడుతాడు. గురకతో కూడిన దగ్గు, ఊపిరితిత్తులలో విస్తారం శ్లేష్మంచేరుతూ ఉంటుంది. ఎంతశ్లేష్మం బైటకుపోయినా రోగికి సుఖముండదు: ఆయాసం, ఊపిరాడదు. ముక్కుపుటాలు తపతపలాడుతూ గాలిపీల్చునిమిత్తం ఎంతవరకు సాగగలవో అంతవరకుసాగుతూ మరల మూసుకుపోతూ క్రిందకుపైకి ఆడుతూఉంటాయి. ఈస్థితిలో "లైకోపోడియం" విసనికర్రలా అద్భుతంగా పనిచేస్తుంది. రోగిని మృత్యుముఖాన్నుంచి బైటపాడేస్తుంది. కఫాన్ని బైటకు తోసేసి శ్వాసను నిలబెట్టి ఊపిరితిత్తులను బలపరచి ప్రాణాన్ని నిలబెడుతుంది. నిమ్నపడిశం మూడవ అవస్థలో "లైకోపోడియం" చేసేపనియిది. కఫం పచ్చగా, ముద్దగా, ఉప్పగా ఉండి దగ్గు సాయంకాలం నాలు ఎనిమిది గంటలమధ్య విపరీతంగా వస్తుంది. కాని పాదం ఒకటి చల్లగాను రెండవది వేడిగానుఉంటాయి.

9. మెదడు బలహీనమై పక్షవాతం వస్తుందా అనేస్థితిలో "లైకోపోడియం" వాడనగు లక్షణములేమి ?

ఎక్కువ మగత, పిలిస్తే పలుకడు. బేటరీలైట్ ముఖంపై ప్రసరింపజేసినా కంటిపాపల్లో చలనముండదు. చేపకళ్ళలా మిడిగుడ్లు. నిస్సత్తువచే క్రిందిదవుడ జారుతుంది. గురక, దీర్ఘశ్వాసలు, నాడి విడచి విడచి కొడుతుంది. నాలుక వాస్తుంది. ముందుకురాక పొడారిపోయి నోట్లో ఇటు–అటు దొర్లుతూఉంటుంది. ఇట్టిభయానక దృశ్యంలో "లైకోపోడియం" పని నిరుపమానం.

10. "లైకోపోడియం" కుదర్చగల కంటిలక్షణములేమి ?

కంటిరెప్పలందు మొటిమలు (స్టైస్). పగటిపూట మసగ, రాత్రి కళ్లు కనుపించకపోవుట దీని సహజలక్షణం. వస్తువులయొక్క ఎడమభాగంమాత్రం స్పష్టంగా కనుపిస్తుంది. అర్ధచూపు (హెమియోపియా). రెప్పలుఎరుపు; నిద్రలో కళ్ళు అరమోడ్పు. సంధ్యాసమయములోని వెలుతురుచే కళ్లు కనుపించవు. బల్లపై ఏముందో కనుపించదు.

## 87. మెగ్నీషియాకార్బానికా(Magnesia Carbonica)

1. "మేగ్నీషియాకార్బానికా"యొక్క నైసర్గిక లక్షణములేమి ?

కదలుటచే బాధలు ఉపశమిస్తాయి. రోగికి చల్లగాలి కావాలి. నరాలలో బాధలు, పంటిపోటు, పచార్లుచేయుటవలన. ప్రతిరోజునా జ్వరం సాయంకాలం వస్తుంది. జ్వరంలో బట్టకప్పుకోవాలి. ప్రతి మూడువారాలకు అనగా యిరువది ఒక్కరోజులకొకమారు వచ్చే వ్యాధులకున్నూ, నెలసరికిముందున్నూ ఋతుకాలంలోను గర్భవతులకు

వచ్చే పంటిపోట్లకున్నూ పనిచేస్తుంది. పళ్ళు సుకుమారంగాఉండి ఏవస్తువను కొరకలేడు. పెద్దవారికి పళ్ళు (విజడం) మొలిచేటప్పుడు బాధలు కలుగుతాయి.

విరోచనములు ఆకుపచ్చగా పాకుడుకట్టిన నీళ్ళలా అవుతాయి. ఒకప్పుడు కప్పనురగలా ఆకుపచ్చగాను, కొందరికి తెల్లగా సీమసుద్దలా ముద్దవలెను అవుతాయి, బిడ్డలు చిక్కిపోతారు.

శిశువు పులుపువాసనకొడుతాడు, పుల్లని తేమడ కక్కుకుంటాడు. విరోచనానికి ముందుపొట్ట నొక్కేస్తోన్నట్లు బిగబట్టినట్లుండి పిల్లలు ఏడుస్తారు. విరోచనమైతే తగ్గుతుంది.

స్త్రీ ఋతుమతి అగుటకుముందు ప్రతినెలా రొంప.

పగలు నిద్ర, రాత్రి నిద్రపట్టకపోవడం, ఉదయం లేవడానికి బద్ధకం. చల్లగా చలితో బాధపడేతత్వం.

రాత్రిసమయంలో పకున్నప్పుడుమాత్రం మైల పోతుంది. పోయేమైల నల్లగా ఉంటుంది.

తలవెంట్రుకలు లాగుచున్నట్లు నడినెత్తిని బాధ. అకస్మాత్తుగా చెముడు వస్తుంది.

2. పిల్లలు చిక్కిపోవుటకు మెగ్నీషియా కార్బానికా వాడనగు లక్షణములేమి ?

హెచ్చరికలేక ఎప్పుడూ ఏడుస్తూ నలతగాఉంటారు. పాలు పోస్తే పాలు అరగక కడుపులో నొప్పివచ్చి పుల్లనివాంతులవుతాయి. కడుపులోపోట్లు, ఆకుపచ్చగా విరోచినాలు, కొందరికి విరోచినాలు సీమసుద్దముద్దలా తెల్లగా అవుతాయి. ఈవిధంగా విరోచనాలవుతూ

బిడ్డలు రోజురోజూ దిగనారుకుపోతారు. నోటిలోను, దవుడలమీద, పెదవులమీదా పుండ్లు.

# 88. మెగ్నీషియా ఫోస్ఫారికా (Magnesia phosphorica)

1. శరీరమందలి ఏభాగములో "మెగ్నీషియాఫాస్ఫారికా" గోచరించును ? దాని లోపముచేకలుగు పరిణామములేమి ?

కండరములు, నరములు లోగల తెల్లని తంతువులలో 'మెగ్నీషియాఫాస్' అణువులుండును. నరములు, కండరములు వివిధరంగుల తంతువులకు, తంతిశాఖలోగల ప్రత్యేగ తీగలకు ప్రత్యేక కృత్యము లున్నట్లే, వాటికికూడ శరీరములో నియమిత విధులుకలవు ప్రతి ఒక్క తెగ తంతునకు ప్రత్యేక జీవ, నిర్జీవ పదార్థముల సమ్మేళనము తోకూడి వాటివాటి ధర్మములను ప్రకృతిసిద్ధముగా నియమబద్ధముగా నెరవేర్చుచుండును. తెల్లధాతు తంతువులు 'మెగ్నీషియాఫోస్ఫారికా' అను కోశలవణ ఆధ్వర్యమున తన విధులను నెరవేర్చుచుండును. తెల్లధాతు తంతువులు "మెగ్నీషియాఫాస్ఫారికా" అను కోశలవణ ఆధ్వర్యమున తన విధులను నెరవేర్చుచుండును.

ఈలవణము లోపించిన తెల్లవర్ణముగల తంతువులు ముడుచుకొనిపోవును. అందుచే కండరములందు కొంకర్లు, ఈడ్పులు, సంభవించును. కొంకర్లు లేక ఈడ్పులు అను లక్షణము శరీరమందు ప్రత్యేకముగా యేభాగములో యీలవణము లోపించినదో తెలియజేయును. వివరముగా తెలియుటకుగాను వివిధావయవములందలి కొంకర్లకు శాస్త్రజ్ఞులు వివిధనామములుగా తెల్పుచున్నారు, కాని అవి అన్నియు యీలవణలోపమువలననేయని గుర్తింపవలయును.

ఉదరకండరములందలి తంతులయందలి యీ లవణము లోపించిన అందలి స్వేత తంతువులు కుదించుకొనిపోయి ఉదరవైశాల్యము క్షీణించును. పొట్ట నొక్కుకొనిపోవును. ఈవిషమ పరిస్థితిని ఎదుర్కొనుటకుగాను ప్రకృతి తన అధీనమందున్న వస్తుసముదాయముతో విస్తారముగా వాయువును సృష్టించి ప్రతిపీడన కలుగజేయుచున్నది. ఈద్వంద్వపరిస్థితిలో 'మెగ్నీషియాఫాస్' ఇచ్చిన తక్షణమే ఇట్టిఅవాంతరములను పోగొట్టును. దానితో "కాల్కేరియాఫాస్" కూడయిచ్చిన రక్తమందలి యీలవణలోపమును సరిదిద్ది "మెగ్నీషియాఫాస్" వెంటనే పనిచేయుటకు తోడ్పడును.

విడచి విడచి వచ్చు ఈడ్పులకు, నొప్పులకు, శూలలకు యిది అమూల్యమగు లవణము. దీనివ్యాధులన్నియు విస్తారముగా కుడిపార్శ్వమున కనుపించును. వేడికాపడములచేతను, నొక్కిపట్టుటచేతను బాధలన్నియుతగ్గి సీతలముచే ఉద్రేకించును. ఎట్టి ఘోరమగు బెట్టువాతమైనను విడువక రెండువారములు యీమందుచు తీసికొనినచో తగ్గిపోవును. కడుపుఉబ్బి హృదయముపై వత్తిడి కలుగజేయుటచే సంభవించు హృద్రోగములకు నిరుపమానమగు మందు.

2. 'మెగ్నీషియాఫాస్' లోపమును గుర్తింపజేయు శరీరమందలి వివిధావయవములయందు, మండలములందు గోచరించు ప్రధాన వివిధలక్షణములను వ్రాయుదము.

మానసిక లక్షణములు-'కాలీఫాస్' గోధుమవన్నె తంతువులను "మెగ్నీషియాఫాస్" తెల్లధాతు తంతువులను అదుపుచేయును. ఈ రెండు నాడులకు పరస్పర సంబంధముండుటచే ఈరెండు లవణముల లోపముచే నుద్భవించు మానసికలక్షణములందు తారతమ్యమంతగా కానరాదు. కావున "కాలీఫాస్" మానసికలక్షణములే ప్రాధాన్యము

శిరస్సు:-నరముల దౌర్బల్యముచేవచ్చు తలనొప్పి, సున్నిత ముగా పొడచుచున్నట్లు విడచి విడచి వచ్చు తలనొప్పి, వెన్నువెంట చలితో కూడిన తలనొప్పి; నొప్పులన్నియు వేడిచే ఉపశమించి సీతల ముచే ఉద్రేకించును. ముచికలగుంటలో సున్నితమగు నొప్పి, తల వణుకు, అదురుట, ఇటు - అటు ఆడుట.

కళ్ళు:-కంటిరెప్పలు వాలుట (టాలీఫాస్), కంటిపాపనుడుచు కొని పోవుట, కంటిముందు వివిధములగు రంగుల కణములు గోచ రించును. వెలుతురుచూడలేరు. వస్తువులు రెండుగా కనుపించును (డిప్లోపియా). కంటిరెప్పలు తరచుగా విడచివిడచి అదురును (కాల్కే-రియాఫాస్). కంటిపోట్లు, మెల్లచూపు దృష్టి నాడి బలహీనమగుటచే నుద్భవించు కంటిమసగ, దృష్టిమాంద్యత.

చెవులు:-బాగుగా వినుపించదు, కర్ణనాడి చెడుటచే చెముడు, చెవిపోటు, నొప్పి. యీబాధ విడచి విడచి వచ్చుచూ వేడికాపడము తో ఉపశమించినప్పుడు యీమందు పనిచేయును.

నాసిక:-రొంపభారముచేగాక రుగ్మతచే ఆఘ్రాణశక్తి నసించి నప్పుడు, వాసనశక్తి వక్రించినప్పుడు యీలవణమును విడువక కొన్ని రోజులు సేవించవలయును.

ముఖము:- ముఖముపై తరచు స్థలము మారుచు పొడుచు చున్నట్లు నరములసంబంధమగు పోట్లు. పోట్లు మెరుపులావచ్చి పోవు చుండును. ఇవి వేడివలన తగ్గును. ముఖముయందు వాతసంబంధమగు నొప్పులు కన్నీటితో కూడియున్నచో సేట్రింమూర్ కూడ వాడవగును.

నోరు, పెదవులు :- నోటి కండరములు విడచి విడచి అదురును. మాట ముద్దగాను, నత్తిగాను వచ్చును. మాట గొణుగు; హీన

స్వరము, పళ్ళు కరచుకొని మాట్లాడును; అంకెళ్లు బిగుసుకుపోవును: ఈ స్థితిలో యీ మందును పండ్లపై రుద్దవలెను.

పళ్ళు :- పిల్లలకు పళ్ళు వచ్చుకాలమున కొంకర్లు, ఈడ్పులు వేడిచే ఉపశమించు విడచి విడచి వచ్చు నున్నితమగు పండ్లపోటు. చన్నీళ్ళతో ఉపశమించినచో ఫెర్రింఫాస్ తాకుటచేతను, చలిగాలి పీల్చుటచేతను పండ్లపోటు వుద్రేకించును. ముఖములోని కండరముల యీడ్పుల నొప్పితో కూడిన పండ్లపోటు. పంటిపోట్లు "మెగ్నీషియా ఫాస్"తో నివారణ కాకపోతే 'కాల్కేరియాఫాస్' కూడ వాడవలెను.

గొంతుక :- గొంతుకలో అదురు, ఈడ్పులు; గాలి గొట్టము లేక శ్వాసకాళిక బిగుసుకుపోవును. ముద్ద మ్రింగునప్పుడు బెట్టుగా నుండుట, పులమారుట; గొంతుక బిగిసిపోయినట్లుండుట, విడచి విడచి వచ్చు దగ్గు, స్వరపేటి ఈడ్పులచే లాగుట, గొంతుక జీర, స్వరపేటిక అదురు. పాడునప్పుడు, మాట్లాడునప్పుడు. –

జఠర లక్షణములు :- కడుపులో పోట్లు; నాలుక మాత్రం శుభ్రముగా నుండును. మెలిపెట్టినట్లు, పెనివేసినట్లు పొట్టలో భరించరానిపోట్లు; వేడికాపడములచేత పొట్టనొక్కుటచేత,తగ్గును. కడుపులో అజీర్తిశూల విడచి విడచి వచ్చును. ఎక్కిళ్లు, త్రేన్పులు, పోట్లు వేడి నీరు త్రాగుటచే ఉపశమించి చన్నీళ్ళు, ఆమ్లపదార్థములు, లేక పుల్లని ద్రవములు సేవించుటచే వుద్రేకించును.

ఉదరవుు, నులవు : బంక విరోచనములు, పొట్టలో నులిమినట్లు నున్నితమగు నొప్పులు, వేడి కాపడములచేతను, పైన నొక్కిరాయుటచేతను, నొక్కిపెట్టుటచేతను వుపశమించును. పిల్లలకు విడచి విడచి వచ్చు భరించరానిపోట్లు. ఉపశాంతినిమిత్తము కాళ్ళు ముడుచుకొని, పొట్ట బిగబట్టుకొందురు. (కాలీమూర్) నొప్పితో "గిల గిల"

లాడి కాళ్ళు పైకిలాగిపట్టి పొట్టను అదుముకొందురు. కడుపు విపరీతముగా ఉబ్బును. విపరీతమగు త్రేన్పులు, అపానువాయువులు. పొట్టలో నులినొప్పి. విరోచనములు. విరోచనములు ఛాటీగా గొట్టముతో కొట్టినట్లు అగును.

మూలశంక; కోయుచున్నట్లు, పొడచుచున్నట్లు భరించరాని పోట్లు. ఆసనములోను, పొట్టలోను భరించరానిపోట్లు.

మూత్రకోశము : మూత్రము బిగబట్టును. (ఫెర్రంఫాస్) మూత్రకోశములో కొంకర్లు, మూత్రవాహిని మంట, పోటు; మూత్ర విసర్జన సమయములో మంట, పోటు. (నేట్రం - సల్ఫ)

సంభోగావయవములు : మూత్రవాహినిలో అడ్డు; శగవ్యాధిచే మూత్రవాహిని వాపు, మంట, పోటు. ఋతుశూల; ఋతువు వెడలునప్పుడు భరించరాని బాధ, గర్భవేదనవంటి నొప్పి. ఈ నొప్పి వచ్చినప్పుడు "మెగ్నీషియాఫాస్" నూ ఇకముందు రాకుండుటకు 'ఫెర్రంఫాస్'తో జతచేసియున్నూ వాడవలెను. వేడి కాపడముచే నొప్పి వుపశమించును. గర్భపిండముల నొప్పి; త్వచల స్రావముతో కూడిన ఋతుశూల; ఋతువు జిగటగానుండును.

గర్భము:- గర్భవేదన, పోట్లు విడచి విడచి వచ్చును. కాళ్లు, చేతులుకొంకర్లు, యీడ్పులు, దొంగనొప్పులు. గర్భవతికి విడచివిడచి వచ్చు అజీర్తినొప్పులు, పోట్లు. పిండము బయటపడుటకు తగినంత నొప్పులురావు. పురుడు వచ్చుటకు ఒక నెల ముందు "మెగ్నీషియాఫాస్" "కాలీఫాస్" తరచుగా వాడినచో తేలికగా ప్రసవింతురు.

శ్వాస కోశము :- ఉబ్బసము, త్రేనుపులు, ఛాతీలో నొప్పి. గొంతుగ బిగబట్టినట్లుండి విడచి విడచి వచ్చు దగ్గు; పొడి దగ్గేగాని

కళ్ళి ఉండదు. గొంతుగ అకస్మాత్తుగా జీర, బొంగురు, గొంతుగ నొప్పి, ఆయాసము; ఛాతీలో నొప్పి, కోరింతదగ్గు, యీ వ్యాధికి తరచు కాలీమూర్ తో వాడవలెను. గొంతుగ బిగబట్టును. కొంకర్లతో కూడిన దగ్గు, విడచి విడచి రాత్రిసమయమున పొడిదగ్గు, పరున్నచో వుద్రేకము.

రక్తపరిసర మండలము : విడచి విడచి వచ్చు గుండెపోటు, ఒకప్పుడు పోటు బాధ భరించుట కష్టము. యీ మందు వేడినీటితో కలిపి వాడవలెను.

వెన్ను, కాళ్ళు, చేతులు : నడుము నొప్పి, కాళ్ళు లాగుట, పిక్కలు పెనివేసినట్లు ఆటు, పోటు. వెన్ను పోటు. మెడ, నడుము నొప్పి, పోట్లు. కాళ్ళు. చేతులు కొంకర్లు. కాళ్ళు, చేతులు బిగుసుగు పోవుట; పిడికెళ్ళు బిగుసుకొనిపోవుట, కీళ్ళ నొప్పులు, పోట్లు, కీళ్ళ వాపులు, కీళ్ళ వాతము. సయేటికా; తుంటినుండి కాలు పొడు గుననూ నొప్పి, తీపు, ఆటు – పోటు. కొంకర్లు, విద్యుత్తులా వచ్చే పొయ్యే పోట్లు; కాళ్ళు చేతులు కదపలేకుండుట, కొంకర్లు.

నరములు :– వణకు, కాళ్ళు చేతులు దడ, వణకు. కాళ్ళు చేతులు పట్లుతప్పి వణకిపోవును. కాకిచిమ్మలు, బెట్టువాతము. ఈడ్పు లతో కూడిన కాకిచిమ్మలు, మూర్ఛ, అంకెళ్ళు జిట్టకరుచుకొనిపోవుట. ఈమందును యీవ్యాధులకు వేడినీటిలో కలిపి తరచు వాడవలెను.

వ్రాతయే వృత్తిగలవారికి వ్రాయునపుడు చేతులువణకు. రాత్రిసమయమున చేతులు, కాళ్ళు వణకు. స్పర్శజ్ఞానము నశించును, శరీరము మొద్దుబారును. నరముల నిస్సత్తువచే నీరసము, నిస్సత్తువ. పనిచేయుటకు శక్తిచాలదు. త్వరితములో అలసిపోవును, బద్ధకము.

జ్వరలక్షణములు:- నరముల దుర్బలత్వముచే చలి, కుదుపు, పళ్ళుకొరుకుటను, జ్వరం - చలి, కుదుపు (ఫెర్రంఫాస్) జ్వరము విడచి విడచి వచ్చును. విడుపు జ్వరం, కాళ్ళు, చేతులు కొంకర్లు, పిక్కల కొంకర్లు, పోట్లు, వెన్ను వెంట పైకి క్రిందకు పాకుచలి.

ఈమందులక్షణములు, బాధలు వేడికాపడముచేతను, నొక్కిపట్టుటచేతను, మర్దనాలవలనను ఉపశమించి చల్లగాలిచేతను, సీతలోపచారములచేతను ఉద్రేకించును.

ఈమందు వాడునపుడు వేడికాపడములు పెట్టుట మంచిది. తాగగలిగినంత వేడినీటితో మందును సేవించిన బాగుగాపనిచేయును. ఈమందును 'కాల్కేరియాఫాస్' వెంటవాడిన త్వరితముగా గుణమిచ్చును.

## 89. మెలేన్డ్రినమ్ (Malandrinum)

1. మూడువాక్యములలో "మెలేన్డ్రిన్"యొక్క ప్రధాన కార్యములను వివరింపుము.

(1) మసూచికబారినుండి తప్పించు నిరుపమానమగు మందు.

(2) టీకాలు వేయుటవలన కలుగు దుర్గుణములను తగ్గించును.

(3) కేన్సరు నివారణకాబడిన తరువాత శేషించిన లక్షణములను నివారించుటకు, చర్మవ్యాధులకు యీమందు ముఖ్యముగా పనిచేయును.

2. చర్మముపై "మేలేండ్రిన్" ప్రభావమేమి ?

పై పెదవిపై పక్కు; అది కుట్టుచున్నట్లు బాధగా నుండుటచే దానిని గిల్లి వేయుదురు. నుదురులోపోటు. చేతులుపైనను, కాళ్ళ

పైనను పొడిఆరి పొలుసులుకట్టిన పొక్కులు, ఇవి చలిగాలిచేతను తరచు కడుగుటచేతను వచ్చినవైనచో యీమందు పనిచేయును. కాలి వ్రేళ్ళపై బొబ్బలు, ఇవి విపరీతదురద. శల్యగతమగు గట్టిమొటిమలు మొలచిన యీమందును వాడవచ్చును.

## 90. మెడోరినం (Medorrhinum)

1. "మెడారినం"యొక్క సాధారణ సహజలక్షణములేమి ?

గనోకోకస్ క్రిములుగల శగ (గనేరియా) స్రావమునుండి తయారు కాబడిన అంతర్యమునకుపోయి పనిచేయు సైకోటిక్ మందు లలో ఒకటి. గనోరియావ్యాధి తగిలినా తగలకపోయినా మెడారినం లక్షణాలుంటే యీమందు రోగాన్ని పూర్తిగా నివారణచేసి రోగికి ఆరోగ్యం చేకూరుస్తుంది.

తగిలిన గనోరియాను పూర్తిగా నివారణచేసికొనక అణచిపెట్టు టచేతను, శాస్త్రసమ్మతముగాని పై చికిత్సలచే వ్యాధి నివారణ కాక పోవుటచేతను వుద్భవించు యితరమగు పొక్కువ్యాధులను నివారించు టలో యీమందుది ప్రథమస్థానము.

ఆమవాతము (గవుటు) కీళ్ళవాతం, నరములయందలి నొప్పులు వెన్నుపూస సంబంధమగు పెక్కు బుగ్మతులు, దాని పొరలువాచు టచే కలుగు బాధలకు 'మెడారినం' పనిచేస్తుంది.

స్త్రీల అండాశయములువాచి పోటు, నొప్పికి, గర్భాశయము లోను, అండాశయములోను పుట్టే కంతులు, కాయలు, కుదపలు మొదలగు పెక్కు మొలకలకు వానిచేకలుగు బాధలకు "మెడారినం" ముఖ్యమైన మందు.

పుట్టువ్రణము (కేన్సర్) ల అన్నిస్థితులలోను, తరుణ, కాలిక వ్యాధి యందు, ఇంకనూ వృద్ధి చెందుచున్న సమయ మందునను రోగి యొక్క పూర్వ చరిత్రనుబట్టి యీ మందు వాడితే కొంతవరకు నివారణ కాగలదు.

పిల్లలకు వచ్చు పిట్టరూపు, నీరసము, నిస్సత్తువులతో ఎదుగు, పొదుగులులేక చిక్కి, మానసిక స్థితికూడ అల్లేయుండిస్తబ్దుగా"యీ దురోగోడో" అంటూ ఉన్న సమయంలో యీ మందును వాడాలి ఈ స్థితిలోని పిల్లల వొళ్ళు సల సల కాగుచూ ఎక్కడమనము తాకినను నొప్పిచే "మొర్రో" అని యేడుస్తారు. బానపొట్ట; గ్రంథులన్నియు వాపు, తలపై తామర ప్రారంభమై ముఖందాకా ప్రాకుతుంది. నిలబడలేరు; శక్తిలేక తూలిపోతుంటాడు?అమితనీర్సం, నిస్సత్తువ, నిస్త్రాణ; ఈస్థితి పిల్లలకు బాగా పనిచేస్తుంది.

గనోరియావ్యాధి అణచిపెట్టబడుటచే కలిగే కీళ్ళనొప్పులు, బిగలాగుచున్నట్లు బాధ, శరీరమంతా బిగబట్టినట్లు ఆటు, పోటు, తీపు గా ఉంటుంది. ఈ స్థితిలో "మెడోరినం" ఒక్కమోతాదు యిస్తే శరీరం మువ్వలా తయారవుతుంది.

నరముల దుర్బలత్వంచే దడ, ఒణుకు, నీర్సం; వీనివల్ల (సబ్జక్టివ్) స్వీయంగా బాధపడుతాడు.

చిరు చమటలు; కృశించడం; సొమ్మసిల్లిపోవడం; కృంగిపోతూ ఊపిరందక ఆయాసంతో ప్రాణవాయువు కొరకు విరామం లేకుండా విసనికర్ర వెయ్యమంటాడు; రోగి ఎంత చల్లగాలి వేయుచున్నా తనివి పొందదు. శరీరంచలువ క్రమ్ముతుంది; గుడ్డకప్పితే శక్తివుంటే విసరి పారేస్తాడు,గాని ఉంచుకోడు; స్నానం చేసినట్లు చమట్లు కారిపోతాయి; ఈలాటి శీతావహాస్థితిలో "మెడారినం" రోగికి చైతన్యం పుట్టించి

పునర్జన్మను ప్రసాదిస్తుంది ఈ విధంగా సుఖవ్యాధితో నిమిత్తం లేకుండా అన్ని మందుల్లాగే రోగియొక్క లక్షణ సముదాయమును బట్టి "నోసోడ్సు"ను కూడ వ్యాధియొక్క లక్షణ సముదాయమును మందుయొక్క సారూప్యతను బట్టి వాడితే నిరుపమానంగా పని చేస్తాయి.

2. మెడోరినంయొక్క మానసిక లక్షణములేమి ?

మరుపు, చదివినది మరుక్షణంలోనే మరచిపోవడం, పేర్లు, మాట్లాడేటప్పుడు చెప్పవలసినమాటలు, ఆప్తమిత్రులపేర్లు, క్రియకు తన పేరే మరచిపోతాడు. ఒక విషయప్రసంగంచేస్తూ ధోరణి మరో హాంశంలోకిదిగిపోతుంది. ధోరణిలో సరైనమాటలు ఉపయోగించ లేకపోవడం, మాటలకోసం తడుముకోవడం, తడబడ్డం. వ్రాతలో అక్షరాలు లోపించడం. తాత్కాలికపు సన్నివేసాలు మరుపు — పాత గాధలు పూసగ్రుచ్చినట్లు ఏకరువుపెట్టడం. ఈవిధమగు మనోదార్బ ల్యాన్ని కలిగిస్తుంది "మెడోరినం". చావును నిరీక్షిస్తాడు; చావు తప్ప దని నిర్ణయించుకుంటాడు. మరణము ఆసన్నమైనదని ఎంచుతాడు. భావిని నిర్ణయిస్తాడు. భావిలో ఏదో జరుగునని నిర్ణయించుకొని అదే యదార్థంగా ఊహించి సంకటపడుతాడు. ముక్కోపి. పగటి కాలంలో విసుగ్గాను కోపంగాను ఉంటాడు.

ఆదుర్దా, అతిసున్నితం; కొద్దిపాటి శబ్దానికికూడ ఉలిక్కిపడు తాడు. కాలం చాల నింపాదిగా జరుగుచున్నట్లు భావన; అమిత తొందర, దుడుకుతనం, దానివలన అలసట.

వ్యాధిని, బాధల్ని తలచుకొన్నకొద్దీ హెచ్చుతాయి. తనవెనుక ఎవరోఉండి తనగుట్టంతా తెలుసుకుంటున్నట్లు, భావన, సామానుల చాటునుండి ఎవరో తనవంక చూస్తున్నట్లుభ్రమ. చీకటంటే విపరీత భయం.

3. "మెడోరినం"యొక్క సిరోలక్షణములేమి ?

తలంతానొప్పి. సిరస్సు బిగబట్టినట్లుంటుంది. నుదుటికి అడ్డంగా దేనితోనో కట్టివేసినట్లుంటుంది. ముచిగిలగుంటలోనొప్పి, కదిలితే వుద్రేకిస్తుంది. సిరస్సున ఎక్కువ దురద. తలపై పక్కికలు, తామర వంటి పొక్కులు. ఎక్కువ చుండ్రు, వెంట్రుకలు బిరుసు, మెదడు లోను, ముచికలగుంటలోను మంట. యీమంట వెన్నుపోడుగునను వ్యాపిస్తుంది. తలబరువు, వెనుకకు లాక్కుపోతుంది. బండిలోగాని, కారులోగాని ప్రయాణంచేస్తే ఆ అదురుకు తలనొప్పి, విరోచినాలు.

4. "మెడోరినం" కుదర్చగల నేత్రలక్షణములేమి ?

కంటిమసగ, దృష్టిపథంలోనివన్నియు నల్లగాను బూడిదరంగు గాను కనుపిస్తాయి. వస్తువులు రెట్టింపు పెద్దవిగానో వున్నకన్న చిన్న విగానో కనుపిస్తాయి. కళ్ళలో ఇసుకపోసినట్లు — పుల్లలు గుచ్చు కొంటున్నట్లు వుంటుంది. వుదయం కళ్ళు అంటుకుంటాయి. కను రెప్పల వెంట్రుకలు ఊడిపోతాయి.

5. ముక్కు-చెవులపై "మెడోరినం" ప్రభావమేమి ?

చెముడు; సరిగా వినుపించకపోవుట, ఎవరో గుసగుస లాడు చున్నట్లు భావన, చెవియొక్కనాడి పోడుగునా నొప్పి. ఆటు, పోటు. చెవిలో ఏవో పాకుచున్నట్లుంటుంది. చెవి దురద, నొప్పి.

ముక్కుకు విపరీత పడిశము; ఆఘ్రాణశక్తి నసిస్తుంది; వాసన తెలియదు. చీమిడి తెల్లగాగాని, పశుపురంగుగాగాని వుంటుంది. ముక్కునుండి రక్తస్రావం. ఆనుం రక్తంతో కలసి వెళ్ళడం. ముక్కు దురద; ముక్కులో ఏవో పాకుచున్నట్లు బాధ.

6. 'మెడారినం' కుదర్చగల కంఠసంబంధమగు వ్యాధులేవి?

గొంతునొప్పి, వాపు; ఏదైనా తిండానికి, తాగడానికి చాల కష్టంగా వుంటుంది. గుటకవేస్తే ప్రాణం పోయేటంతబాధ. గొంతుగలో తరచు ముద్దలాటి కఫం చేరుతుంది. గొంతుగ తరచు ఎండిపోతుంది. నిద్రలో గొంతుగ ఎండిపోయి విపరీతమగుదగ్గు వస్తుంది.

7. జీర్ణకోశము, మలాశయము ల యందు "మెడారినం" కలిగించే మార్పులేమి?

మలం బంకలాఉండి ఎంత బిగబట్టినా బైటకురాదు; విరోచనం నిమిత్తం బిగబట్టి ప్రయత్నించడంవల్ల ఆసన కండరం ముందుకు జారుతుంది. ఆసనంలో నొక్కుచున్నట్లు బాధగావుండి విరోచనం కాదు; అయితే ఉండల్లా అవుతుంది. వెనక్కి చార్లపడితేనే గాని విరోచనం కాదు. ఆసనంలో సూదిపోట్లు, ఆసనం వెంట దుర్వాసనవేయు స్రావం సుఖవ్యాధులతో బాధపడే దంపతులకు కలిగే సంతానముకు తరచు విరోచనములు, వాంతుల తో బాధపడుతూ క్షీణిస్తుంటే "మెడారినం" వాడాలి.

8. "మెడారినం" రోగికి మూత్రావయవములు, సంభోగావయవములు ఏ విధముగా చెడును?

నడుముతీపు, బాధ, సాఫీగా మూత్రం అయితే బాధతగ్గుతుంది. మూత్రనాడులలో విపరీతమగుబాధ. మంచుగడ్డ తినాలని ఉంటుంది. నిద్రలో తెలియకుండా అమిత మూత్రవిసర్జన జరుగుతుంది. రాత్రులందు తరచుగా విస్తారం మూత్రవిసర్జన జరుగుతుంది. మూత్రంలో శ్వేత ధాతువ వుంటుంది; పోటు; కాళ్ళు చీలమండలు వాపు; మూత్రవిసర్జన కాలంలో మూత్రవాహిసితీపు; మూత్రపిండములు; మూత్రకోశము, ప్రోస్టేటుగ్రంధి వాస్తాయి.

ఋతువు నల్లగా పేరుకొని అవుతూ బట్టవుసిమినా డాగుపోదు అంతులేనంత ఋతుస్రావం. ఋతుస్రావము కొన్ని వారాలపాటు వాసనవేస్తూ కుదప కుదపలలా అవుతుంది. గర్భాశయంవాపు. ముట్లు ఉడుగుకాలంలో రుతుదోషం; భరించరాని రుతుశూలు; కాళ్ళుముడుచుకొని గర్భాశయం నొక్కిపట్టాలి. వ్రసవవేదనంత బాధగా ఉంటుంది; రుతుశూలబాధ. యోని విపరీతమగు దురద స్థనములు, వీటి కొనలు తీపు. పోటు – స్థనములు, వీటికొనలు చల్లగానుండి మిగిలిన యావత్తుశరీరం వెచ్చగా ఉంటుంది.

చాలసార్లు సెగవ్యాధి తగిలిన యువకులకు శుక్లనష్టం, నపుంసకత్వం, గనోరియావలన సంభవించు అన్నిరకముల కీళ్ళనొప్పులకు పని చేస్తుంది. వృషణములు వాపు, పోటు. ఎడమ వృషణము, ఎడమ వీర్యనాళములకు సంబంధించిన వ్యాధులకు ఎడమవైపు, సైటికా వ్యాధికి పనిచేస్తుంది. నడుము తీపు, పోటు.

9, శ్వాసకోశములపై 'మెడోరినం' చేయగల వని ఏమి?

ఉబ్బసపుదగ్గు, స్వరపేటిలో బాధచే దగ్గు, తరచు పులమారడం. శ్వాసకోశము కుదించుకొనిపోయి ఊపిరిఆడదు, బోర్లగిలా పడుండి నాలుకసాచిననేగాని ఊపిరాడదు.

గొంతుగ పుండుపడినట్లు వచ్చిగానుండి నొప్పి. గొంతుగబిగ బట్టినట్లుంటుంది. ఆయాసం, గాలిపీల్చుటకు కష్టముండదుగాని విడిచే టప్పుడుమాత్రం కష్టం, బాధ (శాంబూకస్) విరామంలేని పొడిదగ్గు, బాధ. గొట్టంలోదగ్గినట్లు బొంగురుగాదగ్గు యీదగ్గు రాత్రులందుం; టుంది. భోజనానంతరము, పడుకున్న తర్వాత దగ్గుఉద్రేకించి పొట్టపై బోర్లగిలి పడుకున్నచో బాధ, దగ్గుకూడ తగ్గుతాయి. కఫం తెల్లగా, చేదుగా, దుర్వాసనగానుండి, తెగితడుట కష్టముగును. క్షయవ్యాధి

యొక్క ప్రథమావస్థయందు ఛాతీయొక్క మధ్యభాగంలో బాధ. ఆయాసం, గుండెదడ, గుండెమడుకు, గుండెలలో క్రోయుచున్నట్లు బాధగానుండి కదలికవలన ఉద్రేకించును. గుండెలో మంట ప్రారంభమై యడమభుజముగుండా ప్రాకును.

10. వెన్ను-అవయవములు "మెడోరినం" వలన ఎట్టిబాధలకు లోనగును ?

నడుమునొప్పి, రెండుభుజములమధ్యనా బాధ. వెన్నుపూస పొడుగునను పచ్చిగానుండి తాకనివ్వడు (చైనా-సల్ఫ). ముచిగల గుంటలో మంట ప్రారంభమై వెన్నుపొడుగుననూ ప్రాకును.

రెండు భుజములయందలి కీళ్లనొప్పి, యీనొప్పి చేతులగుండా వేళ్ళవరకు పోడచును. కదలికవలన నొప్పి ఉపశమించును. (కుడినైపు (శాంగునేరియా; ఎడమనైపున ఫెర్రం-మెటాలికం). నడుము దగ్గర వెన్నుపూస నొప్పిగానుండి సున్నితముగానుండును. తుంటిలోను, కాకాళ్ళ తొడ వెనుకభాగమున నొప్పులు. కాళ్ళపొడుగునా నొప్పి, మోకాళ్ళనొప్పి, నడుచునప్పుడు తుంట్లనుండి మోకాళ్ళ వరకు నొప్పి, కాళ్ళబరువు, సీసపుగుండ్లవలెనుండును. నడచుటకు దుర్లభమగును. రాత్రిలందు కాళ్ళు విపరీతంగా లాగుతాయి, అందుచే నిద్రపట్టదు. ఆరాటం, కాళ్ళూ, పాదాలు యెక్కువగా ఆడిస్తాడు (జింకం). కాళ్ళలోనినాళ్ళు బిగలాక్కుపోతాయి; పిక్కలలోను, పాదాలలోను కొంకర్లు. నడచేటప్పుడు సీ:నుండ మెలిదిరిగిపోతుంది అరచేతులు, పాదాలు మంట. చమటలు విపరీతంగా పడుతాయి.

వేళ్ళకణుపులువాచి నొప్పి. సీలమండవాచి నొప్పిగాఉంటుంది. పాదాలు మోకాళ్ళదాకావాచి నొక్కితే చొట్టపడుతుంది. పాదాలు

అతిసున్నితంగాఉండి చితుకగొట్టినట్లునొప్పి. పాదాలు ఊదారంగుగా ఉంటాయి. చమటలు విపరీతంగా పడుతాయి.

11. నిద్రలోపుట్టు యేలక్షణములకు "మెడారినం" పనిచేస్తుంది ?

మోకాళ్ళమీద పరుండి తలను తలగడక్రిందకు పోనిస్తాడు. అట్లుచేయుటవలన దగ్గు, ఆయాసం ఉపశమిస్తాయి.

కన్నుమూస్తే కల్లో చచ్చినవాళ్ళు, దయ్యాలు కనుపిస్తాయి. రాత్రిఅంటే భయం, నిద్రవస్తుంది కాని నిద్రపోలేడు. రాత్రి తొలి ఝామున నిద్రపట్టదు. రాత్రిళ్ళు విస్తారంగా చమట్లుపోస్తాయి.

## 91. మెర్క్యూరీ సల్యూబిలస్ (Mercury Solubilus)

1. మనకు సంబంధించిన వివిధరస సంబంధమగు మందులనువ్రాసి వాటి వ్యత్యాసములను విశదీకరింపుము.

(1) మెర్క్యూరియస్. (2) మెర్క్యూరీ సాల్యూబిలస్. (3) మెర్క్యూరీవివస్. (4) మెర్క్యూరీ కరోసివస్.

మొదటి మూడుమందులలోను ఋజువుచేయబడిన లక్షణములలో వ్యత్యాసమంతగాలేదు. ఒకేలక్షణములలో వారివారి యిష్టానుసారము ఉపయోగింతురు. కొందరు "వివస్"ను పురుషుల ఋగ్మతలకు, "సాల్యూబిలస్" స్త్రీల రుగ్మతలకు ఉపయోగించెదరు. కాని "సాల్యూబిలస్" చర్మవ్యాధులలో ప్రత్యేకముగా పనిచేయును. అన్నిటికంటె "కెరాసివస్" చాల తీవ్రతరవ్యాధులలో పనిచేయును.

2. 'మెర్క్యూరీ సల్యూబిలస్'యొక్క సాధారణ లక్షణములేమి ?

నాలుకవాచి ఉబ్బుతుంది; అందుచే పంటినొక్కులు నాలుకపై ప్రస్ఫుటంగా పడుతాయి. ఇగుళ్ళువాచి స్పంజలా మెత్తబడి నాటి

వెంట రక్తం ఊరుతూఉంటుంది. నోరు వాసన, వదిలినశ్వాసకూడ దుర్వాసన.

చాలవ్యాధులలో చెమట్లు రేయింబవలు పట్టునేగాని ఉపశమన ముండదు. పడిశప్రారంభములో ప్రాకుచున్నట్లు చలి. అమత్వచలన్నియు పాచికట్టి ఉంటాయి. నోట్లోనీరు ఊరుతూనేఉంటుందిగాని అమితంగా దాహంవేస్తుంది. గ్రంథులన్నియువాచి గట్టిపడుతాయి. పెద్ద కై వారంగలపుండ్లు. కుడిఊపిరితిత్తి క్రిందిభాగం వ్యాధిగ్రస్తమవుతుంది. పళ్లు వదులుగాఉండి ఊడిపోతాయి. కాలేయము చెడిపోతుంది. చమట్లవల్ల పశుపురంగుడాగులు.

3. 'మెర్క్యూరీ'కి విరుగుడుగా వాడనగు సాహాప్యౌషధములేవి ?

హీపార్ సల్ఫ్, చైనా, నైట్రిక్-యాసిడ్, అయోడిన్, డల్ కెమెరా, కాలీ అయోడైడ్, మెజీరినం, ఆరం, స్టఫిసాగ్రియా, ఎసాఫటోడియం.

4. "మెర్క్యూరీ సాల్యూబిలస్"యొక్క ప్రధాన నైసర్గిక లక్షణము లేమి ?

చమటలు దుర్వాసనగాను జిడ్డుగాను ఉంటాయి. చమటల వలన బాధలు తగ్గకపోవడమేగాక యెక్కువఅవడంకూడ సహజం. (చమటలవలన ఉపశమనం - నేట్రం - మూర్; సోరినం, విరాట్రం-ఆ) శరీరం దుర్వాసన, విడచిన శ్వాసకూడ అంతే.

ఎముకలవ్యాధి, రాత్రిసమయంలో ఎముకలలో పోట్లుబాధ. గ్రంథులువాచునేగాని చీముపట్టదు చీముపట్టినచో విపరీతముగుస్రావము (హీపార్-సైలీషియా)

మాట్లాడడంలో మమకు, తొందర, కంగారు.

పడిశం:-అమితంగా తుమ్ములు, ముక్కునుండి ఒకొప్పుతో కూడి నసీరుకారి ముక్కువాచి మంటగా ఉంటుంది.

లక్షణాలు వుష్ణంవల్ల, సీతలంవల్లకూడ వుద్రేకిస్తాయి. పరుపు వేడివలన బాధలన్నియు వుద్రేకిస్తాయి.

పాదాలకు చమట్లు, ఇవితగ్గితే తలనొప్పి, తలనొప్పితగ్గితే పాదాలకు చమట్లు. యీవిధంగా ఒకటితగ్గి మరొకటి వస్తుంది.

పాలుపడక విరిగి ఆమ్లంగా వెళ్ళిపోతాయి.

ఋతుకాలంలో స్థనాల్లో పాలు, మైల అవకపోవడం, స్థనాల్లో పాలుపడడం. తొడల్లో ఒరుపులు.

కుడితట్టు పడుకుంటే వుద్రేకించేదగ్గు. ముక్కువెంట పేరుకున్న రక్తం తీగల్లా ముక్కునుండి భూమిదాకా ధారగాపడుతుంది.

దురదవలన శిశువు శిశ్నం లాగుకుంటాడు.

అరచేతుల్లో సవాయివలన ఎర్రగాకంది పొరలు ఊడుతాయి. దురదమాత్రం అంతగావుండదు.

పంటికుదుళ్ళు బాగానేవుంటాయికాని కొనలుమాత్రం సిధిలమవుతాయి (వ్యతిరేకం-మెజీరియం) దవుడపైన చేతితో వ్రాయడం చేత పండ్లపోటు వుపశమిస్తుంది.

జిగటగా, సబ్బునురగలా. తీగలా సాగుచూ దుర్వాసనతో కూడిన కిలంలాటి లాలాజలం; పరుంటే లాలాజలంతో తలగడతడుస్తుంది. నాలుకవుబ్బి పెద్దదై పంటినొక్కుల ముద్రలతో వుంటుంది. నోటివెంట నీరుకారుతున్నా దాహంగానే వుంటుంది.

గవజలు, అంగుడుపుండు, టాన్సిల్సు—ఇవి విస్తారం దుర్వాసన తోకూడిన లాలాజలంతో వున్నప్పుడు కొండనాలుకవాచి జారుతుంది. తరచుగా గుటక వేస్తూవుండాలి. బంకవిరోచనములు, జిగురు, రక్తం, అమితంగా క్రిందిపొట్టలో నొప్పి, ఈనొప్పి భరించలేనిదగుటచే శోష వస్తుంది. విరోచనానికిముందు, అయేటప్పుడు, అయాక, ఆసనంతీపు. ఎంతసేపుకూర్చున్నా విరోచనాన్నుంచి లేవాలని వుండదు. చలి కూడాను; రక్తం ఎంతఎక్కువగా వెళ్లుతూవుంటే ఈమందు అంత బాగాపని చేస్తుంది.

తరచు మూత్రానుమానం. త్రాగిననీళ్ళకుమించిన మూత్ర విసర్జన; రక్తమిళితమైన శుక్లనష్టం.

కుసుమ : రాత్రికాలంలో అగుచూ ఒరుపు, మంట. దురదతో కూడి వుంటుంది. మూత్రం యోనికి తగిలినప్పుడు ఉలారం, దురద ప్రక్షాళన చేసుకుంటే ఉపశమిస్తుంది.

వేవిళ్ళు : నోటివెంట చొంగ; రాత్రులందు తలగడ చొంగతో తడుస్తుంది. (ఏసిడ్ – లేక్టిక్)

పంటి యిగుళ్ళు. పెదవులు, అంగుడి, పళ్లు— వీటియందు పుళ్ళు; దుర్వాసనతో కూడిన చొంగ.

కాళ్ళు, చేతులు వణకు; చేతులు ఏపని చేయుటకు వణకు తాయి – కంపవాతం.

పై చెవియందు మొటిమలు. రక్తమిశ్రమమగు చీము, చెవి పోటు; చెవివాసన, దురద, ముఖ్యంగా కుడిచెవి వ్యాధిగ్రస్తమవుతుంది.

అసనమునుండి నుసిపురుగులు పిర్రదాకా ప్రాకి వస్తాయి. పళ్లికలవలె పుళ్ళుపడి వాటి కేంద్రంలో జున్నువలె తెల్లని పదార్థ ముండి ఎర్రగా మెలితిరిగిన వంచలు కడుతాయి.

శగ : అంగం చివరిభాగంలో నీటిబుగ్గలా వాస్తుంది. మూత్ర వాహినియొక్క ముందుభాగంలో అగిడి మంట. తరచు మూత్రాను మానం; మూత్రం భగ్గుభగ్గున మండుచూ చుక్కచుక్కలుగా వెడు తుంది. ఆకుపచ్చని స్రావం. అంగంయొక్క ముందుభాగం విపరీతంగా వాచి బాధ, నొప్పి. కాళ్ళు ఎడంగా పెట్టి నడుస్తారు. చమట వలన పసుపురంగు డాగు అవుతుంది.

5. 'మెర్క్యూరియస్'కు గల రెండు వింత లక్షణములేమి ?

(1) నోటివెంట చొంగ కారుతూనే ఉంటుంది ; అప్పుడుకూడ దాహం.

(2) సాధారణంగా చమటపట్టినచో వ్యాధి ఉపశమిస్తుంది. యీ మందుకు అట్లుగాక చమటపట్టినను బాధ ఉపశమించక పోవుటే కాకుండా ఉద్రేకిస్తుందికూడాను.

6. "మెర్క్యూరియస్" రోగియొక్క నోటిని వర్ణింపుము.

ఇగుళ్ళువాచి కచికలా జవజవలాడుతూ రక్తం స్రవిస్తుంది. నాలుకకూడ ఉబ్బి దళసరిగా వుంటుంది. పంటినొక్కుల ముద్ర నాలుక పై చాలసేపు నిలచిపోతుంది. నాలుక తడిగా వుండికూడ విదాహం. నోటివెంట తీగలుసాగే చొంగ. నోరు దుర్వాసన; గది అంతా అదే వాసన.

7. " మెర్క్యూరియస్ " నివారణచేయగల కంటి లక్షణములను నాల్గింటిని తెలుపుము.

(1) కంటియందు విపరీతమగు పుసులు, వీటివలన కనురెప్పలు ఒకిసి ఎఱ్ఱగా ఉంటాయి.

(2) కన్ను మంటలు, వాపు.

(3) కంటి మసగ, వెలుతురు చూడలేకపోవుట.

(4) కంటి పాపపై పుండు.

8. "కాలీ బైక్రోమికం" యొక్క పుండుకు "మెర్క్యూరియస్" పుండుకు తారతమ్యమును వ్రాయుము.

"మెర్క్యూరియస్" యొక్క పుండు పరిమితము మాత్రమే హెచ్చును; హెచ్చుటకూడ చాల త్వరలోనే జరుగును.

'కాలీబైక్రోమికం' యొక్క పుండు గుండ్రముగానుండి లోతుకు పోవును.

9. గొంతుగవ్యాధిలో "మెర్క్యూరియస్" యొక్క సహజలక్షణములేమి?

గొంతుగ పొడారి నొప్పిగావుంటుంది. తరచు గుటక వేయవలసి వస్తుంది. కంఠమందలి గ్రంథులు వాచి, తీపుగా ఉంటుంది. గొంతుగ పచ్చిగావుండి యెరుపెక్కి నొప్పిగాను, మంటగాను ఉంటుంది. శ్వాస దుర్వాసన; నోటివెంట అంతులేని చొంగ.

10. 'మెర్క్యూరియస్' యొక్క జ్వరలక్షణములేమి?

వెన్ను వెంట చలి ప్రాకుచున్నట్లుండి వణకు, చలి సాయంకాలం ప్రారంభించి క్రమంగా రాత్రికి యెక్కువవుతుంది. చలి, వేడి ఒకటి విడచి మరొకటి ఉంటాయి. అనగా ఒకటి తగ్గి మరొకటి వస్తుంది. ఈ విధంగా శరీరమంతటా ఉండక ప్రత్యేక భాగాలలో ఉంటూంటుంది. సాధారణంగా పడిశం పట్టేచుండు కురుపులు; అంగుడు పుండు, గొంతుగ బాధ వగైరా వ్యాధులు సంభవిస్తాయి.

11. "మెర్క్యూరియస్"కు ప్రకోపసమయములను, కారణములను, పరిస్థితులను వ్రాయుము.

రాత్రిసమయము, ఆకురాలు కాలము, పగలు వేడిగానుండి రాత్రి చల్లని తేమగాలి వీచుకాలములోను, తేమగాలి వీచు కాలము లోను (రూస్ టాక్సు) కుడివైపు పరుండినప్పుడు చమట పట్టిన సమయములోను వ్యాధి లక్షణములు ఉద్రేకిస్తాయి.

## 92. మెర్క్యూరీ-కరోజివస్ (Mercury Corrosivus)

1. ఇతర రసౌషధములనుండి 'మెర్క్యూరీ కరోసివస్' ఎట్లు భేదించును ?

"మెర్క్యూరీకరోజివస్"కు విపరీతమగు ఎరుపు, అగిడి మంటలు. ఎక్కువగా చురకైనది; అమిత ఉద్రిక్తమైనది. 'మెర్క్యూరీ సాల్యూబిలస్' మందమైనది, సాత్విక లక్షణములు కలది. "కరోజివస్" చాల చురుకైనది, ఉద్రేకమైనది గనుకనే 'మెర్క్యూరీ' పునావెగల రోగికి తరచుగా యీ రసౌషధమునే ఎక్కువగా వాడెదరు. ఆసనమందలి తీపును నివారించుటలో దీనిది అగ్రస్థానము. విధ్వంసములో అనగా తినివేయుటలో ప్రథమశ్రేణికి చెందిన మందు. ఒక రాత్రి కాలములో అరచెయ్యి అంతమేర తినివేస్తుంది. అనగా 'మెర్క్యూ - కరోజివస్' లో పుండు వైశాల్యము గంట గంటకు పెరిగిపోవుచుండును.

2. 'మెర్క్యూరీ - కరోజివస్'యొక్క నేత్రలక్షణములేవి ?

మంట, ఎరుపు, ఆటు, పోటు; వెల్తురును చూచి భరించలేదు. ఎరుపుతో కూడిన కన్నీరు, చెక్కిళ్ళు కన్నీటిచే ఒరిసి, కొన్ని సమయాలలో కన్నీరు చర్మాన్నే తినేస్తోందా అన్నంత మంటగా వుంటుంది.

ఒరుపు; కంటిచుట్టునా ఉన్న ఎముకలలో పోట్లు, కంటిపాపపై పుండు పడి తూట్లుపడుతుంది. సవాయిచే అంకురించిన "ఇరిటిస్" అనే వ్యాధికి పెట్టింది పేరు. గుడ్లు ఊడిపడేటట్లు కంటి వెనుక భాగంలో నొప్పి, బాధ. చీము, పుసి అంతగావుండదు, కనురెప్పలు ఒరిసి వాస్తాయి. (బొయిరిక్)

3. కంఠబుగ్మతలలో ఎప్పుడు మెర్క్యూరీ-కరోజివస్ పనిచేయును?

గొంతు నొక్కినట్లు బాధ; కొండనాలుక వాచి అమితముగా మంట; ఏది ఏమాత్రం తగిలినా బాధ. గుటక వేస్తే ఈడ్పులు, గొంతుగ నొప్పి; పుండ్లుపడి పాకి నిప్పులా మండిపోతుంది. అమితంగా గొంతు వాచి విదాహం; తాగినకొలది తాగాలనే వుంటుంది.

4. గ్రహణి విరోచినాలలో మెర్క్యూ-కర్ జనింపజేయు లక్షణము లేమి?

వ్యాధి చాల ఉద్భృతంగా ఉంటుంది. రక్తం విపరీతంగా పోతుంది; ఆరాటము మిక్కుటము; తనివితీరని విరోచనానుమానము: విరోచనానికి వెడితే గంటల తరువాతగాని రాదు; ఒకటే తీపు, మంట. ఎంత సేపుకూర్చున్నా విరోచనానుమానం తీరదు. ఆసనం, మూత్రాశయము అగిడి మంటలు, మూత్రం ఉబ్బుకువస్తుంది. ఆపుకోలేదు, సర్వదా విరోచనానుమాన మే.ఆసనంలో మంట,తీపు. భరించలేని తీపు వలన రోగి యేడుస్తాడు. మలం వెళ్ళినా బాధ తగ్గదు. మూత్రాశయంలో తీపు, మూత్రవాహిని పొడుగునా భగ్గున మండిపోతుంది.

మలం వెచ్చగా, లఘువుగా రక్తంతో కూడిన జిగురు, దుర్వాసన, ఆసనంలోకి వస్తున్నట్లు పోట్లు, మంట, తీపు. కడుపులో మెలివేసుకు పోయేటంత పోట్లు.

రక్తం, మంట, తీపు ఎంతవిస్తారంగాఉంటే అంత యెక్కువగా "మెర్క్యురీ-కర్" కు సూచన. పై పెదవి వాచి ఉంటుంది.

5. "మెర్క్యూరీకర్" యొక్క మూత్రలక్షణములేమి ?

"మెర్క్యూరీ" మందు లన్నిటిలో శ్వేతధాతువు మూత్రంలో విస్తారంగా పోవుటసహజం; "మెర్క్యూరీ-కర్" కు కూడ అదే (అల్బ్యూమినేరియా)

6. శగవ్యాధిలో 'మెర్క్యూ-కర్' వాడదగు లక్షణములేమి ?

శగవ్యాధి తొలిస్థితిలో యీమందు అంతగా పనిచేయదు. కాని ఆకుపచ్చ, పసుపుపచ్చ మిశ్రమ ఛాయలో వెడలే సీటివంటి పలుచని స్రావం లేక నీటితోకూడిన రక్తం స్రవిస్తోన్నప్పుడు, మూత్రం ఆపుకోలేక ఉబ్బుకొని వస్తూండడం, పురుషావయవంకు బాధతో కూడిన ఉద్రేకం వస్తూండడం- ఈ లక్షణాలున్నప్పుడు ఈమందు పనిచేస్తుంది. గనేరియా యొక్క ద్వితీయావస్థలో అనగా ప్రథమావస్థలో ఉండే లక్షణాలు తగ్గినతర్వాత ఇదిఉపయోగిస్తుంది.

7. సవాయి, సిఫిలిస్ ల యొక్క ఏస్థితిలో ఈమందు పనిచేయును?

సిఫిలిస్ రోగము అంకురించిన రెండువారాలలో అంగంమీాద పొక్కు పుడుతుంది, క్రమంగా ఇది పెరిగి చీముపట్టి పుండవుతుంది; దీని చుట్టునా తూట్లలా చిన్ని చిన్ని పొక్కులు పుట్టి మొదటిపుండుతో చేరి పెద్దపుండుగామారి వాటిచుట్టునా ఉన్న అమత్వచలను, కండరాలను తినేస్తాయి. స్త్రీ పురుష జననేంద్రియాలపై లేచే యీలాంటి పుళ్ళను "జెనిటల్ షేంకర్సు" అంటారు. ఈపుళ్ళకు 'మెర్క్యూ-కర్' అద్వితీయంగా పనిచేస్తుంది. వ్యాధి యెంతతీవ్రంగాఉంటే అంత ఎక్కువగా ఈ మందు ప్రభావం గోచరిస్తుంది.

వ్యాధిముదిరి, అంగంపై పుండు తగ్గినా శరీరమందలి యితరకో శాల (ముఖం, పెదవులు, ముక్కు, స్థనాలు, అరచేతులు, అరికాళ్లు వగైరా)లో 'పేంకర్సు' పుట్టవచ్చు. వీటిని 'ఎక్స్ట్రాజెనిటల్ పేంకర్సు' అంటారు ఈ లాంటి పేంకర్సుపైనను అడ్డగర్రలు అనే బ్యూబోస్ పైనను "మెర్క్యూరియస్" హెచ్చు పొటెన్సీలో వాడితే నిరుపమానంగా పనిచేస్తుంది.

సుఖవ్యాధుల కారణంగా ముక్కులో పుండ్లుపుట్టి ముక్కుదూలపు టెముకను తినివేయు నప్పుడు, అందలి బాధలకు అనగా ఒరుపు, మంట, దుర్వాసనలకు మెర్క్యూరియస్ పనిచేస్తుంది. ముక్కులో బంకవంటి ఆమం, రక్తయుక్తమైన చీమిడి వున్నప్పుడు యీ మందును మరువకూడదు. అంగాలను పుండు ఎంతత్వరలో, ఎంత ఎక్కువగాను తినివేస్తుంటే అంత యెక్కువగా యీ మందు ఉపయోగపడుతుంది. పుండు పాకిపోతూ జాగ్రత తీసికొనని పక్షంలో కొలది రోజులలోనే మర్మావయవము సగందాటి తినేస్తుంది. "మెర్క్యూరియస్" యొక్క వేగం అంతఎక్కువ. (ఫేరింగ్టన్)

## 93. మెజీరియం (Mezereum)

1. "మెజీరియం" జనింపజేయు మానసిక లక్షణములేమి ?

ఆర్థికంగాను, ఆధ్యాత్మికము గాను విచారంఘు, దిగులు; ఎవరన్నా నిర్లక్ష్యమే; ఏవిషయమన్నా నిర్లక్ష్యమే;. విసుగు. విషయాలోచన చేయలేడు; పరధ్యాన్నం, మరుపు, ఒంటరిగా వుంటే మనస్థిమితం వుండదు; కాని కబుర్లంటే విసుగు, విచారం, మనోవ్యాకులత; భ్రాన్మాదం. ఇవన్నియు చర్మవ్యాధితో కూడివుంటేనే దీనినివాడాలి.

2. "మెజీరియం" యొక్క సహజ లక్షణములను వ్రాయుము.

ముఖ్యంగా దురదతో కూడిన చర్మవ్యాధుల పైన యిది పనిచేస్తుంది. దురదతగ్గేనిమిత్తం రోగి రక్తాలు వచ్చేదాకాకూడ గోకుతాడు. గోకిన పుండ్లు అట్టకట్టి వాటిక్రింద చీముతో గూడుకడుతాయి. ఆ కురుపులను నొక్కితే తెల్లనిచీము. ఈలాటి కురుపులు తలమీద అట్ట కట్టినట్లుండి పుర్రెమీద అయినప్పుడు దీనిని మించిన మందు లేదని చెప్పాలి.

చర్మం యావత్తూదురద. జిల,బిరబిరలాడుతూ వుండడం, గోకిన కొద్దీ దురద; దురద ఒకచోటనుండి మరొకచోటకు మారుతుంది. గోకగా గోకగా చర్మం చల్లబడుతుంది. అక్కడక్కడ ఒళ్ళుకూడ చల్లబడుతుంది.

బాధలు, నొప్పులు, సీతలంచే ప్రకోపిస్తాయి. కాని దురదలు, ఆరాటం వుష్ణోపచారాలచే వుద్రేకిస్తాయి.

పక్కులు కట్టిన కురుపులను పిల్లలు నిద్రలోనే రక్తాలు వచ్చేటట్లు బరికేసుకుంటారు. పుర్రెమీద తెల్లనిపక్కులు గట్టిగా ఎత్తుగా వుంటాయి. వాట్లను గోకితే తెల్లని లేతపసువురంగు రసి కుళ్ళువాసన వేస్తూ యెక్కువగా స్రవిస్తుంది. ఈలా వుంటే పక్కులలో క్రిమిలు లేక పేలు పుచ్చుతాయి. ఒరుపుతో రసివుండడంచే తల వెండ్రుకలు కొరికివేయబడి తల బోడిఅవుతుంది. ఈ కురుపులు తలంతా ప్రాకి నడినెత్తిని, చెంపలను, క్రమంగా ఆక్రమించి చెవుల క్రిందకు ముఖానికి గడ్డానికి కూడ ప్రయాణంచేస్తాయి. రక్తప్రసరణ మందంగావుండే తావుల్లో— చెవులు, చేతుల వెనుకతట్టు మోచేతిమీద, కాళ్ళమీద, కంటివద్ద, గెడ్డంమీద ముఖాన్ని, పుర్రెమీద – విస్తారంగా పక్కులు కట్టినకురుపులు, విపరీతమగు దురద ఈ మందు సూచకమగు ప్రముఖలక్షణం,

సవాయి వ్యాధి జీర్ణించి చర్మముపై రాగిరంగు మచ్చలేర్పడినప్పుడు యీ మందును వాడాలి. ముక్కు కొననుండి నుదిటివరకు కుడితట్టుకువిస్తరించే తల నొప్పికి, తలను నొక్కుతున్నట్లుండు నొప్పికి పని చేస్తుంది.

కురుపుల రసికి వెంట్రుకలు అట్టలు కడుతాయి. రసివలన తలంతా ఒక్కటే అట్టక్రింద కప్పేస్తుంది; దుర్వాసన; వీటిని కడిగితే పోచ్చుతాయి. పంటి మొదట పుళ్ళు, చీము.

నరాలపోట్లు, ముఖ్యంగా కంటికి శస్త్ర చికిత్స చేసినతర్వాత కంటినొప్పులు ప్రారంభిస్తాయి. పెద్దఎముకలువాచి రాత్రిసమయంలో విపరీతమగు నొప్పులు. నొప్పులు పై నుండి క్రిందకు విస్తరిస్తాయి. కండరాల అదురు, పక్షవాతంలా ఒళ్లు బిగిసిపోతుంది. లోపల వేడి పైన వణకు, పైన చలి లోపల విపరీతముగా మంటలు, ఒళ్లుబరువు, టీకాలు వేశాక వాళ్ళు పెట్టి కురుపులు, కంటినొప్పి, ముక్కు లో పుళ్ళు, ఒరుపు, పక్కలుకట్టి రాత్రులందు మంట, పోటు.

## 94. మిల్లిఫోలియం (Millifolium)

1. "మిల్లిఫోలియం" యొక్క ముఖ్యోపయోగమేమి ?

ముక్కువెంట, మూత్రద్వారంవెంట రక్తం స్రవిస్తుంది. ఈ మందువిషయంలో "హానిమన్" మహాశయుని మాటలివి.

శరీరమందలి ఏభాగమునుంచి రక్తం స్రవిస్తున్నా అరికడుతుంది. "ఎకొనైట్" రక్తంవలెనే ఎట్టిగా ఉంటుందిగాని దానివలె రోగికి భయాందోళనలు ఉండవు.

ముఖ్యంగా పడినప్పుడు దెబ్బలు తగిలినప్పుడు అయ్యే రక్తస్రావాల్లో "ఆర్నికా" అంతగా పనిచేయులేనప్పుడు యీమందు నిరుప

మూలంగా పనిచేస్తుంది. రక్తస్రావాలు – ఏమియు బాధ పెట్టవు. జ్వరంరాదు. రక్తం ఎఱ్ఱగా ద్రవరూపంలో నిగారిస్తూ ఉంటుంది. ఈలాటి రక్తం ఊపిరితిత్తు నుండి, శ్వాసకోశాలనుండి, గొంతుగనుండి నోరునుండి, ముక్కునుండి, ఉదరంనుండి, మూత్రాశయంనుండి, ఆసనంనుండి, గర్భాశయంనుండి స్రవిస్తుంది. ఇట్టి రక్తస్రావం దెబ్బలు తగిలినప్పుడు (ఆర్నికా) పుండ్లనుండి (హెమామిలిస్) వెడలినప్పుడు కూడ ఇది పనిచేస్తుంది క్షయవ్యాధిలో శ్లేష్మంతోపాటు రక్తంకూడ వెలువడుతుంది. ఆస్థితిలో "మెల్లిఫోలియం" రక్తాన్ని దగ్గును అరికట్టి రోగికి ఉపశాంతిని చేకూరుస్తుంది. సాయంకాలం 4 గంటలకు రక్తం స్రవిస్తుంది. ఋతుధర్మం నిలచిపోయి మూలశంకనుండియు, దగ్గులు వలనను విస్తారం రక్తం స్రవిస్తున్నప్పుడు యీమందుయిస్తే యీలా వెళ్ళే రక్తాన్ని అరికట్టి క్రమంగా నెలసరి అయేందుకు తోడ్పడుతుంది.

2. స్త్రీలకువచ్చు ఏ వ్యాధులకు 'మిల్లిఫోలియం' వాడవలెను?

సకాలానికి ముందుగా విస్తారంగా ఋతుస్రావం, ఒకప్పుడు ఋతువు బిగబట్టి ఋతుసూల, ఋతుకాలంలో పొట్టలో నొప్పులు, నిస్పత్తువవలన పిల్లలకు కుసుమవ్యాధి (కాల్కేరియా–కార్బ) గర్భవతులకు మర్మావయవమందలి రక్తనాళములు ఉబ్బి నొప్పివలన బాధగానుండు సమయంలో వాడాలి.

## 95. మూరియాటిక్ – యాసిడ్

## (Muriaticum Acidum)

1. 'మూరియాటిక్ ఏసిడ్' యొక్క ప్రధాన నైసర్గికలక్షణము లేవి?

అతి ప్రమాదకర పరిస్థితిలోనున్న సన్నిపాత జ్వరరోగికి ఉప

రోగపడు ఔషధములలో ప్రధానమైనది. ఇది 'కార్బో వెజిటాబిలిస్' వలె భయంకర పరిస్థితులలో వాడదగు మందు.

అమితమగు నిస్త్రాణచే రోగి మూల్గును, పరుపు క్రిందకు దిగ జారును. నాలుక ఉదారంగుగామారి, పొడిఆరి తోలుముక్కవలె నుండును. నాలుక మూడవవంతుకు కుదింపబడి లాగుకొనిపోవును.

గుండె నీరసించి వక్రగమనంలో ఉంటూ ప్రతి 3వ దెబ్బ తప్పి పోవును. పొగాకు, నల్లమందు అమితముగా ఉపయోగించుటచే కండ రములలో నిస్సత్తువ, ఈమందుయొక్క స్రావములన్నియు దుర్వాసనే అమితముగా నిసత్తువ, కుర్చీలోవాత్తే కండ్లు మూతలుపడుతాయి. ఒకటికి వెడితే రెంటికి వస్తుంది. అపానువాయువుతో పాటు మలంకూడ తెలియకుండగా పోతుంది. (ఎలోస్).

మూలశంక:- మొలకలువచ్చి, వాచి ఉదారంగుగా ఉంటాయి. నొప్పి, ఏమితగిలినా భరించరానిబాధ. క్రియకు బట్టరాపిడి కూడ బాధే. మూత్రం పోసుకుంటే ఆసనకండరం జారుతుంది. బాగుగా వినుపించదు. కోరింతదగ్గులో ముక్కువెంట రక్తస్రావం, కాలేయంవాపు. నోటిలో పుళ్ళు, నోరు దుర్వాసన. కళ్లు దురదలు, వస్తువులను నిలువులో సగభాగంమాత్రం చూడకలుగుతాడు.

2. సన్నిపాత జ్వరంలో 'మ్యూరియాటిక్-ఏసిడ్' వాడదగు రోగిని వర్ణింపుము.

శరీరమందలి ధాతువులన్నియు చెడి దుర్వాసనగా ఉంటాయి. నిస్సత్తువవలన మూత్రంతో మలంకూడ పోతుంది. విరోచినాలు నల్ల గా నీళ్ళగా ఒకప్పుడు రక్తంతో మిళితమై తెలియకుండానే అవు తాయి. నోరుబరువు, ఉదారంగుపుళ్ళు, నిస్సత్తువుచే స్పృహలేకుండా

పడిఉంటాడు అమితనీరసం, నిస్త్రాణ, అందుచే మూలుగు, పరుపుపై దిగజారుతాడు. బలహీనతచే క్రిందిదౌడ జారిపోతుంది, పైకిలాక్కునే సత్తువకూడ ఉండదు. నాలుక పొడారి, తోలుముక్కలా పైకి లాక్కుపోయి ఉంటుంది. నాలుకలో మూడవవంతు తోలుముక్కలా లాక్కుపోయి ఉంటుంది. నాలుకకు పట్టుఉండదు, రోగికి స్పృహఉండదు. నాడి చాలా నీరసించి ప్రతి మూడవదెబ్బ తప్పిపోతుంది. చూడ్డానికి రోగి భయంకరంగా ఉంటాడు. భీతావహమగు దృశ్యం. వడిదుడుకు లేని వైద్యుడై ఈస్థితిలో "మూరియాటిక్-ఏసిడ్" యిస్తే రోగికి పునర్జన్మ యిచ్చినట్లే.

3. తలతిరుగుడులో 'మూరియాటిక్-ఏసిడ్' వాడనగు లక్షణములేవి?

కళ్లుతిప్పితే ఒళ్ళుతిరుగుతుంది. కుడితట్టున పడుకుంటే మంచం, గది తిరిగిపోతున్నట్లుంటుంది. ఈమందుకు సాధారణంగా కాలేయం చెడుటచే ఈలక్షణాలు కనుపిస్తాయి.

4. స్త్రీలకు వచ్చు ఏ వ్యాధులకు 'మూరియాటిక్-ఏసిడ్ వాడాలి?

ఋతువు సకాలమునకు ముందుగాను, అపరిమితముగాను అవుతుంది. యోనియందుపుండ్లు, నడుంనొప్పి, కుసుమ ఋతుసమయంలోవలె మర్మావయవములలో ముందుకు తోస్తున్నట్లుంటుంది.

సూతికా జ్వరంతో అపరమిత నిస్త్రాణ, మైలస్రావం (లోకియా) వెడలకున్నచో యీమందు వెడలించును.

# 96. నాజా (Naja)

## 1. "నాజా" అననేమి?

ఇది తాచుపాముయొక్క గరళము. డా. కానిస్టెంటయిన్ హెరింగు మహాశయులు ఈమందును ప్రథమంలో పరీక్షించి ఉపయోగించిరి.

## 2, "నాజా" ఏయే ఋగ్మతలకు ప్రధానమగు మందు?

"నాజా" ముఖ్యంగా నరాలసంబంధమగు హృద్రోగములకు గుండె నీర్సమునకు పనిచేస్తుంది. అంగుడువుండువల్ల కలిగే గుండె వ్యాధులకు, గుండెవ్యాధుల్లో వచ్చే పొడిదగ్గుకు యిది ప్రత్యేకంగా పనిచేస్తుంది. ఆయాసం, నిస్సత్తువ, గుండెవ్యాధిచే సొమ్మసిల్లిపోయేటప్పుడు దీన్ని వాడాలి. గుండెబరువు, గాబరా, గుండెదడ, యివన్నియు నడచినచో హెచ్చును. రానున్నవన్నీ దుర్దినాలని, భావి అంతా అంధకార బంధురమని భావన. సర్వదా ఆత్మహత్య తప్ప గత్యంతరము లేదని ఆత్మహత్యనుగురించే ఆలోచిస్తుంటాడు.

దగ్గినప్పుడు ఎడమ అండాశయములోపోట్లు, తరచు పులమారుచుండుటచే మాట్లాడ్డం కష్టం. నరాల దుర్బలత్వ ఫలితంగా చిరకాలంగా ఉంటూన్న గుండెదడ, ముఖ్యంగా ఉపన్యాసకులకు పనిచేస్తుంది. గుండెదడచే మాట్లాడలేడు, ఎడతెరిపిలేని ఆయాసం, గుండెలో భరించలేని సూదిపోట్లు, ఉక్కిరిబిక్కిరి అయ్యేటట్లు పులమారుతుంది. బాధచేత గొంతుగను చేతితోపట్టుకోవాలి. గుండెప్రాంతంలో దారుణమగుపోటు; గుండెల్లోకి విస్తరిస్తుంది. ఎడమతట్టుకు తిరిగి పరుండలేడు. హృదయ సంబంధమగు దగ్గు; దగ్గేటప్పుడు అరచేతులలో చెమట్లు;

నిద్రలో ఉక్కిరిబిక్కిరి అవుతాడు. తుమ్ము వచ్చినా, చల్లగాలి శరీరానికి తగులుచున్నా బాధలు తగ్గుతాయి.

## 97. నేట్రం కార్బ (Natrum Carb)

1. "నేట్రం-కార్బ"కు సంబంధించిన మానసికలక్షణములు ప్రత్యేకముగాను, ఇతర సాధారణలక్షణములను వేరుగాను వ్రాయుము.

హానిమన్ మహాశయులు, డా॥ హెర్రింగు గార్లచే ఋజువు చేయబడిన "ఏంటిసోరిక్" 'ఏంటి సైకోటిక్' మందు.

ముఖ్యంగా ఉదరము, ప్రేగులు సంబంధమగు వ్యాధులపై పనిచేయుమందు. బెంగ, మానసిక దౌర్బల్యం, త్రేన్పులు, ఆమ్లాధిక్యత, పులితేన్పులు, కీళ్ళనొప్పులు, భుజములు నొక్కుకొనిపోవును. ఈరోగికి సీతలం పనికిరాదు, ఉష్ణం పనికిరాదు. సమసీతోష్ణంగా ఉండాలి.

మానసిక పరిశ్రమవలన వ్యాధి ఉద్రేకించడం దీని ప్రముఖ లక్షణం. పట్టుమని పది నిమిషాలు చదివినా ఆలోచించినా తలనొప్పి, తల త్రిప్పు, నిస్పృహ, ముక్కోపం, మానసిక లక్షణాలు ముఖ్యంగా భోజనా నంతరం హెచ్చి ఆహారం ఉదరంనుండి ప్రేగుల లోనికి జారిన కొలదీ క్రమంగా ఉపశమిస్తాయి. మానసిక శ్రమ ఏమాత్రంకూడ పడదు. శబ్దంవింటే భయం, దడ; చిన్న శబ్దానికి కూడ ఉలికిపడుతాడు; ఇంటెందుకు తలుపు చప్పుడైతే గుండెదడ, భయం, ఆందోళన; దీనికిదో ప్రముఖ లక్షణం. కాగితం చప్పుడుకే గుండెదడ, విసుగు, విచారం; సంఘమన్నా, మానవులన్నా రోత; తన కుటుంబమంటేనే నిర్లక్ష్యం. ప్రత్యేకంగా కొంతమంది వ్యక్తులంటే భయం, భీతి, సుఖం

యిచ్చే సంగీతం వింటే యీ రోగికి భయం, దడ, భీతి, ఆత్మహత్య చేసుకోవాలనే కోర్కె కలగడం, విచారం, యేడుపు, దడ, వణుకు.

పాలు పడవు - ఇదో ప్రత్యేక లక్షణం. పాలుతాగితే విరోచనాలు, చల్లగాలిపడదు. మానసికంగాగాని, శారీరకంగాగాని ఏమాత్రం పనికూడ చేయలేని దుర్బలత్వం, మరుపు; చదువుతూ నేమరచిపోతాడు.

2. నేట్రింకార్బుయొక్క ప్రధాన స్వభావికలక్షణాలేమి ?

సూర్యరస్మిగాని, గేస్‌లైటు వెలుతురుగాని పడదు; తలనొప్పి వస్తుంది. వేసవికాలం వేడికి నిస్సత్తువ, నీరసం, వడఘాడ్పు యొక్క కాలిక వ్యాధులకు బాధలకు మంచిమందు (లెకెసిన్-గ్లొనైన్). సూర్యకాంతి, దీపపువెల్తురు, మానసిక పరిశ్రమ ,బహిష్టుకు ముందు లక్షణములు ఉద్రేకిస్తాయి. సంగీతముకూడ ఉద్రేక హేతువే. ముచికల గుంటలో భారం, నొప్పి; సిరస్సు పెద్దదై నట్లుండి పగిలిపోతుందేమో అనుపిస్తుంది.

ముక్కులు దిబ్బడవేసి రాత్రిలందు ఊపిరాడదు. పగలు ముక్కు ఓదుతూవుంటుంది. ఆకుపచ్చగాను, పసుపు పచ్చగాను, ముద్దగాను వాసనతోను కూడిన శ్లేష్మం, చీమిడి ముక్కు వెంట పోతుంది. భోజనంచేసిన తరువాత ముక్కు నీరుకడుతుంది.

ఆలింగనం చేసినమాత్రానే స్త్రీల యోనినుండి స్రావం వెలువడ్డంచే పురుషుని శుక్లాన్ని గర్భంలో ఇముడ్చుకొనలేకపోవుట వలన స్త్రీలు గర్భవతులు కాకుండుట (వంధ్యత్వము) కు పనిచేయును.

మడమసీల దుర్బలంగావుండి నడచేటప్పుడు కాలు వడితిరగడం - బెణకడం - వాపు. పోటు(కార్బో-వెనిమలిస్; నేట్రం-మూర్) పాదం యొక్క ముందుభాగముపై "లైకోపోడియుం" మడమసీలపై

"నేట్రంకార్బ్" కు ప్రత్యేక ప్రభావము కలదు. చిన్ననాటనుండియు సీలమండ దౌర్బల్యముగా నున్నప్పుడు "నేట్రంకార్బ్" ను వాడవచ్చును. "సెపియా" తరువాత వాడవలెను.

కండరాలు అదురు; హృదయం అవయవాలన్నీ నిస్సత్తువుగా వుంటాయి. మసుపు; వాస్తే అన్నీ తప్పులే; శ్వాస ఆడక ఆయాసం.

రాత్రి చాలసేపటికి గాని నిద్ర పట్టదు; పగలంతా మగత, కునికిపాట్లు: శృంగార సంబంధమగు కలలు.

సంభోగము :-అసంపూర్తి; అసంతృప్తి; త్వరితస్ఖలనం;పూర్ణమైన లేపనము వుండదు.

విరోచనం వుబ్బుకొస్తుంది; మల విసర్జనం పెద్ద చప్పుడుతో అవుతుంది. మలం నురగలా అవుతుంది.

తీసిటింటే పళ్ళుపోటు (ఎమోనియా-కా; ఫోస్ఫరస్, సెపియా) కనుమ ముద్దగా, పసుపురంగుగా బురదగా అవుతుంది; మూత్రవిసర్జనా నంతరం తగ్గుంతుది.

ఋతువు ఆలశ్యంగా,స్వల్పంగా, మాంసం కడిగిన నీళ్లవలెఅవుతుంది. లోపలనుండి సర్వం బయటపడుతోన్నట్లు దిగజారే నొప్పులు; పచార్లు చేస్తేతగ్గుతాయి. గర్భాశయ ముఖద్వారం వాపు నడుము పోటు సలుపు - నడుస్తే చాలఎక్కువగా వుంటుంది. పురాతన జెణుకులకు దివ్యౌషధం.

3. "నేట్రింకార్బ్"వల్ల కలిగే చర్మవ్యాధులేమి ?

దోమకాటులా ఒళ్లంతా దురదలు, పొక్కులు. వేళ్ల చివర సీలమండల దగ్గరా దురద పొక్కులు, ఇవి చితకడం తిరిగి కుండలలా రావడం. వ్రేలికణుపుల దగ్గర పుళ్ళు, కురుపులు. శరీర మంతా గుండ్రని పళ్ళికలలా పొక్కులు బైలుదేరతాయి.

తొడలు, మోకాళ్ళు, పిక్కలు-వీటిపై పల్లికలు ఇవి దురద, మంట, గోకితే తెల్లని నుసినీరు కారి ఒరిసి మండుతాయి.

ఒళ్లుచమట్లు, చల్లగా వుంటుంది. దురద, జిల, ఒకప్పుడు యిక్కడను రద, కానేపట్లో మరోచోట దురద, ఈవిధంగా స్థలం మారుతూ శరీర మంతా దురదే.(కెంటు) అరచేతులు, ఒళ్ళు పగుల్తాయి. కాళ్ళు ఒరుపు, వాపు, ముక్కుచివర ఎఱ్ఱగాకంది చర్మం ఒరిసి పొరఊడుతుంది.

4. "నేట్రంకార్బ" సంబంధమగు జఠరలక్షణములేమి ?

పుల్లత్రేన్పులు; దుర్వాసన వేయు అపానవాయువులు. పగలు 11 గంటలకు నిస్త్రాణతో ఆకలి (ఫేరింగ్టన్).

సూర్యోదయానికి పూర్వం తెల్లవారగట్ల 5 గంటలకు, రాత్రి 11 గం టలకు నిస్త్రాణ ఆకలి (కెంటు). పిండిపదార్థాలు, కాయగూరలు, తింటే పడవు, సాధారణంగా, ఏదైనా తింటే తలనొప్పి, గుండెదడ, చలి తగ్గు తాయి. (ఇగ్నీషియా. సెపియా, – కెంటు) నరాల దుర్బలత్వమువలన గర్భవతులకు వెర్రాకలి; రాత్రిలేచి ఏమైనాతింటేనే కాని నిద్రప ట్టదు. వేడిచేసినప్పుడు చల్లనినీరు త్రాగడంచే వచ్చేదుర్గుణాలకు పని చేస్తుంది.

పాలు అంటే అహితవు, పడవుకూడాను;విరోచనా లవుతాయి.

5. "నేట్రింకార్బ"కాక సీలమండలు దుర్బలంగల యితరమందులేవి?'

సల్ఫ్యూరిక్ – ఏసిడ్; కాస్టికం; నేట్రం – మూర్; స ల్ఫ ర్; లీడం. కార్బోవెనిమలిస్.

6. వేసవియందలి తాపమునకు వాడనగు అరదజను మందులను వ్రాయుము.

(1) నేట్రం - కార్బ్. (2) నేట్రం - మూర్. (3) ఏంటిమోనియం - కూడ్రం. (4) గ్లోనైన్. (5) లెకెసిన్. (6) లిసిన్.

# 98. నేట్రం - మురారియాటికం(Natrum-Muriaticum)

సూష్లర్ మహాశయుల ద్వాదశ కోశ లవణాల్లో ఇదొకటి.

1. మానవశరీరంలో "నేట్రం-మూరియాటికం" పరిమాణం లోపించుటచే జరుగు మార్పులేమి?

"కాల్కేరియా ఫోస్ఫారికం" తరువాత శరీరంలో ఎక్కువగా వుండే కోశ లవణం యిదే. దీనికి కారణం శరీరం నూటికి డెబ్బది పాళ్ళు జలపూరితం; ఈ నీటిలో సరియగు పరిమాణంలో యీ కోశ లవణం "నేట్రం – మూర్" లోపిస్తే ఆ నీరు నిరుపయోగమవుతుంది. ఈ లవణముయొక్క శక్తి చేతనే నీరు శరీరమున కుపయోగపడు చున్నది. ఇట్లే చెట్లకు, తీగలకు, శాఖ జీవితాలకు నీరు వుపయోగపడు చున్నది.

శరీర పోషణకు, జీవితకృత్యాలు నెరవేర్చుటకు, శరీర మందలి మలినములను బహిర్గత మొనర్చుటకు ఈ లవణం నీటిని పరికరంగా చేసుకుంటుంది. ఈ లవణం లోపిస్తే నీరు నిరుపయోగమై, నీరు చేయ వలసినపని కుంటుపడి శరీరం వ్యాధిపాలౌతుంది. వడదెబ్బ తగిలినప్పుడు శరీరంలో యీ లవణం లోపిస్తే శరీరమందలి ప్రత్యేక స్థానరం లోని జలం సూర్య వేడిమికి ఆరిపోయి అనగా ముచికల గుంటయుండు పొడారిపోయి తద్వారా మెదడుకు వత్తిడికలిగి భయంకర పరిణామాలకు దారితీస్తుంది. కొన్ని సమయాల్లో మృత్యువాతకూడ పడాలి. ఈ లాటి విషమ పరిస్థితులలో "నేట్రం - మూర్" రోగికి తక్షణం స్వస్థత చేకూర్చుతుంది.

జ్వరాల్లో శరీరమందలి జల ధాతువు వక్రించడంచే సంధిలక్ష ణాలు పొడచూపుతాయి. ఈస్థితిలో "నేట్రిం – మూర్" వాడితే కావలసిన తావులకు నీటిని సమకూర్చి విమషాల్లో సంధిని తగ్గించి కోలుకో చేస్తుంది. ఎంత భయానక పరిస్థితులలోనైనా యీ లవణం వాడిన గంటకు రోగికి స్వస్థత చేకూరుతుందని "శారీ" గారు శలవిచ్చారు.

2. శరీరంలోని కోశలవణాలుచేయు కృత్యాలనుగూర్చి క్లుప్తముగా బోధపరుపుము.

ప్రతిఒక్క కోశ లవణానికి ప్రత్యేక నియమిత నిర్మాణశక్తి కలదు. ఈ లవణాలను యిల్లు నిర్మంచు వడ్రింపనివానితోనో, తాపీపని వానితోనో పోల్చవచ్చును. తగినంత అడుసును, ఇటుకనుయిస్తే తాపీ నిపుణుడు గృహానికి గోడనునిర్మిస్తాడు అల్లే తగినంత కలపనుఇస్తే వడ్రంగి గృహానికి వలయు, కిటికీలు, ద్వారాలు చేస్తాడు.నిర్జీవ కోశ లవణాలు తాపీ, వడ్రిం పనివాళ్లలా శరీర నిర్మాణంలో పనివాళ్ళు. చక్కెర, శ్వేతధాతువు, నీరు శరీరమందలి జీవపదార్థములు యిటుక, సున్నం, కలపలాటివి. తగిన పనివాళ్ళు లేకుంటే పరికరాలు నిరుపయోగమైనట్లు శరీర నిర్మాతలగు కోశ లవణాలు లోపిస్తే పరికరాలు శరీర పోషణకు నిరర్థకమై పెక్కుభయంకర వ్యాధులకు ద్వారము తెరువబడుతుంది. ఈ లా జీవిత రసాయన పరిణామాలు జరుగుతూవుంటాయి.

3. మానవశరీరమందలి వివిధావయవములలోను, మండలాలయందు నేట్రం-మూర్ - లోపముచే ఉద్భవించు లక్షణములను క్లుప్తముగా ఒకటిన్నర పుటలకు మించకుండా వివరింపుము.

ఏస్థితిలోనైనను వివక్షత లేకుండా సంధి, పేలాపనకు, నాలుక తడిగా వుండికూడ ఎండి నట్లుండుటకు, మగత, వనికిపాట్లు, సన్ని

పాతం; దోషగుణాల్లోసంధి, మెదడు పోడారిసంధి, పేలావన. ఈస్థితిలో ప్రధానమగు మందు "నేట్రం – మూర్". విచారం, చికాకు, నిరుత్సాహం, బెంగ, ఊరికే ఏడుపు. ఈ ఏడుపులోని చిత్రమేమిటంటే ఓదారిస్తే ఊరకోడానికి బదులు విచారం, ఏడ్పు ఎక్కువై విపరీతంగా బాధపడుతాడు, రోగి మెదడు పనిచేయదు; సబ్బు. భావిఅంధకారంగా గోచరిస్తుంది. ఒంటరిగానే ఉండి కృళ్ళి కృసిస్తాడు రోగి. సంతోషంలో భాష్పాలు. బండివానిని మోహిస్తుంది "నేట్రమూర్"– యువతి.

శిరస్సు : వడదెబ్బకు ప్రధానమైన మందు. సంధికి నిరుపమానమగు ఔషధం. తలనొప్పి మల బద్ధంతో కూడిఉంటుంది. ఆరిన నాలుకతో కన్నీటితో కూడిన సిరోభారం. నిరుత్సాహం, బెంగ, దిగులు, విచారం. నీటివంటి కఫం వాంతి అవుతుంది. విద్యార్థులు, విద్యార్థినులకు వచ్చు తలనొప్పికి పెట్టింది పేరు. యుక్తవయస్సు గల యువతులకు తలనొప్పి, మగత, కునికిపాట్లు, తల్లో సమ్మెట పోట్లలా ఉండే తలనొప్పి; సిరోభారం, పురెప్పై నీటి బుగ్గల్లా కురుపులు. చుండ్రు తల్లో తెల్లటిపొట్టు. 10 లేక 11 గంటలకు తల నొప్పివచ్చి సూర్యాస్తమయం 3 గంటల దాకా ఉంటుంది. నియమిత వేళల్లో వచ్చే తలనొప్పి. నొప్పి ఎంత హెచ్చుగా ఉంటే చమట్లు అంత హెచ్చుగా పోస్తాయి. నుదుటు చల్లగావుండి చల్లనిచమట్లు పోస్తాయి. విద్యార్థినులకు తలనొప్పి, తలవెంట్రుకలు ఊడుట.

కళ్లు – కన్నీటితో కూడిన కంటి పోట్లు, నొప్పి, రొంప, కన్నీళ్లు, కళ్ల నిస్సత్తువ. కన్నీటితో కూడిన అన్ని కంటివ్యాధులకు యిదిమందు. కనురెప్పల యందు సస్పని మొటిమలు, సూర్యగమన సంబంధమగు కంటి నొప్పులు, రెప్పల దళసరి, ఒరుపుతో కూడిన కన్నీరు. అక్షరాలు

అలుక్కుపోయినట్లుంటాయి. నిప్పునలుసుల్లా కంటిముందు కనుపిస్తాయి. క్రిందకు చూస్తుంటే కండ్లపోటు.

చెవులు : కర్ణనాళిక వాచి వినుపించదు. చెవిలోహోరు, శబ్దాలు. చెవిలో ఉరుముతున్నట్లు, గంటలు వాయిస్తునట్లుధ్వని.

ముక్కు: తుమ్ములు, ముక్కువెంటనీరు; రొంప,పడిశం. గొంతుగనుండి ఉప్పని లాలా జలం. చలిజ్వరం, రొంప, తుమ్ములు, ముక్కువెంట, కళ్ల వెంటనీరు; వాసన తెలియదు. ముక్కువెంట రక్తం; ముక్కుఎండి ముక్కులో పక్కులు.

ముఖం : ముఖం నొప్పి: బిర బిర లాడుతున్నట్లుండి డోక్కుపోతుంది. కనుబొమ్మల వెంట్రుకలు ఊడిపోతాయి. అన్నం తినేటప్పుడు ముఖానికి చమట్లు.ముఖానికి ఆముదం పూసినట్లు జిడ్డుగా మెరుస్తూ ఉంటుంది. జ్వరంపొక్కులు లేక చర్మి.

నోరు : మిక్కుటమగు లాలాజలం, చొంగ; ఈలక్షణం ఏబుగ్మతలోఉన్నా యిది నివారిస్తుంది. నాలుకపూత, నోట నీరూరడం, నాలుక క్రిందిగ్రంధులు వాచడం. నురగలాటి ఆమం తరచు ఉమ్మివేయడం; నాలుకజిల, తిమ్మిరి. మూతికిచుట్టునా, పెదవులపై ననూజ్వరపొక్కులు మంత్రింలా వేస్తాయి. నీటితో ముత్యాల్లా ఉంటాయి. క్రింది పెదవిమధ్యలో పగులు, చీట లోతుగాఉంటుంది. నాలుకపై పొరఊడి బొమ్మలా యేర్పడుతుంది, లేదా మేపు వేసినట్లుంటుంది. (ఆర్స-అల్బు, రూస్టాక్సు. టెరేక్సి) అమితదాహం.

నోటివెంట నీరు ఊరుతూ సండ్లపోటు. నాలుక పక్కలను స్వచ్ఛమగు నీటితోకూడిన పాచి; నాలుకచివర నీటిబుగ్గలు; మొటిమలు; జ్వరాల్లో ముఖ్యంగా లోజ్వరాల్లో నాలుక పొడారిఉంటుంది.

నాలుకపై వెంట్రుక ఉన్నట్లు భావన దానితో చికాకు (సైలీషియా). గొంతుగయొక్క అమత్వచ వాచి దానినుండి నీరూరి బాధ. గొంతుగ నొప్పి; పొడారిపోతుంది, గవజలువాపు; మెడ సన్నగించడం. అమిత లాలాజలంతో కూడిన అన్ని జఠరవ్యాధులలోను నిరుపమానంగా పని చేస్తుంది. నాలుక తడిగా నిగనిగలాడుతూఉంటుంది. నోరు ఉప్పగా ఉండి నీటి వమనాలతో కూడిన అజీర్తి. రోగికి ఉప్పు, ఉప్పని వంట కాలమీద వాంఛ, దానితో విదాహం. అన్నంతిన్నతరువాత శూలతో కూడిన అగ్నిమాంద్యం. నోటివెంట నీరూరడం. నీటివంటి ఉప్పని ఆమ వమనాలు; నోటివెంటనురగ. మగతతో అయే కామెర్లు. ప్రేగులయొక్క అమత్వచ ఆరిపోతుంది. నోటివెంటమాత్రం నీరుకారుతూ ఉంటుంది. యీ లక్షణాలతో మలబద్ధం. అమితంగా దాహం. పెదవులు మొదలు ఆసనంవరకు పొడారుకుపోవడం, అందుచే మలం గట్టిగాపెంటి కల్లా అవుతుంది. నాలుక, ఆసనం పగిలి బీటలుతీస్తాయి.

ఒకప్పుడు నీళ్ళవిరోచనాలు, తరువాత మలబద్ధం; యీవిధంగా ఒకటితగ్గి మరొకటి. మగత, నోటివెంట నీళ్ళుకాను మలబద్ధం. నురగలా నిగనిగలాడే ఆమంతో ఆసనం ఒరుపు, మంటతో విరోచనాలు, మలబద్ధంతో కూడిన మూలశంక. మూ: శంక మొటిమల్లో కుడుతున్నట్లుబాధ, పోటు. మూత్రం : అతిమూత్రం, మూత్రకోశంకు జలుబు; మూత్రం విడిచాక మంట, పోటు. అతిమూత్రంలో విదాహం. రేయింబవలు నీటివంటి మూత్రం హెచ్చుగాపోవడంచేనీర్సం. దగ్గరగా ఎవరైనాఉంటే త్వరగా మూత్రంరాదు. కాలికశగవ్యాధిచే మూత్రవాహినినుండి నీటివంటి నిగారింపుగల జిగటపదార్థం స్రవించుట. జీర్ణించిన సవాయివ్యాధి; అంగంయొక్క ముందుభాగంవాచి నీటిబుగ్గలా ఉండడం, జలబీజంలేక వరిబీజం యీమందుతో తగ్గి

పోతాయి. గట్టిగా విరోచనమయేసమయంలో పాలవంటి ద్రవము చుక్కచుక్కలుగా పురుషాంగమునుండి ప్రోస్టేటిక్ జ్యూను స్రవించు నప్పుడు ఈమందును వాడాలి.

ఒళ్ళు పెట్లడం, బీటలువారడం, అరచేతులలో పులిపిరికాయలు.

క్రిమి కీటకాదులు కుట్టినప్పుడు వెంటనే యీమందు లోనికిస్తూ పైకి మర్దనా చేయాలి. తేలుకాటుకు తరచు నేను దీనినేవాడుతాను.

మసూచికంలో మగత, చొంగ ఉన్నప్పుడు త్వరగా పొక్కులారు తుంది. యీమందుతో తొడకు మర్మేంద్రియానికి మధ్యపుట్టే చిడుము ఒరుపుకు పనిచేస్తుంది. మన్యంజ్వరంలోపుట్టే పొక్కులుకు, నూకల కూడులా నీటిబుగ్గలతో లేచే చిడుముకు బాగా పనిచేస్తుంది. "నేట్ర మూర్"యొక్క ప్రధాన నైసర్గికలక్షణాలు ఆదిలోనే గుర్తించివాడితే యీమందు అన్ని వ్యాధులలోను నిరుపమానంగా పనిచేస్తుంది. నీరు ఏభాగానికిపట్టినా ప్రధానమందగు "నేట్రంసల్ఫ్"తో వాడాలి. ఒకకోశం పొడారిపోయి వేరొకచోట అమితంగా నీరుంటే ఈ మందును వాడాలి తరచుగా.

శుభ్రమైన తిండి తింటూ చిక్కిపోవడం యీమందుకు మరో వింతలక్షణం. గవజలు, మొదటగానే మెడ సన్నబడుతుంది.

నాలుక జిగటగా, చవతో మిలమిలలాడుతూ నీరూరుతూనే ఉంటుంది. కాని నోరు ఎండిపోతూన్నట్లనుపిస్తుంది.

ఈమందుయొక్క ముఖ్యకర్తవ్యం శరీరంలోని అన్ని తావులకు వలయునంతనీరు సమకూర్చడమే.

జ్వరలక్షణాలు:—మగత, వునికిపాట్లు, సీటి వమనాలు, కొంకర్లు, తిమ్మెర్లు, సంధి ఈలాటి దుర్లక్షణాలతో కూడిన ఏజ్వరంలో వాడినా చెప్పినట్లు పనిచేస్తుంది.

తేమప్రదేశంలోను, కొత్తగాకట్టిన యిండ్లలోను వుండేవాళ్లకు, విస్తారం క్వాయినామింగేవాళ్ళకు వచ్చే మన్యజ్వరాలకు ముఖ్యమందగు నేట్రంసల్ఫుతో వాడాలి. ఉదయం 10-30 గంటలకు చలి ప్రారంభించి అపరాహ్ణంవరకూఉండి, తరువాతజ్వరంవచ్చి, తలనొప్పి, దాహం నిస్త్రాణ కలుగజేసే వులివాసనవేయు చమట్లు, నడుంనొప్పి, నీరసం కూడా ఉన్నప్పుడు యీమందు పనిచేస్తుంది. రోగి చాలా సుష్కిస్తాడు. పెదవులకు చుట్టునా మంత్రపుషొక్కులలా వేస్తాయి. యీపరిస్థితిలో "నేట్రమూర్" నిరుపమానమగుమందు.

విపరీతమైవనిద్ర, మగత, సర్వదా నిద్రపోవాలనే వాంఛ, హెచ్చరిక చచ్చి-మందకొడిగా ఉంటాడు. సాధారణమైననిద్రవల్ల బడలికతీరదు. వుదయాన మందకొడి బద్ధకం.

సాధారణంగా వుదయాన్ని లక్షణాలన్నీ ప్రకోపిస్తాయి. సముద్రపుటొడ్డున వుప్పుగాలిలోను, చలిగాలిలోను వుద్రేకం. సాయంకాలం వుపశమనం.

తరచు విషపదార్థాలు వుపయోగించడంచేత అంటే చుట్ట, సిగరెట్లు, నల్లమందు, గంజాయి మొదలైనవి హద్దుమీరి వాడుటచేవచ్చే వ్యాధులకున్నూ, ఒకే నిర్ణీతకాలంలో వచ్చే వ్యాధులకున్నూ ఇది బాగా పనిచేస్తుంది. దీన్ని వుపయోగించవలసినంత విరివిగా వుపయోగించుటలేని హేతువుచే దీనినిగురించి యింతగా వ్రాయవలసివచ్చింది.

## 99. నేట్రంఫాస్ఫారికా [Natrum Phosphoricum]

1. "నేట్రంఫాస్ఫారికం" తగినంతగా శరీరంలో లేకుంటే జీవరసాయన శాస్త్రానుగుణ్యంగా సంభవించే సాధారణ పరిణామాలేమి?

శరీరమందలి ధాతువులు క్షారవు (ఆల్కలీ) ఆమ్లము (ఏసిడ్) లను కలిగివుంటాయి. ఆమ్లమెన్నడూ లోపించదు. అది జీవపదార్థమగుటయే కారణం. శరీరములో "నేట్రింఫాస్" తగినంతగా అగత్యము. ఇది లోపించినచో జీవనాధారమునకు, శరీరపోషణకు అగత్యమగు ఆమ్లమునకు తోడ్పడవలసిన వస్తుసముదాయోత్పత్తి నిలచి పోవును. ఆమ్లాభివృద్ధి ఆగిపోవును. ఆమ్లమును వుపయోగించు పని వాడు "నేట్రంఫాస్" లోపించిందని గుర్తించాలి.

జీవపదార్థములు నిర్మాణాత్మకములుకావు. ఇవి యింటిపనికి యిటుకలలాటివి. తాపీమేస్త్రి వున్నప్పుడుగదా యిటుకల వుపయోగం లేకున్నచో ఇటుకలు అట్లే వుండిపోవును. కావలసినసామగ్రి వున్నచో నిర్జీవకోశలవణములు శరీరనిర్మాణము, పోషణ, రక్షణచేయును. పరికరాలకు కొదువవుండదు. పనివారి కొరతయే. వ్యాధులు పుట్టుటకు కారణము. ఎప్పుడు వ్యాధివచ్చినా కార్మికునిలోపమనే గ్రహించాలి.

జఠర రసమందు ఆమ్లకోశలవణము సరియగు పరిమాణములో లేనప్పుడు తినిన పదార్థము పులిసి పులితేన్పులు మొదలగుఅజీర్తి వ్యాధులుపుట్టి బాధించును. 'నేట్రిం-ఫాస్' యొక్క కొరతను భర్తీ చేసినచో యీవ్యాధులు తగ్గును.

2. "నేట్రింఫాస్" యొక్క లోపమును గుర్తింపదగు ప్రధానలక్షణాలేమి ?

నాలుకయొక్క వెనుకభాగమున బంగారు పశిమివర్ణముగల పాచి దీని లోపమును గుర్తింపనగు ప్రధానలక్షణము (బోయిరిక్ & షెఫిల్).

3. "నేట్రింఫాస్" వల్ల శరీరంలోకలిగే సాధారణమార్పేమి ?

శరీరంలో ఆమ్లాధిక్యత కనుపిస్తుంది. అందుచే పుల్లి త్రేన్పులు, పుల్లని తేమడవాంతులు; అజీర్తి, అగ్నిమాంద్యము; చిక్కిపోవుట. ఆమ్లమును వుపయోగించు పనివాడు. 'నేట్రింఫాస్' లోపముచే శరీర మందలి ఆమ్లము (ఏసిడ్) నిరుపయోగమై పై పరిస్థితు లేర్పడినవి.

4. శరీరమందలి వివిధావయవములలో "నేట్రం ఫోస్ఫారికం"యొక్క లోపమును గుర్తింపనగు లక్షణములను క్లుప్తముగా వ్రాయుము?

సిరస్సు : తలపైన, నుదురులోను బరువు, తలనొప్పి. పుల్లని తేమడ వాంతులు. తల దిమ్ము వుదయము లేచిన వెంటనే తలదిమ్ము, భారము. నుదురుపై గజ్జి, తలబరువు, వెంట్రుక లూడును. భోజనానంతరం, నెలసరి తరువాత, సంభోగానంతరం, వురుములు, మెరుపులు తో కూడిన వర్షపాతమునందు తలనొప్పి – చల్లగాలిలోను, తలనొక్కి పట్టుట చేతను వుపశమించును. వుదయం లేచిన వెంటనే మాడపట్టున నొప్పి; నుదురుపై చమట్లు.

కళ్లు : కళ్ళవాపు, పసుపురంగు పుసులు. కళ్ళు అంటుకొనుట. క్రిములు వుండుటచే కళ్ళఅదురు. కనురెప్పలందు మొటిమలు; మంట కన్నీరు. కళ్ళు నలుపుగోవాలి; వెలుతురు చూడలేరు. దూరపువస్తువులు కంటికి ఆనవు. కండ్లముందు మంచు తెరలా వుంటుంది.

చెవులు: ఒకచెవి ఎరుపెక్కి-మంట, దురద, చెవి వాపు, తేనె వంటి స్రావము; చెవి దురదలు; కుడిచెవిపోటు; చెవిలో హోరు; ధ్వనులు.

ముక్కు : ముక్కు అమితమైన దురద; దీనికి హేతువపొట్టలో క్రిములు పిల్లలు వేళ్లు ముక్కులో పెట్టి గోక్కుంటారు. ముక్కు నుండి దుర్వాసనగల జిగటస్రావము.

ముఖము : ముఖము ఎరుపు, దద్దుర్లు, నుదుట మొటిమలు, కుడిముక్కు పోటు.

నోరు పులుపు, నాలుక వెనుకతట్టున పచ్చనిపూత, పిల్లలు నిద్దర్లో పళ్ళు కొరుకుతారు. కళ్ళ వెంట రక్తం. నాలుకపై వెంట్రు కున్నట్లు భావం. గొంతుగలో వుండవున్నట్లుంటుంది. గొంతుకనొప్పి,

పుల్లత్రేన్పులు; అగ్నిమాంద్యము, అజీర్తి, ప్రేగులలోపుళ్ళు. అన్నం తినినవెనుక కడుపులోపోట్లు, కడుపుబ్బు, తలనొప్పి, గర్భవతులకు పుల్లని తేమడవాంతులు. వేవిళ్లు – వికారం, నోటినుండి పుల్లని నీళ్ళు. పిల్లలకు క్రిమివాతం. పిల్లలు త్రాగినపాలు పులిసి బిళ్ళలు బిళ్ళల్లుగా వాంతులు, పిల్లలకు పుల్లని నీళ్ళవిరోచినాలు, విరోచనం బిగబడుతుంది. పిల్లల ప్రేగుల్లో క్రిములు.

పురుషులకు సంభోగానంతరం విరోచనాలు. పొట్టంతా తీపు, నొప్పి.

మూత్రం ఆగదు. మూత్రం తరచు వుబ్బుకొస్తుంది. పురుషులకు సంభోగానంతరము మలమూత్రములు వుబ్బుకొస్తాయి. విరోచన సమయంలో పురుషాంగంనుండి పాలవంటి ధాతువు చుక్కచుక్కలుగా పోతుంది. ప్రోస్టేటుగ్రంధి పెద్దదౌతుంది. మూత్రంలో శ్వేతధాతువ (ఆల్బుమిన్) పోతుంది.

కలలులేకయే వీర్యస్కలనం; సంభోగ వాంఛ పూర్తిగా నసిస్తుంది. లేదా అమితమైపోతుంది. జననేంద్రియంపై పొక్కులు జననేంద్రియములు వృషణములు, ఆసనము దురద. వృషణములు, అంగము వాపు, స్త్రీలకు అమితమగు సంభోగేచ్ఛ, నెలసరి అనంతరం తేనెవంటి కుసుమ. యోనినుండి పుల్లని వాసనవేయు స్రావము; నీరూ పోతు

వుచే వంధ్యత్వము. నెలసరి సరిగా కాదు. పులుపువాసనగల కుసుమ, నుదురునొప్పి. పుల్లని తెమడవాంతులు.

క్షయలో పుల్లని తెమడకళ్ళి, అందుచే నోరు, నాలుక, పెదవులు ఒరుపు, మంట. గొంతుగ బొంగురు, మాట సరిగారాదు.

గుండెదడ. అజీర్తిచే గుండెజబ్బు, గుండెమంట; గుండెఅదురు. భోజనానంతరం గుండెదడ అదురు.

పగలు భోజనానంతరం నిద్ర. రాత్రి 12 గంటలనుంచి తెల్లవారగట్ల 3 గంటలవరకు నిద్రపట్టదు.

తేనెవంటి పశుపురంగు స్రావంతో కూడిన కురుపులు, గజ్జి. చర్మవ్యాధులు. అరచేతులు పగుళ్ళు, చేతులు ఒరుపు. పిల్లలఒళ్ళు కంది ఎఱ్ఱగా కందగడ్డలా ఉంటారు. ఒళ్ళంతా దోమకాటుల్లా నలిపొక్కులు - దురద.

సాయంకాలం పిల్లలకుజ్వరం, సాయంకాలం తలనొప్పి, మానసిక పరిశ్రమచేతను, సంభోగానంతరం, చలిగాలిలోను, స్నానానంతరం అన్నిలక్షణాలు హెచ్చి అన్నంతింటే తగ్గుతాయి.

## 100. నేట్రం సల్ఫ్యూరికం (Natrum Sulphuricum)

ఇది ద్వాదశ కోశలవణాలలోనిది.

1. "నేట్రం సల్ఫ్యూరికం" యొక్క ప్రధాన కృషిఏమి ? శరీరమందలి ఏభాగంలో ఇది కానవగును.

'నేట్రం సల్ఫ్యూరికా' కోశములయందలి ద్రవములలో కానవగును. రక్తములోను, కోశములలోను, ధాతువులలోను మిక్కుటమగు నీరుండిన దానిని బహిర్గతముచేయుటే దీని ప్రధానకృషి.

2. శరీరమందు "నేట్రం సల్ఫారికం" లోపించిన ఏమి జరుగును?

'నేట్రిం సల్ఫారికం' తగినంతగా శరీరమందు లేకుండిన కోశములందు చేరిననీరు బహిర్గతముకాక శరీరమునకు నీరుపట్టును; ఉబ్బరోగము సంభవించును. ఈలవణలోపమువలన మానవుడు తేమప్రదేశములోను, వర్ష కాలములోను వ్యాధిగ్రస్తుడగును.

వేసవికాలమందు సూర్యతాపముచే జలాశయములందలి నీరు ఆవిరిరూపముజెంది గాలి జలపూరితమగును. దానిని పీల్చుటచే ఊపిరితిత్తులద్వారా రక్తములో నీరుచేరి ఆనీరుపోక మన్యజ్వరములపాలగుదురు. తగినంతగా "నేట్రంసల్ఫ" శరీరమందుండిన రక్తమందుచేరిన నీటినిపోనార్చి ఈవ్యాధిరాకుండ నిరోధించును. జీవరసాయన శాస్త్రానుగుణ్యముగా యీ లవణాణువు ఒకటి రెండు అణువుల నీటిని పోనార్చును.

రక్తములోను, ఇతరధాతువులలోను నీరు చేరుటచే ఉష్ణప్రదేశములందు ఈలవణలోపముచే మన్యజ్వరం, కలరా, చలికుదుపులు మొదలగు పెక్కువ్యాధులు, పసరు హెచ్చుగా పెరిగి అజీర్ణము, విరోచనములు, వాంతులు అగునని జీవరసాయనశాస్త్రము నిరూపించినది.

3. ఈమూడు "నేట్రం" లవణముల ప్రధానకృషిని స్థూలముగా తెల్పుము.

ఈ మూడులవణములకు నీటితో సంబంధముకలదు. 'నేట్రింఫాస్' నీటిని పుట్టించును. పుట్టిననీటిని వేరు వేరు అవయవములకు సరిపడునట్లు 'నేట్రిమూర్' పంపకముచేయును. ఏకారణముచేతనైనను ఎచ్చటైనను మితిమీరిన నీరు నిలువపడిపోయినచో 'నేట్రింసల్ఫ' బైటకు గెంటివేయును.

4. "నేత్రంసల్ఫ్"యొక్క మానసికలక్షణములేమి ?

పసరు విస్తారముగా చేరుటచే కోపము 'చిర్రుబుర్రు' మనడం హెచ్చుతుంది. ఆత్మహత్యకు మనస్సు పురికొల్పుతుంది. ముక్కోపి తనం. నిరుత్సాహం, నిరాశ ఉదయకాలంలోను, తేమగావున్నప్పుడు హెచ్చుతుంది. విరోచనమైనతరువాత హెచ్చరికపుడుతుంది. సంతోషాన్నిచ్చే సంగీతమంటే అసహ్యమేకాకుండా విచారం, మనోవ్యధ. సంఘమంటే భీతి. సిరస్సుకు దెబ్బలుతగులుటచే కలుగు మానసిక దుర్లక్షణాలకు, వున్మాదాలకు పనిచేస్తుంది. సమూహాన్ని చూస్తే భీతి. చిన్నచప్పుడుకుకూడ వులికిపడుతాడు; నిద్రలో ఏదైనా చప్పుడైతే భయమేసి గాబరాతో వులిక్కిపడి ఖంగారుతో త్రుళ్ళిపడి లేస్తాడు.

5. "నేట్రిం సల్ఫూరికం" వాడనగు సిరోలక్షణాలేమి ?

మాడపట్టుమంట, నొప్పి, ధనారింపు, నోరుచేదు. తలనొప్పి, తలత్రిప్పు, మగత, తలనొప్పి, సిరస్సుకు రక్తపోటు. సంధిపేలాపన. మితములేని పైత్యగాభరా. తలకు దెబ్బలుతగిలి పోటు, నొప్పి, బాధ.

6. "నేత్రం సల్ఫూరికం"యొక్క లోపమునుగుర్తింపజేయు ప్రధాన లక్షణములను వ్రాయుము.

తేమచే సంభవించునట్టి లేక ఉద్రేకించునట్టి వ్యాధులన్నిటికీ నిరుపమానమగు మందు. సముద్రప్రాంతములోను, నీటిలో పెరుగు ఆకుకూరలు తినుట చేతను సంభవించే ఋగ్మతలకు పనిచేస్తుంది. గనేరియా జీర్ణించి ఉద్భవించే పెక్కువ్యాధులకు వాడాలి. ప్రతిసంవత్సరం వసంత ఋతువులో పుట్టే చర్మవ్యాధులను నివారిస్తుంది.

విచారం, మనోవ్యధ, కోపం; యివన్నియు ఉదయం ఉద్రేకిస్తాయి. మాట్లాడడానికి, మాట్లాడింప బడడానికి అయిష్టం. నిరు

త్సాహం; ఇంపైనగానంవింటే విచారం. జీవితమంటేరోత. ఆత్మహత్య చేసుకోవాలనేవాంఛ; దీనిని మళ్ళించడానికి భగీరథప్రయత్నంకావాలి.

సిరోఘాతాలచే సంభవించే మనోవ్యథ, మస్తిష్క-ఘాతకాలచే కలిగే కాలికమనోవ్యాధులకు పెట్టిందిపేరు.

బహిష్టుకాలంలో ముక్కు-నుండి రక్తస్రావము. చెవినుండి ఏదో బైటకు తోసుకువస్తూన్నట్లుంటూబాధ, పోటు. ముఖంపచ్చబడి కామెలరోగాన్ని సూచిస్తుంది. ముఖంపై విసర్పి. నాలుకపై ఆకుపచ్చని బూడిదరంగుపొడ. నాలుకపై ఆకుపచ్చరంగుపాచి, నోరు చేదు.

విరోచనములు : ఫ్రుదయం నిద్రనుంచిలేచి నిలబడ్డంతడవుగా విరోచనంవుబ్బుకొస్తుంది,ఆపుకోలేదు. వాయువుతోకూడి ఆకురంగులో పిచికారీతో కొట్టినట్లు అవుతుంది. సాధారణంగా వర్షంలోను, తేమలోను, తేమ ప్రదేశంలోను తిరగడంచేత యీలక్షణాలు పుట్టవచ్చు. చిరకాలంగా ఫ్రుదయంవేళ విరోచినాలవడాన్ని నివారిస్తుంది. మధుమేహానికి ముఖ్యమగుమందు. మూత్రంలో ఎఱ్ఱని యిటుకపొడివంటి రేణువులు వెడలునప్పుడు వుపయోగపడుతుంది. ఒకపాత్రలో మూత్రాన్ని నిలువచేస్తే ఆపాత్రియొక్క అడుగునా, ప్రక్కల ఈరంగు పొడి కనుపిస్తుంది.

ఇది వరిబీజానికి, గాల్‌స్టోన్సుకు ప్రధానౌషధం.

నెలసరి మైల విస్తారం అవుతున్నా, ఋతుసమయంలో వుదయంవేళ అతిసార విరోచనాలు అవుతున్నా యిది మంచిమందు. సీతగాలిచేత, తేమగాలివల్ల పిల్లలకు వుబ్బసవుదగ్గు వస్తుంటేవాడాలి. దగ్గుతుంటే ఛాతీనొప్పి, పచ్చి; దగ్గేసమయంలో రెండుచేతులతోనూ ఛాతీ అదిమి పట్టుకుంటాడు.

వేసవిలో విస్తారం ఖపంతో కూడిన వృబ్బసం.

గుండె ప్రాంతం బరువు, నొక్కుతోన్నట్లు బాధ. మెదడులో నొక్కుతోన్నట్లు నొప్పి, భారం, బరువు. తలవెనక్కు లాక్కుపోతుంది. సిరస్సుకు విస్తారం రక్తం ప్రసరిస్తుంది. సంధి, పేలాపన.

నిద్రలో కాళ్ళు, చేతులు అదురు, కొంకర్లు.

చిరకాలంనుంచి వుంటూన్న, ఆసనగండమాల (ఫిస్టూలా) దీనితో తగ్గుతుంది. దానినుండి నీటివంటి చీము, రసి స్రవిస్తుంది.

వంటిపై పసుపురంగు పొలుసులు, పొట్టు. చేతులపైనా, అరచేతులలోను వార్టును, పులిపిరపకాయలు. అరచేతుల్లో చిడుము,కురుపులు. ఎడమకాలువాపు. ఒళ్లంతానీరు, కాళ్ళు, చేతులు, ముఖం నీరు, వుబ్బు. అన్ని బాపతుల మన్యంజ్వరాలకు ముఖ్యమైన మందు. రాత్రి 6 గంటలు మొదలు 9 గంటలవరకు చలి, కుదుపు. తరువాత 11 గంటలదాకా జ్వరం, ఉష్ణం; చెమటస్థితి వుండదు. పైత్యజ్వరం, విడుపుజ్వరం, మన్యం జ్వరం; వీటికి నిరుపమానమగు దివ్యౌషధం.

సాయంకాలం చదువుతుంటే మగత; భయంకరమగు కలలు; నిద్రలో ఉలికిపాటు, నైటుమేరు.

ఈ మందు లక్షణాలన్నీ ఉదయంవేళ, తేమవల్ల, పసరు ఆకు కూరలు తినడంవల్లా నీటిలో తిరగడంవల్లా ఉద్రేకిస్తాయి. ఎండకాలంలోను, పొడిగాలిలోను ఉపశమిస్తాయి.

7. ఉదయంవేళ విరోచనాలు కలిగించే కొన్ని మందులను వ్రాయుము. వాటిని 'నేట్రం సల్ఫూరికం'తో సరిపోల్చుము.

పోడోఫిల్లం; సల్ఫర్; రుమేక్సు; బ్రై; నేట్రంసల్ఫ;

"బ్రియోనియా"వలెనే ఉదయాన్నే లేచి కదిల్తే విరోచనాలవు తాయి "నేట్రింసల్ఫ్యూకు," తరుణ కాలిక అతిసార విరోచనాలయ్యే వ్యాధిని నివారించడంలో దీనికిసాటివచ్చు మందు లేదనాలి.

"పొడోఫిల్లం;" "సల్ఫర్;" "రుమెక్స్"లా ఇందు విరోచనాలు ఎక్కువగా ఉదయాన్నే అవుతాయి. కుడిడొక్కకింది ప్రేవులలో ఆపులు, "గుయి–గుయి" లు. విస్తారంగా గాలి ప్రేగులలో చేరుటచేత శబ్దాలు అవుతాయి. విరోచన సమయంలో పెద్దచప్పుడుతో గాలి వెలువడుతుంది. (చైనా, కేలి–ఫాస్, ఎగరికస్)

8. 'నేట్రంసల్ఫ్యూ'లో ప్రత్యేక సైకోటిక్ లక్షణమేమి?

గోళ్లచుట్టునా వాపు, పుళ్లు, రసికారడం. చేతులమీద అర చేతులలోను "వార్ట్సు" అనే పులిపిరప కాయలు నుకుడికాయలు మొలుస్తాయి.

కాలికమగు ఉబ్బసం.

9. 'నేట్రంసల్ఫ్యూ'కు సంబంధించిన కాలేయ లక్షణాలేమి?

"లీవరు" ఉండు ప్రాంతంలో అనగా కుడిడొక్కలో నొప్పి; కోయుచున్నట్లుండి పోట్లు. కాలేయం ఉబుకుతుంది. రోగిఎడమవైపు తిరిగి పరుండలేడు. తేమగాలితగిలితే బాధలన్నీ హెచ్చుతాయి. కామెర్ల వ్యాధి పసరువాంతులు, వమనాలు; పసరు పెరిగి నొప్పి, నోరుచేదు. నాలుక బూడిదరంగు పాచితోకూడి ఉంటుంది.

## 101. నైట్రిక్ యాసిడ్ (Nitric–acid)

(ఏంటిసోరిక్ – ఏంటిసైకోటిక్ – ఏంటిసిఫ్లిటిక్)

1. నైట్రిక్ యాసిడ్‌కు మానసిక లక్షణములేమి?

అన్ని విషయాల్లోనూ నిర్లక్ష్యమే. జీవితమంటేరోత. ఏదన్నా రోత. తన ఆరోగ్యాన్ని గురించిన ఆందోళన. చస్తానని భయం. నిద్ర లేమిచేకలిగే ఆందోళన. కోపమొస్తే శరీరం కంపించిపోతుంది. రోగం కుదరదని నిరాశ. కోపం, పెంకితనం. ఎంతవేడుకున్నా మనస్సు మారదు.

2. నైట్రిక్ యాసిడ్ పనిచేయు ప్రధానస్థావరమేది ?

అమత్వచమీద, అమత్వచయున్నూ చర్మమున్నూ కలసే చోట, ఆలాకలసే మూలలమీద దీనిపని మెండు. పోటు, మంటలలోను, టిస్యూలనుతినే సేపుళ్ళలోను, ఎముకలకు గ్రంధులకు సంబంధించిన వ్యాధులలోను కూడ యీమందు పనిచేస్తుంది.

3. నైట్రిక్‌యాసిడ్‌ను అమోఘంగా సూచించే అయిదు సహజలక్షణాలను వ్రాయుము

దుర్వాసనవేయుచు ఒరుపుకలిగించు పశుపురంగు స్రావములు, గుర్రంమూత్రంవలె వాసనవేయు మూత్రం.

మెరుపులులాగ, కొరివిమంటలలాగ వచ్చిపోయే బాధలు.

మలబద్ధకంతంటె అతిసారంబాధ అమితం.

అమత్వచలు, చర్మంకలసే ఇసుకస్థలాల్లోపుండ్లు.

నవరంధ్రాలనుండి ఎర్రని కాంతివంతమగు రక్తస్రావము.

4. మూత్రం దుర్వాసనగల మూడు మందులేవి ? వాటిని పోల్చుము

(1) బెంజానిక్‌యాసిడ్. (2) నైట్రిక్‌యాసిడ్. (3) సేపియా.

"బెంజానిక్‌యాసిడ్" మూత్రం ముక్కుపగిలిపోయే దుర్వాసనతో యెక్కువరంగుగా వుంటుంది. రోగివున్నగదిలో కాలుపెట్టే

సరికి 'బెంజానిక్ యాసిడ్' మూత్రంవాసనే వైద్యునికిదారికే ప్రథమ లక్షణం.

"నైట్రిక్ యాసిడ్" మూత్రము ముదురురంగులోవుండిగుర్రం మూత్రంవాసనవేస్తుంది.

"సెపియా"కు భరించరాని వాసన, పులుసువాసనలావేస్తుంది. మూత్రం కంపు.

5. జిగటవిరోచనములలో, 'మెర్కు, నక్సు"నుండి నైట్రిక్ యాసిడ్ ను వేరుచేయు లక్షణములేవి ?

"నైట్రిక్ యాసిడ్ రోగివిరోచనం పలచగాఅయినా విరోచనానంతరం ఆసనమందలి భరించరాని బాధతో గంట లేక రెండుగంటల పాటు యిటు అటు కలియత్రొక్కుతాడు, విశ్రాంతి వుండదు.

"నక్సు"కు విరోచనమయాక బాధ తగ్గుతుంది.

"మెర్కు"లో విరోచనానంతరం, ముందు అయేటప్పుడుకూడ ఆసనంలో విస్తారం తీపుగావుంటుంది.

6. నైట్రిక్ యాసిడ్యొక్క నాసికాసంబంధమగు లక్షణాలేవి ?

ముక్కునుండి ఒరుపుతోకూడిన దుర్వాసనవేయు స్రావం, ముక్కువెంట రక్తం, ముక్కువాసన, ముక్కులో గట్టిపక్కులుకట్టి ఊడదీస్తే పుళ్ళుపడుతాయి.

ముక్కువెంట సవాయిఊట భరించరాని వాసనతోస్రవిస్తుంది.

7. నైట్రిక్ యాసిడ్లో కంఠసంబంధమగు లక్షణములేమి ?

గొంతులో కొయ్యకొట్టినట్లు, చాపముల్లు ఇరుక్కున్నట్లు బాధ. గొంతుగనుండి భరించరాని వాసన. ఈవాసనతోకూడినట్టిదే స్రావం. గొంతులోపుండ్లు.

8. నైట్రిక్ యాసిడ్ సంబంధమగు పుండ్లెట్లుండును ?

పుండ్లులోతుగా. వంకర టింకర అంచులతో, మధ్యన తెట్టువలె వుండి తాకితే రక్తంకారుతూ వుంటాయి. పుల్లలతో పొడుస్తున్నట్లు పోట్లు, అగిడిమంటలు. భరించరానిదుర్వాసన. ఆకుపచ్చనిరసి. చన్నీళ్లు తగిల్తే ప్రకోపిస్తాయి.

9. నైట్రిక్ యాసిడ్‌లో అతిసార విరోచనముల స్వభావమేమి ?

చాలసేపు బిగబట్టి శ్రమిస్తే నేగాని మల విసర్జనకాదు; అయినా కొద్దిగానే అవుతుంది. ఎంతసేపుకూర్చుని ప్రయత్నించినా పూర్తిగా కాదనే భావం. విరోచనం ఆకుపచ్చగా, బురదలాదుర్వాసన వేస్తూవుంటుంది. ఆసనకండరమో లేక ఆసనమో చీలుకుపోయినట్లు విరోచన మయాక గంటా లేక రెండు గంటలు బాధ, మంట.

10. నైట్రిక్ యాసిడ్ రోగియొక్క యిష్టాయిష్టములేమి ?

కొవ్వుపదార్థములు, ఘాటువస్తువులు, సుద్ద, బియ్యం, కచిక, మన్ను, బియ్యంలోబెడ్డలు అంటే యిష్టం. సాధారణంగా దాహం వుండదు.

11. నైట్రిక్ యాసిడ్‌చే కాలేయం ఎట్లు చెడుతుంది ?

కాలికంగా కాలేయం ప్రకృతివిరుద్ధంగా పెరిగిపోతుంది. విరోచనం తెలుపు; కామెర్ల వ్యాధి, కాలేయంలో పోట్లు.

12. నైట్రిక్ యాసిడ్ మూత్రదోషములేమి ?

మూత్రం గుర్రంమూత్రంలా దుర్వాసన. మంట, తీపు. మూత్రవిసర్జనసమయంలో మూత్రవాహినిలో పుల్లలుగుచ్చుకుంటున్నట్లు చురుకు, కోశబాధ. మూత్రం చల్లగా వెళ్ళుచున్నట్లుంటుంది,

13. సవాయివ్యాధిలో నైట్రిక్ యాసిడ్‌ను సూచించు లక్షణాలేమి ?

సవాయియొక్క ద్వితీయావస్థలో లోతైన పేంకర్లుకు, చర్మం ఒరుపు, పుర్రెపోటు, చలిగాలివలన ప్రకోపము, గొంతులోపుండ్లు, పసుపు, బూడిద మిశ్రమమైనరంగుగల శరీరంపై మచ్చలు. అంగం యొక్క ముందుభాగం తినేసేపుండ్లు, స్త్రీల భగంపై వెంట్రుకలురాలి పోవడం యీమందుయొక్క సూచనలు.

14. చర్మం, కోశాలు; వీటిపై నైట్రిక్ యాసిడ్ ప్రభావమేమి ?

భుజముల పైభాగం, పిక్కలు ఎండిపోతాయి. పిప్పిగోళ్ళు. కాళ్లుచేతులు తిమ్మిర్లు, చేతులపైన, భుజాలపైన రాగిరంగుగల మచ్చలు. చేతులపైన వేళ్ళపైన చలిపొక్కులు, బీటలు. చేతుల వెనుకభాగంలో పులిపిరికాయలు. వేళ్ళసందున చిడుము. బొటన వేలిచివర నీటిబుగ్గలు, పుండ్లు, గోరుచుట్లు. ముంగాలిమీదసవాయి కణుపులు. ఇవి రాత్రిళ్ళు ఆటు, పోటు. శరీరమంతా రాగిరంగు మచ్చలు (ఫేరింగ్టన్).

15. సన్నిపాతజ్వరంలో నైట్రిక్ యాసిడ్‌ను సూచించులక్షణాలేమి?

ప్రేగులనుండి రక్తస్రావం. ఆకుపచ్చరంగుతో మెరుస్తూఉండే విరోచనం. విరోచనం కుళ్ళువాసన. కదిలితే నిస్సత్తువవచ్చి శోష రావడం. నాడి ఆగి ఆగి కొట్టడం. ఊపిరితిత్తులలో కఫంచేరి అటు యిటుపోక, తెగి పడక "గుఱు, గుఱు" మనేధ్వని. ఈబాధలు యీ మందును సూచించును.

16. క్షయవ్యాధిలో నైట్రిక్ యాసిడ్‌ను సూచించు లక్షణాలేమి ?

సాయంకాలం జ్వరం. ఛాతీని తాకితే పచ్చిపుండులానొప్పి. ఉదయం గొంతు బొంగురోతుంది. ప్రాతఃకాలం ఉద్రుక్తంగా క్షయ

వ్యాధి సంబంధమగు అతిసార విరోచనాలు. ఛాతీగుండా కుడిభుజం లోకి కుదుతూవున్నట్లు వాడైనపోట్లు. అరిచేతుల్లోను, అరికాళ్ళలోను రాత్రిళ్లు చమట్లు. కాళ్ళు—చేతులవెంట వేడి ఎగతంతుంది.

తెల్లవార్లూ నుసదగ్గు. ఆకుపచ్చని బురదవంటి దుర్వాసన వేయు కళ్ళె. నైట్రిక్ యాసిడ్ రోగి నల్లని తలవెంట్రుకలతో బక్క-పల్చగా వుంటాడు.

# 102. నక్సువోశ్చాటా (Nux-Moschata)

1. నక్సుమోశ్చాటా విస్తారముగా ఏ అవయవమును చెడగొట్టునో సవిస్తరముగా వ్రాయుము.

మనస్సు. జ్ఞానేంద్రియములు మిక్కుటముగా చెడునవి.

'మగత, అయోమయంగావుండి ఏం జరుగుతోందో తెలియదు. స్పృహలేని మగత, నిద్ర' ఇవి దీని నైసర్గిక స్వభావాలు.

నీరసం, పరధ్యాహ్నం, మరపు. చంచలమనస్సు, అమితవిచారం అంతలోనే పట్టరాని సంతోషం. ఈక్షణంలో నిస్పృహ, విచారం, మరుక్షణంలో పట్టరాని ఆనందం.

పరధ్యాహ్నం, ఆలోచనాశక్తి పోతుంది. మామూలు ప్రశ్నకు జవాబు చెప్పడానికికూడా ఎంతో స్పృహకు తెచ్చుకోవాలి.

మనస్సు పనిచెయ్యదు, యంత్రంలా పనులు సాగిపోతాయి. కళ్ళు మూసుగు పడుకుంటుంది. కాని పరిసరాల్లో జ:గేవన్నీ తెలుస్తూనేఉంటాయి. కాని చెప్పడానికి జ్ఞాపకముండదు. బహువ్రి యాసమీాదగాని కళ్ళువిప్పి మెళుకువగా ఉండలేదు. అయినవేళ, కాని

వేళా అనకుండా సర్వదానిదే). రెప్పలుబరువు, మెళుకువగాఉండ లేదు. అమితమైన గుర్రు. ఒకప్పుడు కోమా. నిలబడి దుస్తులువేసు కునేసమయంలో స్పృహతప్పి పడిపోతుంది.

2. మగతకలిగించే నాలుగు మందులనుచెప్పి వాటిని పోల్చుము.

(1) ఓపియం. (2) ఏంటిమోనియంటార్ట. (3) నక్సుమో చట్టా. (4) ఏపిస్ మెల్.

"ఓపీయం" "నక్సుమోచట్టా''లు సన్నిపాతంలోని మగతను తగ్గిస్తాయి. పిల్లల జఠరవ్యాధులలో యీనాలుగూ ఉపకరిస్తాయి.

3. నక్సు మోచట్టాలోని ప్రధాన సాధారణ నైసర్గికలక్షణాలేమి ?

మగత, ఏమియు తెలియకుండుట, ఒళ్ళు తెలియనినిద్ర. నాలుక, పెదవులు, నోరు, గొంతుగ పొడిఆరిపోవడం, ఏమాత్రంకూడ దాహ ముండకపోవడం. నోరు పెడార్చుకుపోయి నాలుక నోట్లోని పై భాగా నికి అంటుకుపోతుంది. ఎంతైనాసరే కాస్తకూడా దాహం ఉండదు.

భోజనానంతరం కడుపుఉబ్బు, భోజనమైనతక్షణం కడుపులో నొప్పులు. చెయ్యి కడక్కుండానే పోట్లు, బరువు (ఖాలీ-బై)

పిల్లలకువచ్చే కలరావిరోచనాలకు పనిచేస్తుంది. ఉబ్బుకొస్తుంది. విరోచనం జారుడుగా అవుతుంది. జారుడుగానే అవుతుంది దానికి కూడ చాలశ్రమపడాలి. పసుపురంగు నీళ్ళవిరోచనాలు. కడుపులో ధ్వనులు, కడుపు ఉబ్బు.

ముక్కు, గర్భాశయం, ప్రేగులు — వీటినుండి రక్తస్రావం. రక్తం వమనంకూడ అవుతుంది.

తేమతోకూడిన చలిగాలి లక్షణాలను ప్రకోపింపచేస్తుంది. కాళ్లు, చేతులు తిమ్మిర్లు, జల, నిస్సత్తువ, పక్షవాతంరాదు గదాఅను పిస్తుంది!

దేనిమీద పరున్నా ఒళ్ళునొప్పులే. సర్వదా పడుకోవడంవలన తుంట్లపై పుండ్లు.

తడి లేక తేమలో తిరగడంచే కీళ్ళనొప్పులు. బండిలో పోతుం టేనడుంనొప్పి. నిస్త్రాణ, ఏమాత్రం పనిచేసినా కాస్సేపు పడుకో వాలి. నోరెండిపోవడమేగాని దాహముండదు. చమటపట్టక శరీరం బిర బిర లాడుతూఉంటుంది.

4. వ్రాస్తున్నా, చదువుచున్నా, మాట్లాడుతున్నా విషయాలు జ్ఞప్తికి రాని లక్షణంగల నాలుగు మందులను వ్రాయుము.

(1) కేంఫర్ (2) కేనబిస్ఇండికా (3) లెకసిస్ (4) నక్సమోశ్చాటా.

5. చెప్పతగినంతగా జ్ఞాపకశక్తి క్షీణించే మందులేవి ?

ఎనకార్డియం, లైకోపోడియం, బ్రయోనియా, సల్ఫర్, నేట్రంమూర్, నక్సమోశ్చాటా.

6. తరచు మనోచాంచల్యంకలుగజేసే మందులేవి ?

ఎకొనైట్, ఇగ్నీషియా, క్రోకస్. ప్లాటినా, నక్సమోశ్చాటా

7. పరధ్యాహ్నంగల మందులేవి ?

ఎనాకార్డియం, క్రియోసోట్, లెకసిస్, నేట్రంమూర్, మెర్క్యూరియస్, నక్సమోశ్చాటా.

8. స్త్రీలకు నక్సుమోశ్చాటా కలుగజేసే ఋగ్మతలేవి ?

ఋతుస్రావం 10 నుండి 15 రోజులవరకూ కూడ ఉంటుంది. మైల రక్తంవేర్వేరుగాని కుదవ కుదపల్లా పడుతుంది. తరచు చాలకాలం పాటు బహిష్టుఉంటుంది. చలిగాలి సోకడంచే భరించలేనిఋతుశూల. రక్తమాంసాలు క్షీణించి బక్కచిక్కినవాళ్ళకు వాడాలియీామందు. స్థనాలు (స్త్రీలలో) ఎండిపోతాయి. స్థనాలు ఎండిపోయినవారికి యీా మందిస్తే తిరిగి యథాతథంగా ఎదుగుతాయి (కెంటు).

గర్భవతులకు అతిసారం; గర్భవతులకు దగ్గు, వేవిళ్ళకు, వికారానికి పనిచేస్తుంది. నెలసరి ఋతువుకుబదులు కుసుమ. యోనినుండి గాలి పోతుంది (లైకోపోడియం).

## 103. నక్స్ వామికా (Nux - Vomica)

1. నక్స్ - వామికా రోగిని వర్ణింపుము.

బక్కపల్చగానున్నవారికి యెక్కువగా పనిచేస్తుంది. ఎక్కువ వెలుతురునుగాని, గొడవ-శబ్దమునుగాని, అమితముగావేయు వాసననుగాని ఎంతమాత్రము సహించలేరు. పచ్చనిముఖం, పచ్చనిశరీరంపై ఎఱ్ఱని చెక్కిళ్లు. అమితమగు విద్యావ్యాపకంచే రాత్రులు సరియగు నిద్ర, పగటిపూట శరీరానికి వలయునంత వ్యాయామం లేకపోవటంచే విద్యార్థులకు, వకీళ్ళకు సంభవించే పెక్కువ్యాధులకిది విసిష్టమగుమందు. ఇట్టివారికి వుదయం లేచేసరికి తలనొప్పి, బద్ధకం, కండ్లుమంట, నీరసంగాఉంటారు. "నక్సావమికా" రోగికి రాత్రి చాల పొద్దుపోయేదాకాకాని నిద్రపట్టదు. ఆలోచనా సముద్రంలో మునిగి పోతాడు. రెండుమూడుఘామలరాత్రివరకు యీాలాగేవుండి తరువాత నిద్ర

పడుతుంది. కాని మరల 4 గంటలకే మెళుకువ వస్తుంది. అట్లాబద్ధకంగా పడుకునేవుంటాడు. చాల ప్రొద్దెక్కితేనేగాని లేవడు. నిద్ర చాలక పుదయం లేచేసరికి బద్ధకం, తలనొప్పి, నీరసం. మితిమీరి పని చేయడంవల్లకూడ శరీరపాటవం తగ్గుతుంది. నోరుచేదు, అరుచి. నాలుక విస్తారం పాచికట్టివుంటుంది. తలబరువు ఈలాటి రోగులకిది అమృతతుల్యంగా పనిచేసి మెదడు చెడకుండా కాపాడిరక్షిస్తుంది. దీనినివాడినాక ఫోస్ఫరస్, పిక్రిక్ ఏసిడ్, సల్ఫర్ వాడాలి.

2. నక్స్ వామికా రోగియొక్క ప్రధాన సహజగుణములేవి ?

ఉడుకుమోతుతనం, విసుగు, కోపంకల బక్కపల్చని నరాల దుర్బలత్వంచే బాధపడేవారికి బాగా వుపయోగిస్తుంది. రెట్టించుక రెట్టించుక కోపం తెచ్చుకొని నిర్హేతుకంగా పోట్లాడ్డం, కేకలెయ్యడం యీరోగికి స్వభావం. క్రోధం, ఈర్ష్య, విచారం ఈలక్షణాలన్నీ నరాల దౌర్బల్యంతో కూడివుంటాయి. ఒక్కమాటలో చెప్పాలంటే నక్స్వామికారోగి "అగ్గిరాముడు".

సహనశక్తి మచ్చుకుకూడా దొరకదు. ముక్కోపితనం, పెంకితనం. తరచు కోపం, దగా, క్రోధం - యివన్నియుకల మానసిక తత్వాలమీాద యీమందుపని అద్వితీయమని హానీమాన్‌గారన్నారు. ఆరాటం, ఆతృత, మనోవ్యధ, తరచు "చిర్రు-బుర్రు" లాడ్డం, జీవితం మీాద రోతపుట్టి ఆత్మహత్యచేసుకోవాలనే కోర్కె, కాని చావంటే భయం. ఈలాటివారికీమందు దివ్యౌషధం. దిగులు, బెంగ, విజ్ఞాన పరిశ్రమలోను, విద్యావ్యాపకంలోనూ మునిగి తేల్తూ ఎప్పుడూకాలు బైటపెట్టక, శరీరపరిశ్రమ కాస్తకూడాలేక గుడిపాములా నాలుగు గోడలమధ్యవుండేవారికి తిన్నఅన్నం అరక్క మలబద్ధకం, అజీర్తి వ్యాధులుతో బాధపడేవారికి ఇది శ్లాఘనీయమగు ఔషధం.

స్వభావం అతిసున్నితం. ఏమాత్రం ధ్వనినీకూడా భరించ లేడు. వెర్రివాసనలు దరికిరాకూడదు. వెలుతురు పనికిరాదు. సంగీతం గిట్టదు. ప్రతిమాటకు నొచ్చుకుంటాడు, కోపంకూడా వస్తుంది.

కాఫీ, చుట్ట, బీడి, సిగరెట్లు, మద్యపానం మొదలగు దురలవాట్లు మితిమీరుటచే కలిగే దుర్గుణాలకిది బాగా పనిచేస్తుంది.

తాకితే వులిక్కిపడ్డం, కొంకర్లురావడం, అదుర్లు.

చలి: జ్వరం ఎంతతీవ్రంగావున్నా చలేస్తుంది, కప్పుకున్న బట్ట ఏమాత్రం తొలగినా "గజగజ" వణికిపోతాడు. విపరీతమగు చలి, జ్వరం. ముఖం ఎర్రగా కందగడ్డలా వుంటుంది.

తరచు విరోచనానుమానం, విరోచనంమాత్రంకాదు. అయితే కాస్తో కూస్తో అవుతుంది. ఎంతకొద్దిగాఅయినా తృప్తిగామాత్రముంటుంది. కాని మళ్లీ మళ్లీ వెళ్లాలని వుంటుంది. విరోచనమైతే కులాసాగా వుంటాడు.

'నరాల దుర్బలత్వం, అతిసుకుమారం, చలి' యీమూడు ముక్కలు"నక్సామికా''సాధారణ లక్షణాలని స్థూలంగా చెప్పొచ్చు.

సాయంకాలం పడుకునేవేళకు ముందు కునికిపాట్లు. కాని నిద్ర పట్టదు. ఆలశ్యంగా నిద్రపట్టి తెల్లవారుఝామున 4 లేక 5 గంటలకు మెళుకువ వస్తుంది. మరల పడుకుని పొద్దెక్కి బద్ధకంతో లేవడం యీమందుయొక్క నిద్రసంబంధమగు లక్షణం.

అన్నంతిన్నాక గంట లేక రెండుగంటలకు తర్వాత పొట్టలో రాతితో నొక్కుచున్నట్లు బాధ.

ఋతువు త్వరగా అవడం, విస్తారంగా అవడం, చాలకాలం వరకు అనగా తిరిగి నెలసరిదాకా అవడం దీనికి నైజం.

కోపం, ప్రద్వేషం, కొంకర్లకు కారణం.

ఎడమతట్టుగిలక (హెక్సియా)

ఈమందు రాత్రిపరుండేటప్పుడు వేసుకుంటే బాగాపనిచేస్తుంది.

3. దిగులు, బెంగ, విచారం-మానసికలక్షణాలుగల మూడుమందులేవి?

ఆరం-మెట్; నేట్రం-మూర్; నక్సువామికా.

4. మలబద్ధంలో "నక్సు" "బ్రయోనియా"లకు గల తారతమ్యము లేమి?

నరాల దుర్బలత్వంవలన ప్రేగులలోని చలనశక్తి కుంటుపడి ప్రేగుల కదలికసరిగాలేక ప్రేగులలోని మలంయావత్తూ ఒక్కసారిగా ఆసనంలోనికి చేరక చేరిన కొద్దిపాటిమలమును ఎప్పటికప్పుడు విసర్జన చేయవలెననెడి అనుమానం కలుగుతూఉంటుంది "నక్సామికా"లో, ప్రేగుల చలనశక్తి పాటవలోపమే "నక్సు"లో మలబద్ధకహేతువ.

ప్రేగులలో తేమ లేక పొడారిపోవుటచే మలము జారక "బ్రయోనియా"లో మలబద్ధకం వస్తుంది. ఈరోగికి విరోచనానుమానమే ఉండదు. విరోచనంఅయితే పెంటికల్లా ఎండి అవుతుంది.

5. జిగట విరోచనాల్లో 'నక్సు' ప్రయోగ లక్షణాలను "మెర్క్యు"తో పోల్చివ్రాయుము.

ఆమం, చీము, జిగురు తరచు రక్తంతోకలసి కొద్ది కొద్దిగా అసంతృప్తిగా అవుతుంది "నక్సు" లో; విరోచనం అయినప్పుడల్లా కొంతసేపటిదాకా బాధలన్నీ తగ్గుతాయి (వెల్సు).

"మెర్క్యూరీ" లో విరోచన మయూకకూడా ఆసనంమంట, తీపు, ఎంతసేపు కూర్చున్నా లేవాలని ఉండదు. ఆసనంతీపు బాధ. విస్తారం రక్తంపోతుంది విరోచనంలో.

6. నక్స్ వామికారోగి ఎప్పుడు ఎక్కువగా బాధ పడుతాడు ?

ఉదయకాలం వీనివ్యాధికి ఉద్రేకసమయం. ఉదయం లేచాకా (లెకసిస్, నేట్రిమూర్) మానసిక పరిశ్రమచేశాకా (నేట్రంకార్బ) భోజనం అయాకా, చల్లగాలిలో ఉన్నప్పుడు "నక్సువామికా" బాధలు హెచ్చుతాయి.

7. నక్సుయొక్క జ్వర స్వరూపమును చిత్రించుము.

ఒళ్లు తెలియని జ్వరం; శరీరమంతా కాలిపోయే వేడి. ముఖ్యంగా ముఖంఎఱ్ఱగా నిప్పులాఉండి సల సల కాగుతూ ఉంటుంది. అయినప్పటికీ కప్పుకున్న దుప్పటితీసేస్తే చలి వణికించేస్తుంది. ఈలా ఉన్నప్పుడు జ్వరంపేరుతో నిమిత్తంలేకుండా "నక్సు" యిస్తే రోగికి స్వస్థత చిక్కుతుంది, జఠర జ్వరమైనా. విడుపు జ్వరమైనా, వాపుతో కూడిన జ్వరమైనా, కీళ్లజ్వరమైనా, రొంపజ్వరమైనా—ఏజ్వరమైనాసరే పైలక్షణాలుంటే 'నక్సు' యిస్తే గంటలో జవాబిస్తుంది.

8. నక్సు వామికా కలిగించే జఠరలక్షణాలేమి ?

అన్నంతిన్నాకా నోరుపులుపు, అన్నంతిన్నాక ఒకటి లేక రెండు గంటలకు పొట్టలో బరువు, బాధ. అన్నం అరుగుదలకొచ్చేవేళ పొట్టలోబరువు, చికాకు, కోపం, గాబరా, పులిఆమంత్రేన్పులు, నాభిదగ్గిర బట్ట సళ్ళించాలి; కంగారు, గాబరా, భోజనానంతరం రెండుగంటలదాకా ఏ ఆలోచన చేయలేడు; ఏపని సాగదు పై పొట్ట ఉబ్బుతుంది. ఉదరంలో రాతితో నొక్కుచున్నట్లుబాధ.

9. భోజనానంతరం ఒకటి లేక రెండు గంటలతర్వాత నొప్పికలిగించే మందులేవి ?

నక్సు వామికా, ఎనకార్డియం, క్రిసోట్.

10. ఎట్టి ఉదరవ్యాధులకు నక్సు వామికా పనిచేయును?

కాఫీ, మద్యపానం, వ్యభిచారం, అమితంగా ఓషధులసేవ చేయడం జరిగించుటచేతను, వ్యాపారసంబంధమగు భయాందోళనల వలనను, అస్థిమితంవల్లను, రాత్రిళ్ళు విస్తారం నిద్రమేల్కొనిఉండుట చేతను, అమితంగా భోగద్రవ్యాలు వాడ్డంచేతనూ కలిగే అన్ని ఉదర సంబంధమగు వ్యాధులకు ఔషధరాజము.

11. నక్సు వామికాయొక్క తలనొప్పి స్వభావమేమి ?

కాలేయం చెడుటచేతను, జఠరవ్యాధులచేతను, మూలశంక చేతను. విపరీతంగా గ్రంధపఠనం చేయుటచేతను, రాత్రులందు మేల్కొని ఉండడంచేతను తలనొప్పివచ్చి ఆనొప్పి చల్లగాలివలనా, తుఫానుముసురువల్లను ప్రకోపిస్తుంది. తలనొప్పి ఫలానాచోట ఉందని రోగి చెప్పలేడు. తలంతా నొప్పితో బ్రద్దలై పోతూఉంటుంది. సిర స్సున, మాడపట్టుపైన పెద్దబండఉండి అణుస్తూన్నట్లుంటుంది (కెంటు).

12. నక్సు వామికా కలుగచేసే నడుమునొప్పి నైజము ఎట్టిది?

పడుకున్నప్పుడు నడుమునొప్పి; ఒకవైపునుండి మరొకవైపుకు వత్తిగిలాలంటే పక్కనుండిలేచి తిరిగికోరినవైపుకు పరుండాలి. నడుము కదిపినా మెదిపినా ఖరేఋమండ మే దీనికి కారణం. కూర్చున్నా నిల బడ్డా నొప్పి హెచ్చుతుంది. బాధ సాధారణంగా నడుం (లంబార్ రీజియన్) దగ్గర వుంటుంది. ముష్టిమైధునంచే కలుగు నడుం బలహీన తకు, నడుంపట్టు తప్పడానికి, నడుంనొప్పికి పనిచేస్తుంది.

13. నడుంనొప్పిగల మందులను ఉదహరించి, ఆనొప్పికలిగే పరిస్థితు లను వివరింపుము.

నిలబడి వుండడంచే 'సల్ఫర్'

కూరోచ్ఛేదంచే 'రూజ్‌టాక్సు', 'కొంబాల్టు', 'పల్సు', 'జింకం'.

మూలశంకచే 'ఏస్క్యులస్' లోను.

పండుకొనునప్పుడు 'స్టెఫిసగ్రియా' లోను.

ముష్టిమైధనంవల్ల 'కొంబాల్టు', 'స్టెఫిసగ్రియా', 'నక్సు-వాం' లోను నడుమునొప్పి కలుగుతుంది.

14 భోజనం చేయడంతడువుగా పొట్టలో నొప్పినికలుగజేసే మందులను పేర్కొనుము.

'లైకోపోడియం', 'ఎబియస్ నిగ్', 'నక్సు మోశ్చాటా', 'కాలీబైక్'.

15. మూలవ్యాధి (పైల్సు)లో నక్సు వామికా లక్షణాలేమి ?

పైల్సు దురద; యీకారణంచే రాత్రిళ్ళు నిద్రపోడు; రక్తస్రావము; తరచు విరోచనానుమానం; అసంతృప్తితో కూడిన విరోచనానుమానం.

16. స్త్రీలకుకలుగు ఏ వ్యాధులకు నక్సు వామికా ఉపయోగపడును.

నెలకాకుండానే బహిష్టుఅవడం. 10 లేక 15 రోజులదాకా ఎక్కువగా ఋతువు అవుతూనేవుండడం. మైలరక్తం పేరుకొని కుదప కుదపలలా అవడం. క్రమంతప్పిన నెలసరి.

బిడ్డనొప్పులు సరిగారావు; నొప్పులు ఆసనంవెంపుకుపోయి తరచు విరోచనానుమానం; తరచు మూత్రవిసర్జన. ఈలాటి లక్షణాలున్నప్పుడు "నక్సు వామికా" 200 పొటెన్సీలో ఒకమోతాదు యిస్తే సరియగునొప్పులువచ్చి సుఖప్రసవం జరుగుతుంది.

17. "నక్సు వామికా"లో గమనించవలసిన జాగ్రత్తలేమి ?

అన్నహితవుడు లేనప్పుడు సాధారణంగా "నక్సు వామికా" యిస్తారు. నిస్సందేహంగా ఆకలిపుడుతుంది. కాని రోగికి అపాయస్థితి వస్తుంది (కెంటు).

మానసిక, కాయిక విశ్రాంతి సమయమగు రాత్రిళ్ళు దీనిని వాడాలి (నేష్).

## 104. ఓపియం (Opium)

1. ఓపియంయొక్క ప్రధాన నైసర్గిక లక్షణములేమి ?

నొప్పులు, బాధలు (తెలియకపోవుటచే) లేకుండుట; స్తబ్దత; మాంద్యం; చైతన్యశక్తి లేకుండుట, వణకు, ప్రతిమాటకు అబద్ధం చెప్పడం.

అదోముఖంగా కదలవలసిన ప్రేగులు ఊర్ధ్వముఖంగా కదలుటచే మలం వమనరూపంలో పోతుంది. ఏ బాధయు వుంది అనడు. ఏమియు కావాలని అనడు. తనజోలికి ఎవ్వరు రావద్దు తను ఒంటరిగా వుండాలి అంటాడు.

భయం. భయకారణంభీతి. వట్టిమగతేగాని నిద్ర పట్టదు. ఎక్కడో అద్యోధ్వనిని వింటాడు. అమితంగా మగత. ముఖంఎర్రగా కందగడ్డ అవుతుంది. దీర్ఘ ధ్వనితో కూడిన శ్వాస.

పరుపు వేడి సహించలేక చల్లనిచోటుకోసం ఇటు అటు ఊరికే దొర్లేస్తాడు. బట్ట కప్పనివ్వడు.

మూత్రం బంధిస్తుంది; మలబద్ధకం; ప్రేగులలో అడ్డు; ప్రేగులు మెలిపడడం, ఇది చాల అపాయకరమగుస్థితి.

మాగన్ను మగత; గురక; దీర్ఘశ్వాసలు; శ్వాస "బుస్" మను శబ్దం.

2. నల్లమందు విషానికి విరుగుడేమిటి ?

నల్లమందుకు చిక్కని నల్లకాఫీ కషాయం. రోగిలో చైతన్యం కలిగేదాకా విడువకుండా తరచుగా యివ్వాలి. దీనికితోడు విద్యుచ్ఛక్తికూడ ఉపయోగిస్తే మంచిది. ప్రేగుల్లోని విషాన్ని నోట్లోనుంచి గొట్టాన్ని పోనిచ్చిగాని, వ్రేళ్ళు గొంతులోకి పోనిచ్చిగాని, కక్కించాలి. వమనంఅయి శేషించిన విషంకూడా బైటకు వచ్చేటట్లు చూడాలి. రోగిని పరుండనివ్వకూడదు. బలవంతంగా బాగాచల్లగాలిలో తిరిగేటట్లుచేసి మగతరాకుండా చూడాలి. ముఖంపై చన్నీళ్ళుకొట్టడం మంచిది.

3. ఋద్రవాతం (అపోప్లక్సీ)లో ఓపియం వాడనగు లక్షణాలేవి ?

మితిమీరిన సిరస్సులోని రక్తధాటికి రక్తనాళముచిట్లి మెదడులో రక్తం స్రవించడంచే రుద్రవాతము (ఎపోప్లక్సీ) అనే ఋగ్మత వస్తుంది. మగత, బుస్సలుకొట్టు దీర్ఘశ్వాసలు, కంటిపాపయొక్క చైతన్యరాహిత్యత. ముఖంకమిరి ఊదాగావుండి వెచ్చగా నిప్పులా కాగుచూ ముఖమంతా వెచ్చని చెమటలుపడుతాయి. సిరస్సులోని రక్తనాళముచిట్లిన వెంపుగాక రెండవవైపు పార్శ్వము పడిపోవును. లేక శరీరము బిరబిగిసి కొయ్యబారును. సిరస్సుకు రక్తప్రసరణ. మలమూత్రాలు బంధించడం. ఇట్టిభీభత్సస్థితిలో "ఓపియం"ను వాడిన ఆరుగంటలవ్యవధిలో వ్యాధి అదుపులోకివస్తుంది. మూత్రంఅవుతుంది. శరీరంవేడితగ్గి చల్లబడుతుంది. ముఖానికి మామూలుకళ వస్తుంది. నాడి తిన్నబడుతుంది. (కెంటు) ఈలాటి రోగులకు తలవైపు ఎత్తుగా ఉండాలి. మంచంకోళ్ళక్రింద తలవైపున ఇటుకలుపెట్టాలి.

పేరుపొందిన వైరూప్యవైద్యులు నిరాశచేసికొని వదలివేసిన యిరువురు రోగులకు పై పరిస్థితిలోనుండగా వైద్యముచేసి స్వస్థత చేకూర్చాను "ఓపియం"తో. తరువాత "ప్లంబం"లక్షణాలు కనుపిస్తే దాన్ని యిచ్చాను. ఇప్పుడుకూడ అందులో ఒకరు సజీవులైఉన్నారు.

4. ఓపీయం నివారణచేయు భయలక్షణాలేవి ?

నల్లమందురాయిళ్ళు నిరంతరం భయాందోళనలతో బాధపడుతారు. వీరు బటాచోర్లు, వట్టి బూటకాలరాయిళ్ళు. భయంచే పుట్టే దుర్గుణాలకు, భయ కారణంచే భయము. భయంకర దృశ్య స్ఫురణమాత్రమున భీభత్సము, ఆందోళన. కన్నుమూస్తే భయ కారణం కండ్లకుకట్టినట్లు గోచరించి భీతావహం. భయంకరదృశ్యములు, వస్తువులు గోచరించుట. దయ్యములు, భూతములు కన్పిస్తున్నట్లు భ్రమించుట, దానివలన భయం. తన్ను ఖూనీచేయుటకు ఎత్తుకుపోతున్నట్లు భావన. అకస్మాత్తుగావచ్చు శుభవార్త, పొందే ఆనందం, కోపం, పరాభవం ఝుడుసుకొనుట వీటిచేకల్గు సర్వరోగములను 'ఓపియం' నివారించును.

5. కాల్కేరియా కార్బుయొక్క భయస్వభావమెట్టిది ?

కండ్లుమూసినక్షణంలోనే భయానకదృశ్యాలు పొడగట్టి వెంటనే భయంచే కండ్లు తెరువాలి, కళ్ళుమూస్తే భయమే.

6. ప్రసవానంతరం మూత్రం బంధిస్తే వాడే నాలుగు మందులను వ్రాయుము.

(1) ఓపియం (2) హాయాశ్యమస్ (3) కాస్టికం (4) ఆప్పునికం.

7. మూత్రము అణగి (సప్రషన్) యుండుటకు వాడనగు నాలుగు మందులను వ్రాయుము.

(1) స్ట్రామోనియం (2) జింజిబీర్ (3) లైకోపోడియం
(4) పల్సెటిల్లా.

8. భయముచేపుట్టే అతిసార విరోచనాలకు పనిచేయు మూడు ఔషధములను వ్రాయుము.

జెల్సిమియం, పల్సెటిల్లా, విరాట్రం-ఆల్బ.

9. చిరకాలముక్రితం భయపడి నేటికిన్నీ దానిఫలితం అనుభవించుచున్నప్పుడు వాడే మందులేవి ?

ఓపియం, నేట్రం-మూర్, సైలీషియా, ఫోస్ఫారిక్ ఏసిడ్.

10. బొగ్గువాయువు పీల్చుటచే సంభవించే దుష్ఫలితాలకు ఏమందులు సూచింపబడును.

ఓపియం, బవిష్టా, ఆర్నికా.

11. నల్లమందు లేక మార్ఫియా వాడుటచే కలిగే వాంతులు దేనితో నివారింపబడును ?

కెమోమిల్లా.

## 105. పెట్రోలియం

1. పెట్రోలియంచే మనస్సు ఏవిధముగా చెడును ?

ముక్కోపితనం, కర్యానికి కాలుదువ్వటం, స్వల్పవిషయాలకు కూడ నొచ్చుకొని మనస్సును బాధపెట్టుకోడం, ఒకచో నిలుగడల. మామూలుగా రోజూ నడచేదార్లే గుర్తుపట్టలేక దారి తప్పుతాడు. తాను రెట్టింపుమనిషి అయినట్లుభావన. రాత్రి తనపక్కలో ఎవరో పరున్నట్లు, తనపక్కలో ఎవరోఉన్నట్లుభ్రమ. పురిటాలు తనకు యిరు

వురు బిడ్డలున్నట్లు భావిస్తూ వారిని సముదాయించడం, పెంచడం ఎట్లానా అని ఆలోచిస్తూఉంటుంది. ఈలాటిభావనేగల ఒకపురిటాలుకు పెట్రోలియంయిస్తే ఆభావనను పోగొట్టింది (ఫేరింగ్టన్).

2. పెట్రోలియం పుట్టించే ప్రధాన నైసర్గిక లక్షణాలేమి ?

అమూల్యమగు ఏంటీసోరిక్ మందు. పొటకరించే చిడుము, గజ్జి లో అన్నివిధాలా 'గ్రైటిస్'తో సరితూగుతుంది. శరీరమందలి వివిధ భాగాల్లో అనగా పుర్రె, చెవులవెనుక, వృషణములపైన, స్త్రీ మర్మావయవములపైన, కాళ్ళు, సీలమండలు, చేతులు, ముచ్చికలగుంట యీలాటి పెక్కుతావులలో చిడుము. చేతులుపలిగి రక్తంస్రవిస్తుంది. ఇవన్నియు సీతకాలంలో ప్రకోపించి వేసవిలో వుపశమిస్తాయి. గజ్జి (ఎలోస్, ఎల్యూమినా, సోరినం)

పగటిపూట కడుపు నొప్పితోకూడిన అతిసార విరోచనాలు లేక జిగట విరోచనాలు.

నర్సాపురం గవర్నమెంటు హాస్పటల్ డాక్టరుగారు నిరాశ చెంది వదలివేసిన 8 సం॥ వయస్సుకలపిల్లకు బంకవిరోచనములు యీ "పెట్రోలియం"తో నివారింపబడినవి. పగలుమాత్రమే విరోచనము లగుట, విరోచనానంతరం ఆకలి. యీలక్షణములనే గుర్తించి యీ మందు వాడగా 2 రోజులలో పూర్తిగా విరోచనములుకట్టి క్రమముగా ఆరోగ్యము పూర్తిగా చేకూరెను.

ముచ్చికలగుంటలో సిరోవేదన, సీసపుగుండుపెట్టినట్లు బరువు. తలతిప్పు. సముద్రయానంలో కలిగే వాంతులు నివారించేమందు లలో ఒకటి.

'కాస్టికం'లోవలె కీళ్ళలో 'కిరు, కిరు' మనును.

ఈ రెండు మందులు కాలిక కీళ్ళనొప్పులలోను అందు "కిర కిర" మను శబ్దమున్నప్పుడు బాగుగా పనిచేయును. "పెట్రోలియం"కు మోకాళ్ళనొప్పులు కుదుర్చుటలో ప్రత్యేకత కలదు. కీళ్ళబెణుకులు కూడ తగ్గును.

ఆసనగండమాలకు, పంటిపుచ్చుకు పనిచేయును. రాత్రిసమయమున పండుకొనునప్పుడు వచ్చే దగ్గు తగ్గుతుంది. అతిసారవిరోచనాలు, దగ్గు పగలుమాత్రం ఉంటాయి.

3. కడుపులోపోట్లు భోజనంచేస్తే తగ్గే మూడు మందులేవి ?

(1) పెట్రోలియం. (2) చెలిడోనియం. (3) ఎనకార్డియం.

4. గుండె, కొన్ని ప్రత్యేక యితరభాగములు చల్లగానుండు లక్షణము గల మందులను వ్రాయుము.

పెట్రోలియం; సేట్రం మూర్; కాలీ-క్లోర్; గ్రాఫైటిస్; కాలీ-నిట్రు, కార్బో వెజిటబిలిస్; కాలీ బైక్రోమికం.

5. నొప్పి అకస్మాత్తుగావచ్చి అకస్మాత్తుగాఅంతమయ్యే స్వభావము గల మూడు మందులను వ్రాయుము,

బెల్లడోనా, మేగ్-ఫాస్. పెట్రోలియం.

6. అతిసారంలో పెట్రోలియంను ఏస్థితిలో వాడాలి ?

పసుపురంగు నీళ్ళవిరోచనములు గొట్టముతో కొట్టినట్లు అయి అవి కేబేజి తినుటవలన, గర్భవతులలోను, తుఫానుగాలిలోను, ఉదయ కాలంలోను వుద్రేకించి పగలుమాత్రమే అవుతాయి. విరోచనానంతరం ఆకలి.

7. పెట్రోలియం లక్షణముల వుద్రేకసమయము. పరిస్థితిఏవి ?

బండిలో పోతున్నప్పుడు, తుఫానుగాలిలోను, సీతాకాలం లోనూ, పగటివేళ వుద్రేకిస్తాయి.

## 106. ఫోస్ఫరస్ (Phosphorous)

1. ఫోస్ఫరస్ వాడనగు స్వరూపతత్వాన్ని వర్ణింపుము.

(అ) పొడుగ్గా, సళాగ్గా, సున్నితంగా ఉండి మృదువగు చర్మంతో చాల హుషారుగా ఉంటారు. తలవెంట్రుకలు ఎరుపు; చూడ ముచ్చటవేయు కనుముక్కుతీరు. స్వభావంకూడ సున్నితం, సుకుమారమే. చురుకుతనం ఎక్కువ.

(ఆ) సున్నితంగా, పొడుగ్గాఉంటారు; తీర్చిదిద్దిన కనుబొమలు; మెత్తనిజుట్టు, యివికలిగి క్షయవ్యాధికి గురిఅయేతత్వంకలిగి ఉంటారు.

(ఇ) పొడుగ్గా, సున్నితంగా వంగివుండేస్త్రీలు.

(ఈ) పొడుగ్గా చరచరా ఎదిగిపోయి వంగిపోయే స్వభావముకల యువకులు.

(ఉ) నరాల దుర్బలత్వంతో పొడుగ్గాఉండి, నీరసంగా ఉంటారు.

(ఊ) చేతులు మంటలు. వేడి, మంటలు; చేతులలోప్రారంభించి శరీరమంతా ప్రాకుతాయి.

(ఋ) వ్యాధిలక్షణాలన్నీ సాయంకాలం హెచ్చుతాయి.

2. ఫోస్ఫరస్‌యొక్క ప్రధాన నైజలక్షణములేమి ?

మంటలు :— శరీరమందలి అన్నిఅవయవాల్లోనూ మంటలుంటాయి. యీమంటలబాధలు రోగికి స్వీయంగానేఉంటాయి; కాని ఒంపరేచరు కొంచెంకూడా వుండదు.

నరాల దుర్బలత్వం:- మెదడు, వెన్నుపూసా చెడి నీరసం,నిస్సత్తువ; దడ, వణుకు, తిమ్మిర్లు. ఒకప్పుడు పక్షవాతంలోకికూడా దింపవచ్చు.

ఉదరం దుర్బలంగావుండి, పొట్టంతా వెల్తిగానున్నట్లు భావన. ఆకలి, నీరసం.

అస్థిమితం; ఒక్కక్షణమైనా స్థిమితంగా కూర్చోలేడు. క్రియకు నిలబడనైనాలేడు. ఎప్పుడూ యిటూ అటూ తిరుగుతూనే వుండాలి.

అమితంగా రక్తంస్రవించేతత్వం. కొద్దిపాటిగా దెబ్బతగిలి చిన్న గాయంపడినా విస్తారం రక్తం స్రవిస్తుంది.

చల్లని పానీయాలు, చల్లని ఆహారం; ఆహ్లాదకరమగు పండ్ల రసాలు సేవించాలనేవాంఛ.

హానిమాన్ మహాశయులు "యిది సాధారణంగా కాలికంగా పలచని విరోచనాలతో బాధపడేరోగులకు బాగా పనిచేస్తుంది" అన్నారు.

నిద్రపోయినతరువాత సుఖంగా వుంటాడు. సూర్యాస్తమయ సమయంలో ఆరాటం, ఆదుర్దా.

ఆకలి అమితం, తరచుగా తినాలి; లేకుంటే సోషవస్తుంది. తినినవెంటనే తిరిగి ఆకలి. (అయోడిన్)

ఈరోగి వుప్పు యెక్కువగా తింటాడు.

3. ఫోస్ఫరస్‌ను సేవించడంచే కలిగే మానసికలక్షణాలేవి?

ఆదుర్దా, ఆరాటం; భావిఅంతా అంధకారబంధురంగా గోచరించడం; ఏదో ముప్పువస్తుందనిభయం. సంధ్యాకాలంలో ఆరాటం,

ఆందోళన. ఒంటరిగావుంటే భయం; మరణభీతి. మూలలనుండి వికృతాకారులెవరో తన్ను తదేకదీక్షతో చూస్తున్నట్లు భావన. దానిచే భీతి, ఆందోళన. నాభిలోభయంపుట్టుట యీమందుయొక్క ప్రత్యేకత.

నిర్లక్ష్యం, మానసిక దుర్బలత్వం,మానసికశ్రమ కొంచెంకూడా చేయలేడు. ప్రశ్నకు చాలసేపు నిదానిస్తేనేగాని జవాబివ్వలేడు. స్తబ్దత్వం,మాంద్యం.

ఉద్రేకం, ఉక్రోషం, శరీరమంతా మంటలు; ఆరాటం, స్థిమితం లేకపోవడం.

4. ఫాస్ఫరస్ సిరస్సులో కల్పించే మార్పులేమి ?

వృద్ధులకు తలత్రిప్పు, వెన్ను వెంట వేడిపాకి సిరస్సుకు వ్యాపిస్తుంది. తలదిమ్ము. కాలికంగా సిరస్సుకు రక్తప్రసరణ.

చుండ్రు- లుంగలుంగలుగా గుప్పెళ్ళాది వెంట్రుకలు ఊడిపోతాయి. తలకట్టు పల్చనౌతుంది. అక్కడక్కడ బట్టతల, చెవిపైన చిన్న బట్టతల.

5. కంటిలోని మేహపటలాల వృద్ధిని అరికట్టే మందులేవి ?

'ఫాస్ఫరస్', 'సిలికా', 'బరియాటా కార్బ', 'కోనియం', "సికేల్", "నేట్రం మూర్", "కాల్కేరియా కార్బ", "మెగ్నీషియా కార్బ".

6. ఫాస్ఫరస్‌యొక్క కంటి లక్షణాలేమి ?

క్షణంమాత్రం అంధత్వం; విద్యుత్తాకిడి యీ అంధత్వహేతువు. గ్లకోమా. అతిగా పొగపీల్చుటచేతను, పొగాకు వాడుటచేతను సంభ

వించే దృష్టిమాంద్యం. హ్రస్వదృష్టి, సామీప్యదృష్టి (షార్టుసైట్). అనగా దూరపువస్తువులు ఆనవు. మేహపటలాలు (కేటరాక్టు)

7. ఫోస్ఫరస్‌కుగల కర్ణ (చెవి) వ్యాధులేవి ?

వింతచెముడు; మాటలుమాత్రం వినుపించవు. చెవిలో ధ్వనులు మాత్రం ప్రతిధ్వనిస్తాయి. సన్నిపాతజ్వరానంతరం వచ్చే చెముడు తగ్గుతుంది.

8. ఫోస్ఫరస్‌యొక్క ఉదరలక్షణములేవి ?

నాలుక పాలిపోయినట్లు తెల్లగాఉంటుంది. సర్వదా ఆకలి. ముఖ్యంగా రాత్రిళ్ళు ఆకలియెక్కువ. ఆకలితో నిద్రనుంచిలేస్తాడు. చల్లని పదార్థాలు తినాలంటాడు చల్లని ఆహారపానీయాలు తీసుకొని తృప్తిపొందుతాడు. కాని అవి పొట్టలోకిపోయి వేడెక్కినవెంటనే వాంతిగా వెళ్ళిపోతాయి. ఇమడవు. వాంతిహేతువు జఠరాశయ నిస్సత్తువకూడ కావచ్చును. జఠరాశయం తూట్లుపడి పుండ్లవుతాయి. పొట్టలో వెల్తిగా కాళీగాఉన్నట్లనుపిస్తునది. తిప్పనిఋచి కలపదార్థాలు, ఉప్పు తినాలని ఉంటుంది.

9. విస్తారం ఆకలి, తరచు తిన కోరిక కలుగజేసే మందులను పేర్కొనుము.

అయోడీన్. చెలడోనియం, పెట్రోలియం, ఎనాకార్డియం, చైనా, ఫోస్ఫరస్.

10. పొట్టలో వెల్తిగా, కాళీగా, ఏమియులేనట్లు నిస్త్రాణగాఉన్నట్లు భావనను కలిగించే మందులను పేర్కొనుము.

ఇగ్నీషియా; హైడ్రాస్టిస్; సెపియా; ఫోస్ఫరస్.

11. ప్రేగులపై ఫోస్ఫరస్‌కుగల ప్రభావమేమి ?

నీటివంటి పెద్దవిరోచనములు. గొట్టంతో కొట్టినట్లు వేగంగా ధాటీగా అవుతాయి. వీటిలో మైనం ముద్దలలాటి తెల్లని శ్లేష్మం ముద్దలు తేలుతూవుంటాయి. విరోచనం రక్తపూరితంగా వుంటుంది. కొందరికిమాత్రం; కప్పనురగలా ఉండడంకూడ సహజం. ఆసనకండ రంవిచ్చుకొనిఉండి నిరంతరం విరోచనం ఊటలా కారుతూవుంటుంది, నిస్సత్తువచే ఆసనకండరం ముడుచుకోలేదు. ఈలాటి అతిసారవిరోచనాలలో 'ఫోస్ఫరస్' దివ్యంగా పనిచేస్తుంది. ఈలా తెరువబడిన ఆసనంతో తీపుతోకూడిన గ్రిహణివిరోచనాలనుకూడ తగ్గిస్తుంది. అమితంగా నీరసం, నిస్త్రాణ, నిస్సత్తువ.

మలబద్ధం : అతిసారానికి వ్యతిరేకమగు మలబద్ధంలోకూడ "ఫోస్ఫరస్" పనిచేస్తుంది. పొడుగ్గా, సన్నగా కుక్కమలంలా ఎండిపోయిఅవుతుంది విరోచనం. దానికికూడ చాలసేపు బిగబట్టి ప్రయత్నించాలి.

12 సంభోగావయవాలపై "ఫోస్ఫరస్" తెచ్చు మార్పులేవి ?

స్త్రీ, పురుషు లిరు తెగలలోనూకూడా కామోద్రేకాన్ని పెంచుతుంది. ఎంతప్రయత్నించినా అదుపులోనుండక రోగి హద్దుమీరి పోయి మదపిచ్చిలో దిగుతుంది. సిగ్గు, బిడియాలును మరచిపోయి మర్మస్థానాలను బహిర్గతంచేస్తాడు. గుడ్డ విప్పేస్తాడు. ఈలా కొంత కాలంసాగి తుదకు విపరీతపరిస్థితిలోకి దిగుతుంది. అంటే పుంసత్వం పూర్తిగా నసిస్తుంది. నపుంసకత్వం సంభవిస్తుంది. శుక్లనష్టం, నిద్రలో శృంగారసంబంధమగు కలలువచ్చి వీర్యస్ఖలనం. దానితో నీరసం, నిస్సత్తువ. స్త్రీలకు మదపిచ్చ (Nyphomania)కు దివ్యౌషధం. ఋతు

సరి నిలచిపోయి దానిబదులు ముక్కునుండి, శ్వాసకోశాలనుండిరక్తం స్రవిస్తుంది. (Vicarious menstruation)

గర్భాశయంలోను, రొమ్ములపైనా రక్తం స్రవించే కేన్సర్లకు బాగా వుపశాంతిని కలిగిస్తుంది.

నెలసరి త్వరితంగా కనుపించి కొలదిగామాత్రమే మైల అవుతుంది. విస్తారంకాదు; కాని చాలాకాలం అవుతుంది. ఋతుమతి అవుటకుముందు యీరోగి ఏడుస్తుంది.

13. శ్వాసకోశాలపై "ఫాస్ఫరస్" ఎట్లు పనిచేయును ?

శ్వాసకోశాలవ్యాధుల్ని నివారణచేయడంలో "ఫాస్ఫరస్"ను మించినమందులేదు. ప్రదోషకాలంలో ప్రకోపించే గొంతుబొంగురు, తీపు, నొప్పి. తరచుగా తిరగబెట్టే కింకవాయువు (Croup) రొమ్ము పనిశంచే బిగబట్టేదగ్గు వస్తుంది.

నవ్వడం, మాట్లాడ్డం, చదవడం, ఎడమతట్టు పరుండడం, వేడి వాతావరణంనుండి చల్లని వాతావరణంలోకి మారడంవల్ల యిబ్బంది బాధలన్నియు ప్రకోపిస్తాయి.

దగ్గు చాలాబాధకరంగా వుండడంచేత మూలుగుతూ దగ్గును. అణచుకోడానికి శక్తికొద్దీ ప్రయత్నిస్తాడు; దగ్గుతో వొళ్ళంతావణకి పోతుంది. ఆయాసం. ఛాతీబరువు. ఛాతీపై రాయిపెట్టినట్లుండడం, విషపడిశం (Pneumonia) లో వాడదగు ముఖ్యమగు మందుల్లో ఒకటి 'ఫాస్ఫరస్' కుడి ఊపిరితిత్తి క్రిందిభాగం దీనికేంద్రం. న్యుమోనియా ద్వితీయావస్థలో శ్లేష్మం వెలువడనప్పుడు దీనిప్రభావం నిరుపమానం.

క్షయవ్యాధియొక్క ఆద్యాంతాల్లో పనిచేస్తుంది, ప్రథమావస్థలో దగ్గు, ఆయాసం, నీరసం. నిస్సత్తువలకు పనిచేస్తుంది. అంత్యస్థి

తిలో సాయంకాలం జ్వరం అంకురించి అర్ధరాత్రి దాటేదాకా వుండి పీల్చి పిప్పిచేసే అవస్థలో ఒక్క మోతాదు 'ఫాస్ఫరస్' పెద్దపొటెన్సీలో యిస్తే జ్వరంతగ్గి బాధలు వుపశమించి మరణకాలందాకా సుఖంగా వుంటాడు. నివారణకు అవకాశములేని క్షయవ్యాధిలో జ్వరంతగ్గి నాకా 'ఫాస్ఫరస్' వాడరాదు. పొరపాటున వాడితే ఏబాధలు తగ్గడానికిస్తే ఆబాధలు హెచ్చడమేకాకుండా తిరిగి జ్వరంకూడావస్తుంది. క్షయరోగముక్క అంత్యస్థితిలో దీనిని పెద్దపొటెన్సీలోవాడడం చాల అపాయకరం. యిది కొన్నిసమయాల్లోమాత్రమే.

14. నడుము, కాళ్లు-చేతులుపై "ఫాస్ఫరస్" ప్రభావమేమి ?

నరాలదుర్బలత్వాన్ని నిరూపించే నడుంపట్టు తప్పడంయిందులో స్పష్టంగా కనుపిస్తుంది. నిస్సత్తువ. నడుంనొప్పి, వెన్ను చివరిభాగంలో అతి సున్నితమగు తీపు, బాధ.

ఏమాత్రం సున్నితమగు పనిచేసినా క్రియకు నాలుగు పుస్తకాలు పట్టుకున్నా నడుంలో నొప్పి, సలుపు. నిలబడితే నొప్పిబాధ హెచ్చుతుంది. పాదాలు, కాళ్లు తిమ్మెర్లెక్కుతాయి. నడ్డిపూసచివరి భాగం మొద్దుబారుతుంది. వెన్నుపొడుగునా అక్కడక్కడమంట; మర్దనాచేస్తే తగ్గుతుంది, నడుం విరిగినట్లుపోటు.

కాళ్లు నిస్సత్తువ. కాళ్ళు తిమ్మిరి, బండల్లా బరువు. కాళ్ళు చల్లగా వణుకుతుంటాయి. సీరసంచే నడిస్తే తూలిపోతాడు.

తెలియకుండా మూత్రింపోతుంది, దగ్గితేకూడ మూత్రింపోతుంది. అనుమానంతగిలినవెంటనే మలమూత్రాలకు వెళ్ళకపోతే నరాల దుర్బలత్వంచే బట్టలోనే అవుతాయి,

తుంటిబంధం, మోకాళ్ళు వాస్తాయి, వేళ్ళకొనలకు స్పర్శజ్ఞానం తగ్గుతుంది. కాళ్ళు, చేతులు సన్నగించి రక్తనాళాలు వుబ్బుతాయి. కాళ్లు, చేతులు కొన్నిసమయాల్లో పట్లుతప్పుతాయి. చేతులు, భుజాలు చల్లబడుతాయి, చేతులుమంట, యీ బాధలన్నియు వేడిచే వుపశమిస్తాయి.

సిరస్సు, వుదరములకు సంబంధించిన బాధలన్నియు సీతలోపచారాలచే వుపశమిస్తాయి.

ఛాతీసంబంధమగు లక్షణాలు వేడికాపడాలతో తగ్గుతాయి. కాళ్ళకు దుర్వాసనతో కూడిన చమట్లు. వివిధరకాల నరాలపోట్లు యీమందుతో నివారణ అవుతాయి (ఫేరింగ్టన్).

15. మూత్రవిసర్జనానంతరం బొట్లుబొట్లుగా మూత్రంపడే లక్షణంగల మందులను వ్రాయుము.

ఎగారికస్; సెలీనియం; హెలినోస్; గ్రఫైటిస్; సిలికా; కాస్టిరియా, నేట్రం-మూర్, పిక్రిక్-ఏసిడ్, పెట్రోలియం, కోనియం, కాలీ-కార్బ, కెనాబిస్-ఇండికా, ఆర్జెంటం-నిట్, స్టఫిసాగ్రియా, ఫాస్ఫరస్.

16. నిద్రలక్షణాలలో "ఫాస్ఫరస్" తేగల మార్పులేమి ?

స్థిమితంలేని నిద్ర, ఆరాటం, నిద్రలో ఉలికిపాటు, కుడివెంపునే పరుండడం, ఎడమవైపు పరుంటే గుండెదడ, గుండెలోనొప్పి, ఆరాటం, రాత్రి ప్రొద్దుపోయి పరుంటాడు. పరున్నాక పగటి విషయాలు స్మరించి వాటినిగురించి ఆలోచిస్తూ లేనికష్టం తెచ్చిపెట్టుకొని మనోవ్యథలో పడుతాడు.

17. "ఫాస్ఫరస్"యొక్క ఉద్రేకఉపశమనాలేమి ?

ఉద్రేకం: సాయంకాలం, అర్ధరాత్రికి పూర్వం (పల్స్) ఎడమ వెంపు పరుండడం, బాధవెంపు పరుండడం, ఉరుములు, మెరుపుల సమయం, సీతోష్ణస్థితులమార్పులు, చల్లగాఉన్నా సరే - వేడిగా ఉన్నా సరే.

ఉపశమనం: చీకటిలోను, కుడివెంపు పరుండడం, అదిమితోమడం, మెస్మరిజం చేయడం చల్లని ఆహారపానీయాలు - వేడెక్కడాకాను.

## 107. ఫాస్పారిక్ యాసిడ్ (Phosphoric acid)

1. "ఫాస్పారిక్ యాసిడ్" తీసుకున్న వెంటనే కలిగేమార్పేమి ?

దీనిని తీసికొనిన వెంటనే నీరసము, నిస్సత్తువ కలుగుతుంది. నిరాశ, అలసత్వం, నిస్పృహ, మానసికంగాను, శారీరకంగాను మాంద్యత, మత్తు, బద్ధకం, హెచ్చరిక సన్నగింపు సంభవిస్తాయి. నీ ప్రశ్నలకు సరియగు జవాబివ్వడానికి యిష్టముండదు. "అవునో" "కాదో" అని ముక్తసరిగా వినుగుతో యిష్టంలేని జవాబువస్తుంది.

మగతగాను మత్తుగాను ఉండి అస్పష్టంగా తనలోతాను గొణుక్కుంటాడు. సంధిలక్షణాలు అంతవిపరీతంగావుండవు. మత్తుచే తన చుట్టునా జరిగేదేదో తెలుసుకోలేని పరిస్థితిలోవుంటాడు. కాని లేపితే తెలివిగానేవుంటాడు. రోగం ఘనీభవించి రోగి పూర్తిమగతలో పడివుండినప్పుడు ఇది గుర్తింపబడదు.

2. సన్నిపాతజ్వరం (Typhoid fever)లో ఫాస్పారిక్ యాసిడ్ ను సూచించు లక్షణాలేమి ?

ముక్కు కొన తెలివుంటుంది. కండ్లచుట్టునా దట్టమగు నీలిరంగు వలయాలుంటాయి (Blue rings). ముక్కువెంట రక్తంపడుతుంది. కాని జ్వరం ప్రారంభావస్థలో దీనివలన యేమంతయూ వుపశాంతి వుండదు. ఈస్థితిలో అనగా ముక్కునుండి రక్తంపడునప్పుడు రోగిలక్షణములు వుపశమిస్తే "యాస్‌టాక్సు" వాడాలి. "ఫాస్ఫారిక్ ఏసిడ్" రోగి వ్రేళ్ళు ముక్కులోనికిపోనిచ్చి కెలుక్కుంటాడు.

ముక్కులో ఉలారం, దురదే దీనికి హేతువు. "సీనా" లోవలె క్రిములు ఉండడంచేతకాదు. జఠరాశయంలోని బాధచేకలుగుతుంది. పొట్టవుబ్బి డోలువలె వుంటుంది. తరచు నీటివంటి అజీర్ణవిరోచనాలు వాయువుతోకూడి అవుతుంటాయి. నాలుక పొడారిపోయి మధ్యగా ముదురు ఎరుపురంగుచార వుడుతుంది. ఒకప్పుడు మామూలురంగుతో వుండి నాలుకపై మెరుపుతోకూడి పాచికట్టి వుంటుంది. నిద్దట్లో తెలియకుండా ఒకప్పుడు నాలుక కరచుకుంటాడు. మూత్రం తెల్లగా పాలవలె వుంటుంది. శ్వేతధాతువు (Albumen) విస్తారం పోతుంది. ఒకప్పుడు మూత్రంలో భాస్వరలవణాలు వుంటాయి. (Phosphates) ఈ ప్రధానలక్షణాలు టయిఫాయిడ్‌జ్వరంలో "ఫాస్ఫారిక్ ఏసిడ్" ను గుర్తింపజేస్తుంది. (ఫేరింగ్టన్)

3. "ఫాస్ఫారిక్ యాసిడ్" చే కలిగే అతిసార విరోచనాలు ఎట్లగును?

ప్రేగుల్లో పెద్దశబ్దాలు, ధ్వనులతో అయే అతిసారవిరోచనాల్లో యిది సాధారణంగా గుర్తింపబడుతుంది. విరోచనాలు విడువక తరచుగా అవుతాయి. సాధారణంగా త్వరితంగా ఎదిగేయువకుల్లో ఉపయోగపడుతుంది. దీని విచిత్రమేమిటంటే విరామంలేకుండా పెద్ద పెద్ద విరోచనాలవుతున్నా రోగిమాత్రం నీరసించడు. "ఆరువారాల నుండి తెరిపిలేకుండా ప్రేగులుఅరుస్తూ విరోచనాలు ఒక్కటీరుగా అవు

తున్నాయి; కాని పిల్లాడు ఆడుకుంటూనేఉన్నాడు" అంటుందితల్లి. తిన్నది అరగకుండానే అజీర్తిగా విరోచనాలు అవుతాయి. తిన్న వెంటనే చెంబుతీసుకు పరుగెత్తాలి. ఇంకోచిత్రమేమిటంటే రోగి ఒకవేళ కొంచెం నీరసంగావున్నా స్థిమితంగా ఒక్కనిద్ర కునుకుతీశాడంటే యథాతథంగా కోలుకుంటాడు.

4. పురుషజననేంద్రియములందు "ఫోస్ఫారిక్ యాసిడ్" కలిగించు వ్యాధిలక్షణములేవి?

ఏనాడో ధాతునష్టంచే కలిగే లక్షణాలకు 'ఏసిడ్ఫాస్' వుపయోగపడుతుంది. వీర్యం, ధాతువులు, నష్టపోయి వెంటనేకలిగే నీర్సనిస్సత్తువులకు అంతగా వుపకరించదు. శుక్లనష్టం, అమితసంభోగం, రాత్రికలలో వీర్యస్ఖలనం, మూత్రంతో వీర్యస్రావం లేక ముష్టిమైథునం ఈ మొదలగు కారణాలచే ధాతువులుకోల్పోయి చాలకాలంగా రోగి మానసికంగాను శారీరకంగాను బాధపడుతూంటాడు. శరీరమంతా నిస్సత్తువచెందుతుంది. మగత, నీరసం ఆవహిస్తాయి. కళ్ళు చీకట్లుకమ్మటం, తూల్తూవుండడం సంభవిస్తాయి. పరున్నప్పుడు కాళ్ళు సిరస్సుకంటె పైకి వెళ్ళిపోతున్నట్లుంటాయి. బీజాలు జారి వ్రేలాడుతూంటాయి. పురుషాంగానికి లేవనశక్తివుండదు. వున్నా నామమాత్రం. సంభోగకాలంలో శీఘ్రస్ఖలనం, బీజాలపై చమట్లు. నడుంపట్టు తగ్గుతుంది. నడుస్తుంటే కాళ్ళు తడబడుతాయి. వెన్నునొప్పి పోటుఉండదు గాని పొడుగునా మంటగావుంటుంది.

సంభోగావయవాలు పట్టుచెడి జారుడుగానున్నప్పుడు తరచుగా వాడుచూ తక్కువ పొటెన్సీలోనే వాడాలి.

5. ధాతునష్టంలో 'సింకోనా' 'ఏసిడ్ఫాస్' వాడనగు సమయాలేవి?

వీర్యనష్టం ధాతునష్టాలచే సంభవించే బాధలన్నిటిలోనూ 'ఫోస్ఫారిక్ యాసిడ్' అన్నివిధాలా 'సింకోనా'ను పోలివుంటుంది. యింకా చెప్పాలంటే 'సింకోనా'నికూడ మించి పనిచేస్తుంది. ధాతువులను నష్టపడిన తక్షణఫలితాలకు 'సింకోనా' పనిచేస్తుంది. 'ఏసిడ్ ఫాస్' కాలికఫలితాలకు పనిచేస్తుంది. వరుసగా నాలుగురోజులు కలలువచ్చిగాని నిర్నిమిత్తంగాగాని, వీర్యస్ఖలనమై, కళ్ళు చిరట్లుకమ్మటం, చెవులు దిబ్బడపడి నీరసం. నిస్సత్తువుగాను వుండడం సంభవిస్తే 'సింకోనా' యిస్తే రోగి తేలుకుంటాడు.

6. విద్యార్థులకు "ఏసిడ్ఫాస్" ఎట్లు ఉపకరిస్తుంది ?

విద్యార్థినులకువచ్చు తలనొప్పులను క్షణంలోతగ్గిస్తుంది. చదువుకున్నా. మానసికశ్రమ పడుచున్నా తలనొప్పి వస్తుంది. పరీక్షాసమయంలో విరామంలేకుండ రేయింబగళ్ళు శ్రమపడి చదవడంచే వచ్చే నీర్సం, నిస్సత్తువులకు, యింకావచ్చే యితరబాధలకు పనిచేస్తుంది.

7. మూత్రంలోను, మూత్రాశయమందు "ఏసిడ్ఫాస్" కలిగించే మార్పేమి ?

ప్రథమంలో రేయింబగండ్లు నీటివంటిమూత్రం చాలసార్లు విస్తారంగాపోతుంది. అతిమూత్రం. మూత్రవాహిని రెట్టింపుఅయిందా అన్నట్లు మూత్రం త్వరితంగాపోతుంది. నరాల దుర్బలత్వంచేవచ్చే మధుమేహాన్నికూడ తగ్గిస్తుంది. రాత్రిళ్లు మూత్రవిసర్జనకు పెక్కుసార్లు లేవాలి. మూత్రం ఒకప్పుడు తెల్లగా పాలలా ఉంటుంది.

8. తలనొప్పితో బాధపడే విద్యార్థులకు పనిచేయు మూడుమందులేవి?

(1) 'ఫోస్ఫారిక్ యాసిడ్' (2) 'నేట్రమ్ మూర్' (3) 'కాల్కేరియా ఫాస్'.

9. మనిషిని కృంగదీసే విచారం, బెంగలాటి మానసికవ్యాధులలో ఫోస్ఫారిక్ యాసిడ్"ను గుర్తింపజేయు లక్షణాలేవి ?

స్నేహితులు, ఆప్తులు, ప్రియబంధువులు, ప్రేమింపబడినవారు చనిపోవుటవల్ల, ధనం, ఆస్తి కోల్పోవడంవల్ల, అప్రతిష్టపాలవడంచేత ఉద్యోగం పోవడంచేత రోగి మనోవ్యాకులతచెంది కృంగి కృశించి నీర్సం, నిస్సత్తువ, బెంగ, దిగులు, పరధ్యాహ్నం, మందమతితనం కు లోనౌతాడు. ఆరోగ్యం చెడుతుంది; క్రమంగా తలనెరుస్తుంది, ముఖం వెలవెలబారి చూపు నిరాశ, నిస్పృహలను సూచిస్తుంది. నడినెత్తిని బరువు బాధ; కుంగతీస్తున్నట్లు బాధ; మోచికలగుంటలో నొప్పి, పోటు. మెడలు నొప్పగాఉండి లాగుతుంటాయి. నడుంలో పట్టుండదు. కాళ్లు చేతులు వణుకు. ఈలాటిబాధతో ఎవరితోనూ మాట్లాడ్డానికికూడ మనస్కరించదు. నీర్సంతోను నిస్త్రాణతోను ఒంటరిగా పడుకొని ఉంటాడు గుడిపాములా. రోగి యింటిపట్టునే వుంటాడు.

10. విచారంచే కలిగే వ్యాధుల్లో "ఇగ్నేషియా" "ఏసిడ్‌ఫాస్"గుణా లనుపోల్చి వ్రాయుము.

"ఇగ్నీషియా" విచారంచేకలిగే తత్క్షణలక్షణాలకు ఉపయోగిస్తే కాలికంగా చాలకాలంగా మనోవ్యథతో బాధపడుతూ కృళ్ళి కృశిస్తుంటే 'ఇగ్నీషియా' వాడాకా 'ఏసిడ్‌ఫాస్' ఉపయోగపడుతుంది. 'ఇగ్నీషియాలో' నరాల దుర్బలత్వంచే కొంకర్లు, అదుర్లు కలుగుతాయి. 'ఏసిడ్ ఫోస్'లో యివి ఉండవుకాని రోగి నీర్సంతోను, నిస్సత్తువతోను శోషవచ్చినవానిలా ఉంటాడు.

14. అరపుటకు మించకుండా "ఫోస్ఫారిక్ యాసిడ్" యొక్క ప్రధాన నైసర్గిక లక్షణములను వ్రాయుము.

స్వాభావికంగా బలంగాను, ఆరోగ్యంగాను ఉండి అమితసంభోగంచేత, దురలవాట్లవల్ల లేక దైవసంఘటనచే ఆస్తిపాస్తులుకోల్పోయి బెంగ, విచారం, దిగులుచే కృంగి కృశించి ఆరోగ్యంకోల్పోయి మనోవికాసంలేక ఎవరిముఖమూచూడనొల్లక ఒంటరిగా ఇంటిపట్టునేఉండి తలనొప్పి, నీరసంతో బాధపడేవారికి అమృతప్రాయంగా పనిచేస్తుంది.

సాధుస్వభావం; దేనికీ ఎవరినీ కాదనడు. కోరికలేమియుఉండవు. దేనినిమిత్తంకూడ ప్రాకులాడడు; నిర్లక్ష్యం; పరాకు; మరుపు.

నడినెత్తిని కృంగదీసేభారం, బరువు. మితిమీరిన విద్యావ్యాపకంచేతను, చిరకాలం మనోవ్యధచేతను. నడినెత్తిలోను, ముచికల గుంటలోను వచ్చే నొప్పికి పోటుకు, విద్యార్థులకువచ్చే అన్నివిధములగు సిరోబాధలకు పనిచేస్తుంది.

సెగ, సవాయి వ్యాధులవలన ఎముకల పైభాగమువాచి బాధగానున్నప్పుడు, చాకుతో గీస్తోన్నట్లు పోటు, ఆటు, మంటలు గానున్నప్పుడు, ఒళ్ళంతా నొప్పులుగానున్నప్పుడు వాడాలి. కళ్ళలో కాంతిచెడి గాజుకళ్ళలా ఉంటాయి (Lippe). రాత్రిలు నిద్రలో తెలియకుండా నాలుక కరచుకుంటాడు. కాళ్ల-చేతుల నరాలు తోడుకుపోతాయి. పోట్లు, బాధ; శస్త్రచికిత్సానంతరం పుండుమానక ఆటు-పోటు.

నీరసముగాని, నిస్సత్తువగాని లేకుండా అతిసారవిరోచనాలు. విరోచనాలు తెల్లగాను, పసుపురంగుగాను, వాయువుతో కలసి పెద్ద శబ్దంతో అవుతాయి. భయంచే సంభవించే కలరాలకు పనిచేస్తుంది.

అతిమూత్రం: రాత్రిలు నీటివంటిమూత్రం విస్తారంగా అవుతుంది. నరాల దుర్బలత్వంచే మధుమేహం సంభవిస్తుంది. పాలలాటి మూత్రం, తరచు తెట్టులా పేరుకొంటుంది.

ముష్టిమైధనం ఆరోగ్యభంగమని తెలిసికూడా మానలేడు. అదుపులోపెట్టలేనంతవాంఛ. సిగ్గు, లజ్జ, భిడియం, విచారం; వ్యాధి కుదరదని విచారం, నిస్పృహ.

చెడువార్త వినడం, అమిత సంభోగం, గాలి, ధుమారం, మంచు యివి వ్యాధియొక్క ఉద్రేక కారకులు. బాధలన్నియుకూడ కొద్దిపాటి కునుకుపోయినా ఉపశమిస్తాయి.

ఆమ్లం (Acid) పులుపుఅంటే అయిష్టం. ఘాటైన పదార్థాలు కావాలి. పగలు బాగా నిద్రపడుతుంది. రాత్రిసమయంలో నిద్రే వుండదు.

## 108. ఫైటోలక్కా (Phytolaeca)

1. "ఫైటోలక్కా"చే సంభవించే తత్వసంబంధమగు మూర్చ్ఛలేమి?

విపరీతమగు తలనొప్పి, నడుముసలుపు, శరీరమంతా లాగుతునట్లు, పీకుతున్నట్లుపోటు. రోగి మూలుగుతూ కదల్డానికి ప్రయత్నిస్తాడు. కదిల్తే నొప్పులు హెచ్చుతాయి. ఒళ్ళంతాతీపు, అమితంగా నిస్త్రాణ. కూర్చుంటే నీర్సంవల్ల తల తిరుగుతుంది. "బ్రయోనియా" లోవలె తీవ్రమగు జ్వరం. నాడి దడదడా కొట్టుకుంటూవుంటుంది. తరచుగా పళ్ళు, యిగుళ్ళు కొరుకుతాడు. ఈలక్షణాలుంటే వ్యాధి పేరుతో అక్కరలేకుండా ఏవ్యాధినైనాసరే "ఫైటలక్కా" కుదురుస్తుంది.

2. గొంతుగలోని ఏలక్షణాలను 'ఫైటలక్కా' కుదర్చగలదు ?

గొంతుగనొప్పి, గొంతుగ పచ్చి లకు 'ఫైటలక్కా' ముఖ్యౌషధాల్లో ఒకటి. టాన్సిల్సు (Tonsils) రోగుల్లో తరచురొంపపట్టి, గొంతు వాచి, టాన్సిల్సుబ్బి వాటిపై తెల్లని చీముమచ్చలుపడి పోట్లు చెవులల్లోకంటా పొడుస్తాయి. ఈలాటి గొంతునొప్పితో తలనొప్పి, నడుంసలుపు,

శరీరమంతా లాగుతున్నట్లు, పీకుతున్నట్లు తీపు, పోటు. రోగి మూలుగుతూ కదలుటకు ప్రయత్నిస్తాడు. కదిత్తే నొప్పులు హెచ్చుతాయి. కూర్చుంటే నీర్సం వలన తల తిరుగుతుంది.

3. అంగుడు పుండు (Diphtheria) ఏ లక్షణాలతో నున్నప్పుడు ఫైటలక్కా వాడాలి ?

గొంతునుండి చెవులలోనికి పోట్లు; గుటకవేస్తే నాలుక మొదట్లో భరించరాని బాధ, పోటు; అగిడిమంటలు; అగ్నిజ్వాలల్లా మండిపోతుంది. గొంతు పొడారి గుటకవేస్తె బాధ; చేతులు వణుకుతాయి నరాల దుర్బలత్వంవల్ల. గొంతులో ఉండ ఉన్నట్లుండి తరచు గుటక వేస్తాడు. కొండనాలుక యొక్కయు, టాన్సిల్సుయొక్కయు వెనుక భాగంలో బూడిదరంగు పొర యేర్పడుతుంది. వేడినీళ్ళు, వేడి పానీయాలు త్రాగలేడు. (లె కేసిస్).

4. చనుకుదురులో 'ఫైటలక్కా' లక్షణాలేమి ?

చనుకుదుకు వ్యాధి నివారణకు వాడదగు మందులలో ప్రధానమైనది. స్థనాలు వాచి రాళ్ళలా గట్టిపడి వేడిగాను, నొప్పిగాను ఉండి పాలిచ్చేటప్పుడు యీ నొప్పులు శరీరమంతా పాకి జ్వరం వస్తుంది. తల, నడ్డి లాగుతాయి. ఈ స్థితిలో యీ మందిచ్చి వ్యాధిని నివా

రించకపోతే వ్యాధి ముదిరి చీము పడుతుంది. పిల్లలకు పాలిచ్చినప్పుడల్లా నొప్పులు శరీరమంతా వ్యాపిస్తాయి. చనుకొనలు సున్నితమైన తీపుగా వుంటాయి. కొనలు పగిలి బిడ్డ కుడుచుకున్నప్పుడల్లా చాల బాధ పెడుతాయి.

5. చనుకుదురుకు వాడనగు మందులను పేర్కొనుచు వాటి గుర్తింపు లక్షణములను పేర్కొనుము.

1. ఫైటలకా 2. బ్రియోనియా 3. లేక్ కేనినం 4. క్రోటన్ టిగ్.

"ఫైటలకా" స్థనాలు గట్టిగా రాళ్ళలా ఉండి చను మొనలు నొప్పులు; యీ నొప్పులు శరీరమంతటా పాకి జ్వరం. జ్వరంలో పళ్ళు పటపట కొరుకుతాడు.

'బ్రియోనియా' పుట్టడొచ్చిన మూడవనాడు పథ్యం పెట్టిన తరువాత ప్రథమంగా పాలు పడేటప్పుడు స్థనాలు వాచి జ్వరంవస్తే "బ్రియోనియా" తక్షణం నివారిస్తుంది.

"క్రోటన్ - టిగ్": పిల్ల పాలు కుడిచేటప్పుడు నొప్పి వెనుక వైపుకు అంటే వెన్నులోకి పోడుస్తుంది.

'లేక్ - కేనినం': స్థనాలనిండా పాలుపడి, తీపుపెట్టి ఆ భారంచే రోగి బాధపడుతుంది. బాధకు తాళలేక స్థనాలను చేతులతో పట్టుకుంటుంది. కదిలినా మెదిలినా అమితంగా నొప్పి.

6. రొమ్ములలో పూర్వపు పుండ్ల మచ్చలు పై పనిచేయు రెండు మందులను తెల్పుచూ వాటి వుపయోగాలు వ్రాయుము.

గ్రాఫైటిస్, ఫైటలకా; యీ రెండు మందులూ స్థనాల యందలి పూర్వపు మచ్చలకు వాడదగినవి.

పూర్వము ఏనాడో పురిటిలో స్థనాలపై కురుపులు పుట్టి, పుండై అప్పుడు కట్లవల్ల తగ్గిపోయి మచ్చపడివుండి మరల యీ పురుడులో ఆ మచ్చలలోనే వాచి కురుపై పుండుపడి స్థనగ్రంధిని తినివేసి నొప్పి, పోటు, సలుపు, జ్వరం, ఉన్నప్పుడు "గ్రఫైటిస్" పూర్వంనుండి వాడే మామూలు మందు. కాని ఫైటలక్కా దానిని మించిన మందు.

7. 'ఫైటలక్కా' యొక్క ప్రధాన నైసర్గిక గుర్తింపు లక్షణములేమి?

సుఖవ్యాధులు జీర్ణించడంచే యేర్పడే కీళ్ళనొప్పులు (కీళ్లవాత తత్వాలు) తేమగాలిచే ప్రకోపించు కాలిక కీళ్ళ నొప్పులు. కాళ్ళు ఎత్తివుంచుటచే ఉపశమించే మడమనొప్పులు.

ఈ రోగులు బక్కచిక్కి క్రమంగా క్షీణిస్తారు. రక్తం తగ్గి పాలిపోతారు. అమితంగా అలసట, నిస్త్రాణ.

నొప్పులు విద్యుచ్ఛక్తిలా ఒకచోటనుండి వేరొకచోటకు క్షణ క్షణం మారుతూవుంటాయి. (పల్సు). ఈ నొప్పులు రాత్రి సమయాన్ని కదిలితే ప్రకోపిస్తాయి. జీవితమంటే నిర్లక్ష్యం; మరణం తప్పదని భావన. పక్కమీాదనుంచి లేస్తే కళ్ళు తిరుగుతాయి. (బ్రై).

నడుం, శిరస్సు భరించరాని పోటు. శరీరమంతా పచ్చిపుండులా కవకగొట్టినట్లుంటుంది.

పళ్ళు, వరుయిగుళ్ళు ఎప్పుడు కొరకాలనే వుంటుంది.

గొంతుగ పచ్చి; కొండనాలుక వాచి నీరు పట్టినట్లుంటుంది. అంగుడు పుండు. గుటకవేస్తే గొంతుగలోనుండి చెవులలోకి పొడుస్తుంది. గొంతుగలో ఉండ ఉన్నట్లుండి తరచు గుటక వేయాలని వుంటుంది. వేడి పానీయాలు త్రాగలేదు.

రొమ్ములు వాచి రాళ్ళలా గట్టిగా ఉంటాయి. శిశువు పాలు కుడుస్తుంటే చనుమొనలనుండి బాధలు శరీరమంతా విస్తరిస్తాయి.

చనుమొనలు పగిలి తీపు, బాధ.

ఒళ్ళు నొప్పులు, మూలుగు.

తేమ గాలిచే రాత్రిలందు వేడి పానీయాలు గుటక వేయడం వలనా, పక్కనుండి లేచినా బాధలు హెచ్చుతాయి.

చన్నీళ్ళు త్రాగడంచేత, పొట్టపై పరుండుటచేత, విశ్రాంతి చేత, ఉష్ణోపచారాలు, సీతగాలి వుపశాంతిని కలిగిస్తాయి.

## 109. ప్లంబం (Plumbum)

1. "ప్లంబం" కలుగజేసే సాధారణ లక్షణములను వ్రాయుము.

రక్తనాళాలను, కండరములందలి దారములను (Muscular fibers) బిగబట్టే స్వభావం దీనికి కలదు. ప్రథమంగా దీనిని సేవించుటచే శూల ఉద్భవిస్తుంది. భరించరాని శూలనొప్పి; నొక్కివేస్తున్నట్లు, బిగ లాగుతున్నట్లు దుర్భరమగు శూల. ఈ నొప్పితో పొట్ట తొట్టిపడవలా వెన్నుకు లాక్కుపోయి తొట్టిలా ఏర్పడుతుంది. నొప్పి అన్ని వెంపులకు ప్రసరిస్తుంది. నొప్పి నరాలగుండా అన్ని తావులకు విస్తరిస్తుంది. నొప్పి శిరస్సుకు ప్రాకితే సంధిస్తుంది. ఛాతీవైపు ప్రాకితే ఆయాసం పుడు తుంది. ఇదే జననేంద్రియం వైపు ప్రాకితే బీజాలు ముకుళించుకు పోతాయి. కాళ్ళలోనికి ప్రాకితే ఈడ్పులు, కొంకర్లు, పుట్టుతాయి. శూలతో విపరీతమగు మలబద్ధం; అధోముఖంగా పోవలసిన మలం ఊర్ధ్వముఖంగా వమన రూపంలో పోతుంది. (ఓపియం).

తరువాత "ప్లంబం"కలుగజేసేవి పక్షవాతలక్షణాలు. ముఖ్యంగా మణిబంధం (Wrist drop) పడిపోతుంది. పక్షవాతంలో బహిఃకండరాలపని స్తంభిస్తుంది. పళ్ళయిగుళ్ళపై నీలిధాతువుగల చారలు స్ఫుటంగా కనుపిస్తాయి. పక్షవాతలక్షణాలు క్రమంగా యితరావయవాలకు వ్యాపిస్తాయి. తరచు కాళ్ళుపడిపోవడం సహజం. చర్మోపరిభాగమందలి నరాలు పరిశోషించిఉండడంచే రోగి శరీరాన్ని తాకనివ్వడు. పడిపోయిన అవయవాలు క్రమంగా సన్నగిల్లుతాయి. వణకుతో ప్రారంభమై పక్షవాతంలోకి దించుతుంది. పక్షవాతంచే అవయవాలు బిగలాక్కుపోయి క్షీణించి సన్నబడుతాయి.

2 ప్లంబంకలుగజేయు గర్భాశయ సంబంధమగు మార్పులేమి ?

గర్భాశయముకు ఎముగు స్వభావమును స్తంభింపచేస్తుంది. "ప్లంబం". అందుచే తరచు స్త్రీలకు గర్భస్రావాన్ని కలుగజేస్తుంది, గర్భకోశంలో పిండం దినదినాభివృద్ధి చెందుతుంది. ఆ యెదుగుదలకు అనుకూలంగా గర్భాశయకండరములందలి తంతులుకూడ అభివృద్ధి చెందకపోవడంచే క్రమాభివృద్ధి చెందుచున్న పిండాన్ని గర్భాశయం యిముడ్చుకొనలేకపోవుటచే గర్భం విచ్ఛిత్తిలేక స్రావం అవుతుంది.

3. "ప్లంబం"చే పుట్టే సంధిలక్షణాలెట్టివి? వాటిని "బెల్లడోనా" సంధి లక్షణాలతో పోల్చి వ్రాయుము.

దీనిసంధి అన్నివిధములా "బెల్లు"ను పోలిఉండును. దగ్గరున్నవారిని కొడుతాడు, కరుస్తాడు. కాని 'బెల్లు'కులేని లక్షణం చేతులు, తల వణకడం. వెర్రిచూపు. నోట్లోను, పళ్ళవద్ద పసుపురంగు ఆమం చేరుతుంది. అదీగాక 'ప్లంబం'కు పర్యాయంగా ఒకటివిడచి ఒకటి ఉంటుంది. 'బెల్లు'కు అట్లులేదు.

నిద్దురపట్టదు. అమితంగా సిరోవేదన. నుదురులోనో లేక ముచ్చిలగుంటలోనో పోటు. తలతిప్పు; చెవులలోహోరు, దృష్టిమందగింపు. వస్తువులు రెండుగా కనుపిస్తాయి. (Diplopia) స్వరపేటి, గొంతుగ బిగుసుకుపోతాయి. ద్రవపదార్థాలను ఆమద్దాతో గుటకవేస్తాడు. మనోదౌర్బల్యం; నిస్తబ్దత; విచారం. 'ప్లంబం'లో మాత్రం స్వేత ధాతువులతో నిండిఉంటుంది.

4. కాకిచిమ్మలు (Epilepsy) లో "ప్లంబం"ను సూచించు లక్షణాలేవి ?

రుగ్మతవచ్చుటకు ముందు కాళ్ళు బరువెక్కుతాయి; తరువాత పక్షవాతం, గురుప్రపట్టినిద్ర. తలలో కంతిపుట్టుటచే కలిగే కొంకర్లకు ఇది బాగుగా పనిచేస్తుంది.

5. మలబద్ధమందు"ప్లంబం"నైసర్గికలక్షణములేమి ?

పొట్ట దోన్నెలా దించుకుపోయిఉంటుంది. ఆసనకండరం లోనికి ముకుళించుకుపోతుంది. విరోచనం వుబ్బుకువస్తుంది. వెడితే నల్లగా, గుండ్రంగా, గట్టిగా రాళ్ళలా అతికష్టంమీాద అవుతుంది. తరువాత విపరీతమగు శూల లేక ఆసనం తాడుతో పైకి లాగుతున్నట్లు విపరీతమగుబాధ.

6. ప్లంబం (లెడ్) వల్ల కలిగే శూలకు విరుగుళ్లేమి ?

ఎల్యూమినా, ప్లాటినా, ఓపియం, నక్సు-వాం, కొలోసిన్తు, జింకు, బెల్లడోనా.

7. ప్లంబంకుగల మానసిక లక్షణములేమి ?

సాధారణంగానుండు మానసిక దౌర్బల్యమేకాకుండా విచారం, దిగులు, బెంగ, ఏదో ప్రమాదంరాగలదనే భావం, తానేదోఘోరాప

చారం చేసినట్లు, క్షమింపతగినవాడు కానట్లు భావన. అందుచే తీరని ఆరాటం; భరించరాని మనోవ్యధ. మితిలేని పిరికితనం; అమితవిచారం. ఆలోచనా పరంపరలచే నిద్రాభంగం, నిద్రపట్టదు; విరామం లేని ఆలోచనలు. జ్ఞాపకశక్తి బొత్తిగా తగ్గుతుంది. మరుపు ఎవరినైనా దగా చెయ్యాలని మోసపుచ్చాలని వుంటుంది. ఆవేశం. తరచు లక్షణాలు మారుతుంటాయి.

8. "ప్లంబం"చే పుట్టే మూత్రసంబంధమగు వ్యాధులేవి ?

మూత్రకోశం బలహీనమై మూత్రాన్ని బహిర్గతంచెయ్యలేదు. కండరాలుమాత్రం విసర్జనకు తోడ్పడవు. అందుచే మూత్రంబిగపడుతుంది. మూత్రం అవకపోవడం, మూత్రం బిగపట్టడం (Suppression) మూత్రం నిలచిపోవడం (Retention) యీరెండు లక్షణాలూకూడ 'ప్లంబం'కు వున్నాయి. అల్లా మూత్రం స్తంభించడంచేత మగత.

విద్యార్థులకు హృదయాన్ని పట్టేటందుకు కెంటుమహాశయులు తమ అనుభవంలో నివారించిన ఒకరోగియొక్క లక్షణాలు యీక్రింద వివరిస్తున్నాను.

"కొన్ని సంవత్సరాలక్రితం తోటివైద్యుడొకడు తన భార్యయొక్క బుగ్మతనుగూర్చి నాసలహానిమిత్తంవచ్చాడు. ఆమె గత రెండురోజులనుండి స్పృహలేక పడివుంది. చాలరోజులుగా మూత్రం బంధించగా కెతేటర్ (Catheter) వేసిచూస్తే మూత్రకోశంలో మూత్రమేలేదు. ఆమెకు మామూలుగుణాలు చాలావున్నాయి. కానిఅవన్నీ సాధారణంగా వుండేవే. ఆమెలో యీమాంద్యత చాలకాలంనుంచి వుంది. బొడ్డుకు తీగకట్టి లోనికి లాగుతున్నట్లు చాలకాలంనుండి వుండేది. ఒకరోజున రాత్రితో నాభిని వెన్నుపూసవైపుకు లాగుచున్నట్లు బాధవచ్చి తరువాతస్పృహతప్పి పడిపోయింది. అర్ధరాత్రివేళ

ఆదుర్దాతో ఆ డాక్టరుగారు పరుగెత్తుకొనివచ్చారు. ఆమె చచ్చేలా పేలవంగావుంది; నాడి బలహీనంగా కొడుతోంది, శ్వాసకూడ మందంగా వుందని చాల దీనవదనంతో చెప్పాడు. పెద్దపొటెన్సీలో ప్లంబం ఒక్క మోతాదుయిచ్చాను. మందు వేసిన కొద్దిగంటల్లో మూత్రం ఝూరీగాఅయింది. మగతతగ్గి లేచింది. తిరిగి యీ బాధమరలరాలేదు.

9. "ప్లంబం"చే కలిగే మూర్ఛసంబంధమగు లక్షణాలేమి ?

ఒకులు ఎవరైనా తన వెంపుచూస్తుంటే గంటలతరబడి మూర్ఛ స్థితిలోనే వుండిపోతుంది. తనదగ్గరగాని, ఆపరిసరాల్లోగాని ఎవరూ లేరనితలిస్తే పక్క మీాదనుంచి లేస్తుంది, పచార్లుచేస్తుంది. తన అందచందాల్ని అద్దంలోచూచుకుంటుంది. కాని గుమ్మంమెట్లపై పాదాల అలికిడి చెవులల్లోపడితే చటుక్కున మంచమెక్కి స్పృహతప్పినట్లు పడుకుంటుంది. ఎంతగిల్లినా తట్టుకుంటుంది. శ్వాసఆడుతోందో లేదో అన్నట్లుంటుంది. ఎదుటివాళ్ళను మోసపుచ్చేవాంఛతో లేనివ్యాధిని ప్రదర్శిస్తుంది. వున్నదాన్ని పెంచి చెబుతుంది. గోరంతను కొండంతగా చెబుతుంది. నటనకూడాఅంతే. లక్షణాలు సరిపడుతే 'ప్లంబం' వ్యాధిని సమూలంగా పొగొట్టేస్తుంది.

తరచు ఒకవిషయంనుంచి వేరొకవిషయానికి మారుతుంది. ఈ మందు ఆమూలాగ్రం వుద్రేకం కలుగజేస్తుంది.

10. "ప్లంబం" మూత్రపిండముల వ్యాధులను నివారించకలదా ? నివారించకలిగినచో లక్షణములేమి ?

నివారించకలదు.

మూత్రంలో శ్వేతము (Albumen) మధు (Swgar) వెడలు మూత్రపిండవ్యాధులకు మంచిఔషధము. మూత్రము ఎక్కువధాతు

గాను. కొలదిగాను వెడలును. స్పెసిఫిక్ గ్రావిటీమూత్రము ఎక్కువగా నుండును. మూత్రకోశములో మూత్రము చేరినట్లు తెలియక విసర్జించ వలసిన అనుమానముకలుగక మూత్రము నిల్వయుండిపోవును. మూత్రము బిగబట్టును.

11. ఓపియం తరువాత రుద్రవాతము (Apoplexy) లో వాడనగు మూడు మందులను వ్రాయుము. ఆమందులు ఉపయోగపడు పరిస్థితులనుకూడ వివరింపుము.

బుద్రవాతమందలి మగత, సిరస్సుకు విస్తారం రక్తపోటు, ముఖ్యముగా రక్తనాళముచిట్లి రక్తం పేరుకొనినట్లు రక్తంప్రవహించుచున్నచో "ఓపీయం" వాడిన తరువాత "ప్లంబం" వాడాలి.

"ప్లంబం, ఫోస్ఫరస్, ఎల్యూమినా" యీ మూడు ఔషధములు ప్రథమావస్థలో 'ఓపీయం' వాడినతరువాత శేషించిన బుగ్మత లక్షణములను నివారించుటలో నిరుపమానమైనవి. కండరములు పని చేయక పక్షవాతమంకురించి ఒకతట్టు పట్టుతప్పినప్పుడు ఈ మూడు మందులలో ఒకటి లక్షణములనుబట్టి ఉపయోగించినచో రోగి క్రమముగా కోలుకొనును.

12. శరీర కొనభాగముల (Extremities) లో "ప్లంబం" తేగల మార్పులేమి ?

అరికాళ్ళు అరిచేతులు తిమ్మెర్లు, రోగి శల్యగతుడగువరకు క్షీణత. చేతితో ఏవస్తువునుకూడ పట్టుకొని ఎత్తలేడు. చెయ్యిచాచుటకష్టమగును. తొడలలో బాధ, ఆబాధ ఉరక ఉరకలుగా వస్తుంది. నరాలు తోడుకుపోతున్నట్లు పోటు. చేతి మణికట్టు పట్టుతప్పి జారిపోతుంది. పిక్కలలో ఈడ్పులు(Cramps) వివిధావయవములలోతిమ్మెర్లు;

కుట్టుచున్నట్లు, చీల్చుచున్నట్లు బాధ, జిల. స్పర్శజ్ఞానం క్షీణించి బాధ, దడ. పాదాలకు నజ్జు; క్షీణించిన భాగములలో బాధ, పోటు లేక శూల; ఒకటితగ్గి మరొకటి. కాళ్ళుచేతులు చలువలుకమ్ముతాయి. రాత్రి పూట కుడికాలి బొటనవే్రలిలో పోటు.

13. "ప్లంబం" యొక్క నైజలక్షణాలను క్లుప్తముగా వ్రాయుము.

వెన్నుపూస సంబంధమగు ఋగ్మతలలో వాడనగును (ఫాస్ఫరస్, పిక్రిక్ యాసిడ్, జింకం).

రక్తహీనంగాను నీరసంగాను ఉండి త్వరితంగాను, ఎక్కువ గాను క్షీణించే సమయాల్లో వాడాలి.

జనసమ్మర్దంగల గదిలోకి వెడితే సొమ్మరావడం, నీరసం, మరపు. ముఖం మెరుపుగాను, జిడ్డుగాను ఉంటుంది. (నేట్రిమూర్) పను యిగుళ్ళవంచలందు సుస్పష్టమగు ఊదాచారలు; ఇగుళ్ళవాపు.

పొట్టలో శూల విపరీతంగావచ్చి శరీరమందలి అన్నిభాగాలకు ప్రసరిస్తుంది. భరించరాని నొప్పి; పొట్టను తీగతో కట్టి వెన్నువెంపుకు లాగుచున్నట్లు భావన.

శూలతో అధోముఖంగా పోవలసినమలం ఊర్ధ్వముఖమై నోటి వెంట వాంతిగా పోతుంది.

మడతపడిన గలక (Strangulated Hernia); నాభిస్థానమందలి గలక, మలబద్ధం. గొర్రెపెంటికలవలె నల్లగా గట్టిగా కష్టంమీాదగాని విరోచనంకాదు.

గర్భాశయంలో పిండాభివృద్ధికి తావులేక గర్భవిచ్ఛిన్నమగును. కాకిచిమ్మలు - అప్పుడేవచ్చు యీాడ్పులు.

పశుపురంగు చర్మం, హెచ్చుధాతువుగల బూడిదరంగు మచ్చలు స్త్రీల ఆర్తవ (Clematric) కాలమందు బయలుదేరుతాయి. కామెల. ఒళ్లువిరుపులు, ఆవులింతలు.

బాధలన్నియు గట్టిగానొక్కినను లేక మర్దనా చేసినను తగ్గుతాయి.

## 110. పోడొఫిల్లం-ప్లెటాటం(Podophyllum-Peltatum)

1. "పోడాఫిల్లం" యొక్క సాధారణ ప్రభావమేమి ?

చిన్న పేగులపై దాని ప్రభావము ప్రత్యేకమైనది. అందుచే తరచు దుర్వాసనతో కూడిన అతిసారవిరోచనాలు కలుగుతాయి. ఆసనము, ఆసన కండరములు పట్టు చెడుతాయి. పట్టులేక విరోచనానంతరం ఆసనకండరం ముకుళించుకోదు. అంతేకాక ఆసనం క్రిందకు పొడుచుకువస్తుంది.

2. అతిసారవిరోచనాలలో "పోడాఫిల్లం" నైసర్గిక లక్షణాలేమి ? సహకారలక్షణములతో వివరింపుము.

(అ) విరోచనం చాల పెద్దదిగా అవుతుంది.

(ఆ) విరోచనం విపరీతమగు దుర్వాసన.

(ఇ) విరోచనం అయేటప్పుడు బాధ యేమియు ఉండను.

(ఈ) విరోచనాలు ఉదయకాలంలోను, వేసవికాలంలోను, పిల్లలకు పళ్ళువచ్చే కాలంలోను ప్రకోపిస్తాయి.

దీని సహచరలక్షణాలు(Concomitants)చాలవింతగా ఉంటాయి. ఆసనం, ఆసనకండరం ముందుకు జారుతుంది (Prolapsus ani) అర

మోచిప్పకన్నుతో పడుకుంటాడు; మూలుగుతూ తలను తలగడపై యిటు అటు దొర్లిస్తాడు; తరచు ఓకరింపు లేక వాంతి అవుతుందా అన్నట్లుంటుంది. పసుపు లేక ఆకుపచ్చరంగుగా పెద్దపెద్ద విరోచనాలు నీళ్ళలా అవుతాయి. విరోచనం భరించరాని దుర్వాసన; ఏమైనా తిన్నా తాగినా ఉద్రేకిస్తాయి. పొట్టలో కెరటాలు; కెరటాల్లా విరామం లేని:'గుట్టు-గట్టు' మనేధ్వనులు గుడగుడలు. పొట్టలో జలచరాలు క్రిందకి పైకి ఈదుతున్నాయా అనుపిస్తుంది.

3. ఏఏ స్త్రీరుగ్మతలకు "పోడొఫిల్లం" వాడాలి ?

ఋతుకాలంలో స్త్రీలకువచ్చు విరోచనాలు, వాంతులు అండాశయంలో విపరీతంగా పోటు-బాధ వుండి ఆబాధ తొడలముందుభాగం గుండా దిగుతాయి క్రిందిపైపుకు. ముఖ్యంగా కుడిఅండాశయంలో పోటు. ఋతుసమయానికి ముందు, మైలవెళ్ళేటప్పుడు పొట్ట చాల పచ్చిగాఉంటుంది. (ఏపిస్, లేకసిస్, సిమిసిఫ్యూగా). గర్భాశయం క్రిందకు జారినప్పుడు పనిచేస్తుంది.

4. "పోడొఫిల్లం"కుగల తలనొప్పిస్వభావమేమి ?

కాలిక సిరోబాధ. సిరస్సుకు రక్తపోటుతో కూడిన తలనొప్పి. తల పగులగొట్టుచున్నట్లు ఎక్కువగా తల వెనుకభాగంలో తలనొప్పి. ఆ తలనొప్పితోనే అతిసారవిరోచనాలు; విరోచనాలుఅయితే తలనొప్పి సర్దుకుంటుంది. ఒకప్పుడు అకస్మాత్తుగా అతిసారవిరోచనాలుతగ్గిపోతే విపరీతమైన తలనొప్పివస్తుంది. ఈలానే విరోచనాలుతగ్గితే తలనొప్పి, తలనొప్పితగ్గితే విరోచనాలు ఒకటివిడచి మరొకటి రోగినిబాధిస్తాయి.

5. "పోడొఫిల్లం" కుదర్చగల నోటి లక్షణాలేమి ?

రాత్రిళ్ళు నిద్రలో పండ్లుకొరకడం. పండ్లువచ్చేకాలంలో పసు కుదుళ్ళు సర్వదా నొక్కుకోవాలని ఉంటుంది పిల్లలకు. నాలుక వెం

బగా పెద్దదైనట్లుండి మొద్దెక్కి దుర్వాసనవేస్తుంది, నోటివెంట నీళ్లు, నోరు చప్పన. నాలుకమంట, విదాహం.

6. "పోడోఫిల్లం"యొక్క కాలేయలక్షణాలేమి ?

కాలేయంవాచి పెద్దదై అతిసున్నితంగా ఉంటుంది. ముఖం, కండ్లు పసిమిగా ఉంటాయి. నోరు అరుచి. నాలుక పసుపురంగుగా ఉండి పళ్ళనొక్కుల ముద్రలు పడుతాయి. పైత్యరసం తగినంతఊరక పోవుటచే విరోచనం తెల్లగాఅవుతుంది. మలబద్ధం. అతిసారం, మల బద్ధం; ఒకటివిడచి మరొకటి. పైత్యరససంబంధమగు శూల.

7. "పోడోఫిల్లం"యొక్క నైసర్గిక లక్షణములను వ్రాయుము.

పైత్యప్రాభవంకలిగి తరచు ప్రేగులసంబంధమగు జఠరవ్యాధులతో బాధపడే తత్వంకలవారికి బాగుగా ఉపకరిస్తుంది. చల్లని నీరు విస్తారం త్రాగాలని ఉంటుంది (బ్రై). విదాహం. జీవితమంటేరోత. నిరుత్సాహం. తాను మరణిస్తాననేభయం.

తలనొప్పి, విరోచనాలు. ఒకటివిడచి మరొకటి (ఎలోయి) సీతకాలంలో తలనొప్పి, వేసవిలో అతిసారం. బాధలేని కలరావిరోచ నాలు. పాదాలు, పిక్కలు, తొడలల్లో విపరీతమగు యీడ్పులు, కొంకర్లు. ముఖ్యంగా బాధలేని పెద్దపెద్ద విరోచనాలు ఉదయకాలంలో అవుతాయి. పిల్లలకు పళ్ళు చాలకష్టంతో మొలకలెత్తుతాయి. ఆలా పళ్ళు మొలిచేకాలంలో రాత్రిళ్ళు యిగుళ్ళు నొక్కుకుంటారు; మూలుగుతారు; విరామంలేకుండ తల తలగడపై ఆడిస్తారు; సిరస్సు సల సల కాగుతూఉంటుంది. వయస్సొచ్చినవారు పళ్ళు పటపట కొరుకుతారు. ఉదయం ప్రారంభించి ప్రొద్దువాలేదాకా కాలికంగా అతిసార విరోచనాలు. సాయంకాలం విరోచనం మామూలుగానే అవుతుంది. (ఎలోయి)

పళ్ళువచ్చేకాలంలో తిన్నా త్రాగినా ఉద్రేకించే పిల్లల అతిసారవిరోచినాలకువాడాలి.

మలబద్ధకారణంగా తినకడంచేత, బరువులు ఎత్తడంచేత గర్భాశయం జారుతుంది. యువతులకు బహిష్టు నిలచిపోతుంది. గొంతుగ యొక్క కుడిభాగం, కుడిఅండం, కుడిరొమ్ము బాధ, పోటు.

## 111. సోరినం (Psorinum)

1. 'సోరినం'యొక్క ప్రధానలక్షణములేమి ?

"సోరా" తత్వముకలవారికి ఉపయోగపడును. కాలికవ్యాధులలో రోగలక్షణములుగల సరియగుమందు వాడినా వ్యాధిసమూలంగా పోక బాధపడునప్పుడు దీనిని వాడాలి.

చర్మంఅసహ్యమగువాసన వేస్తుంది; చలిగాలిపడదు; ఋతుమార్పుకాలాల్లో బాధలు; స్రావాలన్నియు కుళ్ళుకంపు. అర్ధరాత్రి ఆకలి.

సీతజ్వరం—రొంప, పడిశం (Hay fever). ప్రతి యేటా ఒకేనెలలో ఒకేతేదీని వస్తుంది; ఏమాత్రం శ్రమంతప్పదు. ప్రక్కవేడికి శరీరం దురదలు.

2. 'సోరినం'వల్ల కలిగే మానసిక ఋగ్మతలేమి ?

విచారం; నిస్పృహ, ప్రపంచమంతా సూన్యంగా గోచరిస్తుంది. తనచుట్టూనా అంధకారబంధురంగా ఉంటుంది. కనుచూపుదూరంలో ఆశాజ్యోతికి ఆస్కారంలేదు. తనస్థితి బాగున్నప్పుడుకూడ చెడిపో తోందనేఊహ. లేని పేదరికాన్ని తెచ్చిపెట్టుకొని విలపిస్తాడు. పగటి ఆలోచనలే రాత్రిళ్ళు కలలుగావస్తాయి. నిరుత్సాహం. కుటుంబమంటే

ప్రేమాతిశయాలు సన్నగిస్తాయి. ముక్కోపితనం. ఒంటరిగా ఉండాలనేకోర్కె. శరీరం శుభ్రంగావుంచడమంటేరోత. జన్మలో నీళ్ళోసుకోడు. ఎంతోదిగులు. మనోవ్యధ. తుదకు ప్రియతమమగు జీవితం మీాదకూడరోత. ఆత్మహత్యకు తలుస్తాడు. మతపిచ్చ-ముక్తి దొరకదని నిరాశ, విచారం. అమితంగా శరీరం దురదచే నిరాశ.

ఈపైనచెప్పిన లక్షణండున్న ఒక భీకరమగు పిచ్చియెత్తినరోగికి యీామందుతో యీాగ్రంధకర్త స్వస్థతను చేకూర్చారు. సుమారు 20 సం॥ కల ఒక విదుషీమణి. ఆయువతి ఎమ్. ఏ. మేధమెటిక్సులో వుత్తీర్ణురాలైనది. ఆమె విశాఖపట్టణవాసి. స్థానిక విశ్వవిద్యాలయంలోనే ఆమె విద్యాభ్యాసం చేసింది. పట్టణపురపాలక సంఘంవారిబాలికోన్నతపాఠశాలలో అధ్యాపకురాలు. గత ఆరుమాసములనుండి చికిత్సచేయుచున్న సుప్రసిద్ధవైద్యులు అనుభవజ్ఞులు ఆరోగిని నావైద్యమునకు వప్పగించారు.

రోగిస్థితి చాల భీకరంగాఉంది. ఆపాదమస్తకం చిడుం, రసి, దురదలు. ఆమెదిగంబరి; బట్టకట్టదు. గుర్తులేకుంచా గవులుకంపువేయు విరోచినాలు. కుటుంబంలోని వారెవ్వరు తమను కొట్టునవనే భయంవల్ల రోగిదాపుకుచేరరు. ఆమెను ఒకగదిలోపెట్టి గొళ్ళెంపెట్టారు ఇదంతా వివాహానంతరం నాల్గవరోజునుండి ప్రారంభం. వరుడు ఎమ్. బి. బి. యస్. ఆవరుడు నపుంసకుడని అది తెలిసికొనినవెంటనే ఆమెకు పిచ్చియెత్తినదని లోకులుఅంటారు. రోగివిషయంలో నాతో సంప్రతించడానికొచ్చిన రోగితండ్రికి విపరీతమగు చర్మవ్యాధి. కంచంలో అన్నంపెట్టి మెల్లిగా గదిగొళ్ళెంతీసి ఆకంచం లోపలికిగెంటేవాడు. ఇష్టంవచ్చినప్పుడు రోగితినేది. చాలరోజులనుండి రోగి దిగంబరి. నీళ్లుపోసుకొని ఎన్నాళ్లైనదో చెప్పలేము. జుట్టుఅట్టలుకట్టింది.

వంటివెంట పేలు పాకుతున్నాయి. ఆమెఉండేగది దుర్గంధభూయిష్టం మలమూత్రాలు తెలియకుండా ఆగదిలోనే. ఇంతకాలంనుండియు మందిస్తున్న వైద్యునిసలహాపై గంపెడాశతో నాదగ్గరకు వచ్చారు. తండ్రి కేంద్రప్రభుత్వంలో పెన్షన్‌తీసుకొన్న ఉద్యోగి. "సోరినం" వెయ్యి పొటెన్సీలో రెండుమోతాదులుయిచ్చి 6 గంటలవ్యవధిలో వెయ్యమన్నాను. మందిచ్చేదెల్లాగా అనే సమస్య రేగింది. మందు పుచ్చుకోదు. రోగిదగ్గరకువెళ్లడానికే భయం. ఒక గాజుగ్లాసు లో ఒక అరసోలెడునీళ్ళుపోసి అందులో నేనిచ్చిన పొట్లంలోనిమందు వేసి మరునాడు అన్నంపెట్టినప్పుడు అక్కడపెట్టారు. మామూలుగా అన్నంతిని ఆనీరు త్రాగింది.

మరునాడు మధ్యాహ్నం మంచిదానివలె తల్లినిపిలిచి చీరఅడిగి కట్టుకుంది. తొలిసారిగా చాలాకాలానికి మూడవరోజున బయటికి పాకీదొడ్డికివెళ్లింది. నాల్గవరోజున తలకు స్నానంచేసింది. తలపేలు ఒక్కటికూడలేకుండా చచ్చాయి. క్రమంగా మామూలుమనిషిలా అందరితోనూ కలసి మెలసి తిరిగేది. రోజు తలదువ్వకొని శుభ్రంగా ముస్తాబయ్యేది. సరిగా పదోరోజున తనంతతాను సినీమాకెళ్లింది. ప్రస్తుతం కులాసాగా రాజమండ్రిలో వుద్యోగంచేస్తోంది. "సోరినం" యొక్క మానసికలక్షణాలు పాఠకుల మనస్సుకు పట్టేందుకు యింతగా చెప్పాను.

## 3. 'సోరినం' చర్మవ్యాధులెట్టివి ?

"సోరినం" అన్నివిధాలా "సల్ఫర్" పోలిక. చర్మవ్యాధులనివా రణలో సహచర్లలా పనిచేస్తాయి. వాళ్ళువేడెక్కితే దురదలు. పరు పైతే దురదకు అంతేవుండదు. రక్తంకారేదాకా గోకడమే. వేళ్ళ సందునా, కీళ్ళయందు దురదలు, కురుపులు, పొడిఆరిన పొక్కులు;

దురదలు శీతాకాలంలో బాధించి వేసవికాలంలో తగ్గుతాయి. తరచు కురుపులు పుచ్చుతాయి. శరీరం అసహ్యంగా మురిగి ఓడుతూవుంటుంది; ఎన్నడైనా నీళ్ళు పోసుకుని ఎరుగునా అన్నట్లుంటాడు. నీళ్ళు పోసుకున్నా సరే పోని దుర్వాసనవేస్తుంది శరీరం. ఎన్నడూ చమట పట్టదు. ఒళ్లుఆరి జిడ్డుఓడుతూవుంటుంది. శరీరం బీటలుతీసి రక్తం స్రవిస్తుంది. ఒళ్లు పొట్టు తేలుతుంది. ఉన్నదుస్తులు వేసుకుంటే శరీరం దురద. పుళ్లుమానేటప్పుడు దురదలు. తలమీద, ముఖంమీద మాద, తలమీద పక్కులుకడుతాయి. లక్షణాలు కప్పుకుంటే ఎక్కువై చల్లగాలిలో తగ్గుతాయి. దీని సాధారణలక్షణానికిది వ్యతిరేకలక్షణం. పెదవులపైనను జననేంద్రియములపైనను పొక్కులు. యివితీపు, వాసన. ఆసనం ఒరుపు.

4. తలసంబంధమగు లక్షణాలుఏవి "సోరినం"ను గుర్తుకుతెస్తాయి?

ఆకలితోకూడిన కాలికసిరోవేదన; తలనొప్పివున్నంతసేపుఆకలే; తింటే తలనొప్పితగ్గుతుంది. వేళకు తిండితినకపోతే తలనొప్పి. అర్ధరాత్రి ఆకలి; అప్పుడు లేచి ఏమైనాతినాలి. సిరస్సుకు విపరీతమగురక్త దాటి; ముఖం వెచ్చగా ఉంటుంది. చమటతో వెంట్రుకలుతడిసి వుంటాయి. ఆకలి. ఒకవారం, రెండువారాలు లేక మూడువారాలకు ఒకమాటు తలనొప్పి. తలనొప్పితో కండ్లుమసగ, ఒకప్పుడుచూపు ఆనేఆనదు (లేక్-డి; కాలీ-బి; అయిరిస్). పుర్రె చల్లగావుంటుంది. మందు వేసవిలో వున్నటోపీ వేసుకుంటాడు. తలకు ఏదో కప్పకపోతే ఎక్కువవుతుంది (సిలికా). కేశఖండన వుద్రేకహేతువు (బెల్లు; గ్లొనైన్; సెపియా).

5. "సోరినం"లో చెవిసంబంధమగు లక్షణాలేమి ?

చాలకాలంగా చెవినుండి చిక్కని పసుపురంగుగల దుర్వాసన వేయుచీము కారుతుంది. చెవికిచుట్టుననూ వెనుకతట్టుననూ కురుపులు.

చెవిమధ్య కురుపు. తలనొప్పితో కూడి గత నాలుగేండ్లనుండి ఎడమ చెవినుండి వాసనగలరసిస్రవిస్తుంది. చెవి రసితో పాటు దుర్వాసన వేయు నీటివంటి అతిసార విరోచనాలు అవుతాయి.

6. "సోరినం" కలుగజేయు పంటిబాధలెట్టివి ?

పళ్ళు కదుల్తుంటాయి. ఇగుళ్ళు హరిస్తాయి. పళ్ళవెంటతరచు రక్తస్రావం. పళ్ళుఊడిపోతాయి. నాలుకయందు, నోటిలోనుపుండ్లు. నాలుక పూత. కొండనాలుక మొద్దుబారి వాల్తుంది. మెడచుట్టునా వుండు గ్రంధులు తీపు.

7. స్త్రీలకువచ్చు ఏవ్యాధులకు "సోరినం" వాడాలి ?

అన్నివిధములగు ఋతువ్యత్యాసములకు, ముఖ్యంగామైల చాలకాలం వెళ్ళేటప్పుడువాడాలి. గర్భాశయంనుండి అయేరక్తస్రావ మును నివారిస్తుంది. గర్భస్రావమైనతరువాత తరచు కదిలినా మెదిలినా కుడపల్లా ఎఱ్ఱనిరక్తం వారాలు, నెలలు తరబడి అవుతూ వుంటుంది. కదిలినప్పుడల్లా నూతనంగా స్రవిస్తూవుంటుంది. ఏమందిచ్చినా తాత్కాలికోపశాంతేగాని శాశ్వతనివారణకాదు. ఇట్టిఅవస్తలో 'సోరినం, సల్ఫర్' సరిపడితే సమూలంగా నివారణచేస్తాయి. బిడ్డసంచి ముడుచుకొని యధాస్థితికిరాక రక్తం స్రవిస్తూవుంటుంది.

కుసుమ : కుదుప, కుదుపలలాగ, ముద్ద ముద్దలలాగ భరించ రాని వాసనతో వుంటుంది. తుంటెల్లోనొప్పి; నీరసం; నిస్సత్తువ. ముట్లైండిపోయేరోజుల్లో అయే పైవిధమగు కుసుమకు బాగా పని చేస్తుంది.

గర్భవతులకు విపరీతమగు వాంతులు; గర్భంలో పిండంవిపరీతంగా తిరుగుతుంది. ఎన్నిమందులువాడినా గుణంకనుపించదు 'సోరి.

నం' మాత్రం నిరుపమానంగా పనిచేస్తుంది. పుట్టబోయే శిశువును 'సోరిక్' తత్వంనుండి కాపాడడానికి గర్భవతికి 'సోరినం' వాడాలి.

8. పిల్లలకువచ్చు ఏఋుగ్మతలకు సోరినం వాడాలి?

మోచేతియందు, కీళ్ళమళుపులలోను లేచేకురుపులకు, దురద లకు, పిల్లలుచిక్కి నీరసంగావున్నప్పుడు, శరీరం ఎంతతోమి నీళ్ళుపోసి నా శరీరంవేయు దుర్వాసనపోనప్పుడు "సోరినం" పనిచేస్తుంది.

వేసవిలో పిల్లలకువచ్చు కలరావిరోచనాలకు, యీలావచ్చే కలరావిరోచినాలకు నాలుగురోజులుపూర్వం రాత్రిలు పిల్లలు నిద్ర పోక ఉలిక్కిపడుతూ ఏడుస్తూపోరుపెడుతారు. ఈలా వుండివుండి విరోచనాలలోనికి దింపుతుంది. విరోచనం బూడిదరంగు నీటివలె అవు తుంది. ముక్కుపగిలే దుర్వాసన. వుదయం విరోచనం నిద్రలేపు తుంది రోగిని.

9. చిడుముకు సంబంధించిన క్రిమిసంహారణకు మందు పైపూత పూయడం ధర్మమేఅంటారు "ఫేరింగ్టన్" ఆయన పైక్రివాయ మని సలహాయిచ్చిన మందేమి ?

**లవండర్ నూనె — యిది క్రిమిని గుడ్లతో సహా హరిస్తుంది.**

10 తరుణవ్యాధులలో తగినంత చైతన్యశక్తి లేకపోవడంచే నీర్స నిస్సత్తువులతోనున్నప్పుడు వాడనగు మందులు సూచకలక్షణము లతో తెల్పుము.

"సోరినం" సన్నిపాతజ్వరం తగ్గినవెనుక రోగి కోలుకోక, నీర సంగాను, నిస్పృహతోను ఉండి రాత్రిసమయంలో చమటలుపోసి నీర సించి తిరిగి బ్రతిగి బట్టకట్టెదనాఅని అధైర్యపడేటప్పుడు "సోరినం" దివ్యంగా పనిచేస్తుంది.

"చైనా" అమితంగా చమటలు. రక్తస్రావాలు. అతిసారవిరోచనాలు వీటితో బాధపడి కోలుకోనప్పుడు "చైనా" నిరుపమానమగు మందు.

"లరోసరస్" ఊపిరితిత్తులవ్యాధిలో యథాస్థితికికోలుకోనప్పుడు వాడాలి.

"కేప్సికం" ఊబకాయల్లో ఏవ్యాధివచ్చినా రోగం కుదిరి కోలుకోనప్పుడు పనిచేస్తుంది.

"ఓపియం" రోగి మగతగా కునికిపాట్లు పడుతుంటే అమోఘమగు మందు.

'వెలీరియన్''మోశ్చస్' 'అంబ్రాగ్రేసియా' రోగియొక్క నరాల దుర్బలత్వంచే సరియగుమందుకూడ పట్టివ్వనప్పుడు వాడాలి.

"కార్బోవెజిటాబిలిస్'' ఉదరసంబంధమగు వ్యాధుల్లో శరీరం చలువలుకమ్మి, ఒళ్లునల్లబడి శ్వాస ఆడనప్పుడు దివ్యంగాపనిచేస్తుంది.

11. జననేంద్రియములపై "సోరినం" ప్రభావమేమి ?

జననేంద్రియాలు బిగితప్పుతాయి; వీటిసత్తువ సన్నబడుతుంది. సంభోగమంటే స్త్రీపురుషులిద్దరికికూడ అయిష్టతే. పురుషులు సంభోగసౌఖ్యం పొందలేరు. లేపనశక్తికి లోటుఉండదు; కార్యనిర్వహణలో లోపముండదు. కాబట్టి నపుంసకుడుమాత్రంకాదు. కాని సంభోగంవల్ల సామాన్యంగాకలిగే ఆనందాన్ని పొందలేడు.

మేహతెలుపు (Gleet) పురుషాంగం చలువలుకమ్మి ముడుచుకుపోతుంది. మర్మావయవములందు దుర్వాసనఉన్నప్పుడు 'సోరినం' వాడాలి. 'తూజా'లో వికారమువచ్చుమధువు వాసనవేస్తుంది; అదిస్నిగ్ధ అంగంయొక్క అగ్రభాగంయొక్క చర్మంపైకి లాగిచూస్తే పురిపిరవకాయలుంటాయి.

12. "సోరినం"వలన బోవు గుండెలక్షణాలేమి ?

ఏమాత్రం కదిలినా మెదిలినా గుండెదడ; పడుకునిఉంటేకాస్త నయం. గుండెలపై పొరవాచి పోటు. దీనికికారణం వాతపునొప్పులను అణచిపెట్టుటే. గుండెజబ్బులయందలి నీర్స. నిస్సత్తువులకు, నాడిదుడుగ్గాను, వక్రంగాను వున్నప్పుడు "సోరినం" పని నిరుపమానం.

13. "సోరినం"యొక్క ఉద్రేక ఉపశమనాలేమి ?

చల్లగాలిలోను, కూర్చుండుటవలన ఉద్రేకము. శ్వాసకోశ సంబంధమగు వ్యాధులలోపడుకొనివుండాలి. పుప్పుసవ్యాధిలో పడుకోడంతడవుగా వుపశమిస్తుంది. చేతులుసాచి పడుకోవాలి; పొరపాటున చేతులు శరీరందాపుకువస్తే ఉక్కిరిబిక్కిరి అవుతాడు. ఈలక్షణం ఆస్తమాలో 'సోరినం'ను సూచించే దివ్యమైన లక్షణం.

తలమాదలోమాత్రం చల్లగాలి వుపశమనహేతువు, వెచ్చగా బట్ట కప్పుకోవడంచే ఉద్రేకము. ఇది గుర్తుంచుకోవలసిన విషయం.

14. 'సోరినం'కుగల జ్వరలక్షణాలేమి ?

జ్వరం విడచివిడచివస్తుంది; పసరుజ్వరం; పడిశజ్వరం; రోగి శరీరం సలసలాకాగిపోతూంటుంది. మనం ప్రక్కక్రింద చెయ్యిపెడితే ఆవిరివస్తున్నట్లుండి చెయ్యి వేడెక్కిపోతుంది. వేడి భరించలేక చెయ్యి వెనకకు లాక్కుంటాం. 'బెల్లు'లోవలె వేడి పొడిగాఆరిపోయివుండదు; కాని 'బెల్లు'నుమించినవేడి. అచ్చు మచ్చు ఆవిరిలావుంటుంది. 'సోరినం' జ్వరాలలో రోగి వెచ్చనిచమట్లతో తడిసిపోతాడు. సిరస్సు, కళేబరం యావత్తూ వెచ్చగానుండిరోగిచెంతనిలబడితేవేడిగాలివేస్తుంది. గుడ్డక్రింద ఆవిరిలాఉంటుంది (ఓపియం-ఋద్రవాతంలో సిరస్సుకు రక్తఘాటితోకూడి ఉంటుంది).

మన్యంజ్వరం: చలి యిదమిద్ధంగా ఉండదు; కాని వేడి, జ్వరం విపరీతంగా వుంటాయి. అపరమితంగా చమటలు. మగత, మత్తు. జ్వరతాపంచే అయోమయంగా ఉంటాడు. ప్రశ్నకు జవాబు చెప్ప లేడు. ముఖం ఎఱ్ఱగా కందుతుంది. క్షయవ్యాధిలో రాత్రిలందు పట్టేచమట్లకు పనిచేస్తుంది.

15. ముఖముపై వెంట్రుకలు విస్తారంగా మొలిచే మందులేవి ?

"సోరినం, నేట్రిం-మూర్, సల్ఫర్, కాల్కేరియా కార్బ్"

16. 'సోరినం'నుగూర్చి డా. జె. బి. బెల్లుగారేమని శలవిచ్చిరి ?

'అమూల్యమగు కనకంనుండిపుట్టినా ఏహ్యమగు మురికినుండి జనించినా అదిచేసే అమూల్య మానవసేవకు మనం దానిపుట్టుపూర్వో త్తరములనుగూర్చి ప్రశంసించరాదు. జిజ్ఞాససల్పకూడదు.

17. నిద్రసంబంధమగు 'సోరినం' లక్షణాలేమి ?

అమితమగు దురదచే నిద్రపట్టదు. దొంగలుపడినట్లు భీతావహ మగు కలలు (నేట్రం-మూర్).

18. "సోరినం"యొక్క ప్రధాన నైసర్గికలక్షణములనుగూర్చి క్లుప్త ముగా అర పుటకు మించకుండ వ్రాయుము

సోరాతత్వంకలవారికి ఉపయోగపడుమందు. జాగ్రత్తగా ఆలో చించి ఉపయోగించినమందులు వ్యాధిని నివారించలేనప్పుడు "సోరినం" ను వాడాలి. ప్రశయమగు తరుణవ్యాధులు నివారణైె పత్యంపెట్టినా ఆకలిపుట్టదు; రోగి కోలుకోడు. అప్పుడు యిది పనిచేస్తుంది. బిడ్డలు రేయింబవండ్లు నిద్రపోక రాత్రిలందు పోరుపడుతారు. శరీరం ఎంత తోమినా దుర్వాసనే.

చల్లగాలిగిట్టదు. మండువేసంగిలోకూడ బూసీనులు, శాలువాలు కప్పుకుంటాడు. తలకు గాలితగలకుండా ఉన్నిటోపీ పెట్టుకుంటాడు. వేసవిలో చిదుము మాడిపోయి సీతాకాలంరాగానే గజ్జితో ఒడలు పెట్లుతుంది.

అతిసారవిరోచినాలు, కుసుమ, ఋతువు, చమట్లువగైరాలన్ని స్రావాలు కుళ్ళుకంపే.

మతపిచ్చి. చచ్చిపోతాననేభీతి. నిస్పృహ. తలనొప్పి ఉన్నంత సేపు ఆకలి; తిండితింటే తలనొప్పితగ్గుతుంది. వెంట్రుకలు కాంతి హీనంగాఉంటాయి; బిరుసుగానుండి జడలుకట్టుకుపోతాయి.

పుర్రె:—చుండ్రు; పొట్టు; చీముకారే రసికుపులు. పుర్రె మాద. వెలుతురు ఏమాత్రం చూడలేడు; కనురెప్పలువాస్తాయి. పొంగు, ఆటలమ్మ, వేపపూత తగ్గినతర్వాత చెవినుండి దుర్వాసనతో గూడిన చీముకారుతుంది. అర్ధరాత్రిఆకలి. అప్పుడుఏమైనా తింటేనే గాని నిద్రపట్టదు.

టాన్సిల్సుఉబ్బి కష్టంమీదగాని గుటకపడదు. జున్నువంటి కఫం బొటాణీగింజల్లా ఓకరిస్తాడు. ఋది అసహ్యంగా ఉంటుంది. అతిసార విరోచినాలు బూడిదరంగు నీరువలె దుర్వాసనతో అవుతాయి. ఉబ్బుబ్బోనివస్తుంది; ఆపుకోలేడు. తెల్లవారగట్ల ఒంటిగంటకు ప్రారంభించి 4 గంటలదాకా అవుతాయి.

రాత్రిళ్ళు తెలియకుండా అల్పాచమానం బట్టల్లో అవుతుంది. ఇది ఏండ్లతరబడిగా ఉంటుంది. వంశపారంపర్యా చర్మవ్యాధులు వుంటాయి. ముఖ్యంగాపూర్ణిమనాడు నిద్రలోమూత్రంపోవుటసహజం.

జీర్ణించినశగ : ఏళ్ళతరబడిగా 'గ్లీటు' మేహశెలుపు. స్రావం బట్టలు అవుతాయి — వాసన.

గర్భవతులకిస్తే పుట్టేశిశువు "సోరా" తత్వం లేకుండా, ఆరోగ్యం గా పుడుతాడు. అమితంగా వాంతులు; గర్భసంచిలో పిండం అపరిమితంగా తిరుగుతుంది. తరుణవ్యాధులు నివారణఅయిన తరువాతవిపరీతమగు చమట్లు, వాటివలన ఉపశమనం — వుంటుంది.

ఉబ్బసం చేతులుసాచుకు పరుంటేతగ్గుతుంది. చేతులువంటికి దగ్గరగావస్తే దగ్గు, ఆయాసం హెచ్చుతాయి. ప్రతిరోజూ ఒకే నెలలో ఒకే తేదీని పడిశజ్వరంవస్తుంది. శరీరం జిడ్డుఓడుతూ అసహ్యాకరమగు దుర్వాసనకొడుతూవుంటుంది. కురుపులు యిట్టే రసికారేలావుంటాయి. శరీరం బిరబిరలాడుతూ ఎప్పుడోగాని చమటపట్టదు. విస్తారందురదలవలన చాలరాత్రివరకు నిద్రపట్టదు. దొంగలుపడ్డట్లు భయంకరమగు కలలు.

## 112. పల్సటిల్లా (Pulsatilla)

1. "పల్సటిల్లా" సాధారణంగా దేనిపై పనిచేస్తుందో స్పష్టముగా విశదపరచుము?

ప్రధానంగా అన్ని అమత్వచలపైనను పనిచేస్తుంది. ముద్దగాను చిక్కగాను ఉండి పసుపు లేక పసుపు ఆకుపచ్చన మిశ్రమరంగుగాను స్రావాలు అమత్వచలలనుండి వెలువడుతాయి.

కీళ్ళయందలి త్వచలు (Membranes) ఉబ్బి కీళ్ళవాతం, కీళ్ళవాపులు ఉద్భవిస్తాయి. నొప్పులు స్థిరంగాఉండక ఒకకీలునుండి వేరొక కీలుకు చలిస్తుంటాయి.

"పల్సటిల్లా" గుండెయొక్క కుడితట్టున పనిచేస్తుంది. అందుచే యిది గొప్పగా నల్లరక్తనాడులు (సిరల)పై పనిచేస్తుంది. స్త్రీలజన

నేంద్రియములపై దీని ప్రభావము ప్రత్యేకమైనది. బహుముఖముల, పనిచేసేమందుల్లో ఒకటి (Polychrest).

2. "పల్సటిల్లా"కు గల మానసికలక్షణములేమి?

దీని మానసికస్వభావము 'నక్సు'కు వ్యతిరేకం. 'నక్సు' పురుషులమందని 'పల్సు' అబలలమందని అంటారు. అంటే సాధారణంగా 'నక్సు' పురుషులలోకలిగే వ్యాధిలక్షణాలకు సరిపోతుందని 'పల్సు' చంచలస్వభావులగు స్త్రీల వ్యాధిలక్షణాలను సూచిస్తుందని భావించాలి.

"పల్సు" లక్షణాల్లో స్థిరత్వంలేక చంచలంగా వుంటాయి. నెమ్మది, అణకువ, వినయం చెప్పినదికాదనకపోవడం సహజం. సాధారణంగా అంతలోనేయేడ్పు అప్పుడే పకపకనవ్వు. చాల సున్నితమగు స్వభావం. ఇతరులు తన్ను తేలికపరుస్తారని లేక లోకువచేస్తారనివిచారిస్తుంది. మనోభావాలు విపరీతంగావుంటాయి. పురుషసంపర్కం చాల అపాయమని భావిస్తుంది. ఆరోగ్యాన్ని ప్రసాదించే పాలుత్రాగడం మంచిదికాదని భ్రమ.

ఊహాలు, భావాలు చాల వింతగాను విపరీతంగాను ఉంటాయి.

వివాహంచేసుకొనుట అంటే అయిష్టత, యీమందుకుప్రముఖ లక్షణం. దిగులుతో రేయింబవలు ఒకచోటకూర్చుని ఏమైనా అడిగితే తల ఆడిస్తుంది. నోటితో చెప్పితే "అవును, కాదు" అని ముక్తసరిగామాత్రమే అభిప్రాయాన్ని వెల్లడిస్తుంది. సోకం – సంతోషం – ఏమైనాఅంటే ఉక్కురోషతనం. ఇట్లా క్షణక్షణం మారుతూవుంటాయి మానసికోద్రేకాలు. "క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్" అన్నది 'పల్సు' లక్షణాల్లో అక్షరాలా గోచరిస్తోందిగనుకనే దీన్ని స్త్రీలఔషధం అన్నారు. కోపంవచ్చినా సంతోషంవచ్చినాకూడ ఏడుస్తారు.

ఈలాటి చంచలస్వభావం ఏబుగ్మతలో కనుపించినా 'పల్సు'స్ఫురణకు రావాలి.

3. 'పల్సటిల్లా'లాటి చంచలమానసికతత్వంగల యితరమందులతో దీనినిపోల్చి వ్రాయుము.

"సెపియా" స్వభావంలోకూడ చంచలత్వంవుంది. కాని దీని కోపంవినుగు ధుసధుమ"పల్సు"లాకాదు. ఒకప్పుడు సంసారమన్నా. భర్తన్నా, బిడ్డలన్నా వున్న ప్రేమాతిశయాలుపోయి నిర్లక్ష్యం వస్తుంది.

"నేట్రింమూర్" స్వభావంకూడ మాట్లాడితేయేడ్పే ఓదారిస్తేమరీ యేడుస్తారు. "పల్సు' రోగికి ఓదార్పుకావాలి.

'స్టానం-మెట్'కుకూడ ఏడ్చేస్వభావముఉంది.ఇదిశ్వాసకోశాల సంబంధమగు వ్యాధులకు సంబంధించి వుంటుంది. తనవ్యాధి కుదరదని తాను దిగజారిపోతున్నానని విచారం.

'ఇగ్నీషియా' రోగి విచారంగావుంటుందిగాని యితరులకు గోచరించకుండా విచారాన్ని దిగమ్రింగుకుంటుంది.

4. ఏవ్యాధిలోనైనను వాడదగు "పల్సటిల్లా" యందలి ప్రధాన సహజ గుర్తింపు లక్షణములేవి ?

ఈరోగులు నెమ్మదిగా, అణకువగా, వినయంగా చెప్పినవి కాదనలేకుండా వుంటారు. విషయం స్వల్పమైనా ఏడుస్తారు. లక్షణాలు తరచు మారుచు చంచలంగా ఉంటాయి.

సాయంకాలం వ్యాధిలక్షణాలు ప్రకోపిస్తాయి, విశ్రాంతిసమయాన్న, భోజనానంతరం, వెచ్చనిగదిలోవుంటేను, ఎడమవైపు పడు

కుంటేను, బాధలేనివెంపుకు తిరిగి పడుకుంటేను, వేడిపదార్థాలు బలోపేరక పదార్థాలుతింటేను బాధలన్నియు హెచ్చుతాయి. కదలినా, చల్లగాలిలో పచార్లుచేసినా బాధవెంపు పడుకున్నా (బై) చల్లనినీరుతాగినా, చల్లనిగాలి తగిలినా, సీతలోపచారాలుచేసినా బాధలన్నియు తగ్గుతాయి.

స్రావాలన్నియు పసుపురంగుగాను, పసుపు–ఆకుపచ్చ మిశ్రమ ఛాయలో ముద్దగాను, చిక్కగాను వుంటాయి.

నాలుకఆరి పిడచకట్టుకుపోతుంది కాని దాహమేమియువుండదు. నెలసరి ఆలశ్యంగా, కొద్దిగా అవుతుంది. పాదాలకు తడి తగులుటచే ఋతువు అణగారిపోతుంది.

నొప్పి చలితో కలసి వుంటుంది; నొప్పి హెచ్చినకొద్దీ చలి – కుదుపు హెచ్చుతాయి.

పడిశం పండినతదుపరి యీమందును వాడాలి.

తినిన రెండుగంటలకు అజీర్తి.

5. నొప్పి ఆయామందుల యితరలక్షణాలతోకూడిఉండు కొన్నిమందులేవి ?

చలితోకూడిన నొప్పి 'పల్సటిల్లా'; ముచ్చమటలతోకూడిన నొప్పి, క్రెమొమిల్లా; సోమతోకూడిననొప్పి హీపార్సల్ఫ్. తరచు మూత్రంతోకూడిననొప్పి తూజా, సంధిపేలాపనతోకూడిన నొప్పి విరాట్రిం ఆల్బం, తిమ్మెర్లతోకూడిననొప్పి. రూజ్టాక్స్. ఎకొనైట్.

6. "పల్సటిల్లా"కుగల జరరలక్షణాలేవి ?

వుదయం నోరు అరుచి; రుచియేమియుఉండదు, ఏదియురుచిగా ఉండదు. ఉదయం నాలుకపొడారిపోయి పిడచకడుతుందేగాని దాహం

మాత్రంఉండదు. క్రొవ్వుపదార్థాలవల్ల, అజీర్తిపదార్థాలవల్ల పొట్ట చెడుతుంది. అర్ధరాత్రిదాటాకా అజీర్తిచే ఆంబవిరోచినాలు. గొంతు గమంట. అన్నంతిన్నాక గంట లేక రెండుగంటలకు పొట్టలో బరువుగా ఉంటుంది. అన్నంతింటే తగ్గుతుంది. పడుకుని లేచాకా లేక రాత్రి భోజనమయ్యాకా పేగులు అరుస్తాయి.

7. 'పల్సటిలా'లో అజీర్తి కలుగజేసే కారణాలేమి ?

క్రొవ్వుపదార్థాలు, పప్పుదినుసులు, మాంసం, బలాహారపదార్థాలు, మిశ్రమ పదార్థాలు సేవించినను, కాయకూరలు ముఖ్యంగా రాత్రికాలంలో భుజించుటచేతను, అయిసుక్రీము,. మంచునీళ్లు, చల్లని నీళ్ళు త్రాగడంచేతను కలిగే అన్ని జఠరవ్యాధులకు పనిచేస్తుంది.

8. కొవ్వుపదార్థాలు మిక్కిలిగా తినడంచే వ్యాధిప్రకోపించే మందు లేవి ?

ఇపికాక్, తూజా, కార్బోవెజిటాబిలిస్, పల్సటిల్లా.

9. అయిసుక్రీం తినుటచే ఉద్రేకించే లక్షణాలుగల మందులేవి ?

ఆర్సు; కార్బోవెజ్; పల్సటిల్లా.

10. మిశ్రమ ఆహారంవల్ల పొట్టచెడితే ఏ మందులు వాడుతావు ?

నక్సు వామికా, పల్సటిల్లా, ఇపికాక్.

11. లిమనీడు(Lemonade) త్రాగాలనే వాంఛలక్షణంగాగల మందు లేవి ?

సైక్లమెన్; సెబీనా; బెలడోనా, పల్సటిల్లా.

12. దాహంలో అసహజలక్షణాలుగల రెండు మందులేవి ?

(1) పల్సటిల్లా (2) మెర్క్యూరియస్.

"పల్సు"లో నాలుక ఎండిపోయి పిడచకట్టుకుపోతుంది. దాహం మాత్రముండదు.

నోరు తడిగా నీళ్ళు కారుతూఉంటుంది. అయినాగాని 'మెర్క్యూరియస్'కు విదాహం.

13. జఠర లక్షణాల్లో 'పల్సటిలా'తో సమానంగా పనిచేసే ఇతర మందులేమి ? పోల్చి వ్రాయుము.

'పల్సటిల్లా' లాగే 'నక్సువామికా' కూడ జీర్ణాశయాలమీద పనిచేస్తుంది. మిశ్రమవంటకాలు, మితిమీరి తినడంచేత 'నక్సు'లోకూడ విరోచనాలవుతాయి. దీని విరోచనం జిగటతో కూడిఉండడంకద్దు. 'నక్సు'లో కొవ్వుపదార్థాలు సరిపడుతాయి; జీర్ణమవుతాయికూడాను. 'నక్సు'లో వేడిపదార్థాలు 'పల్సటిల్లా'లో చల్లని పదార్థాలు సరిపడుతాయి.

'ఏంటిమోనియం క్రూడం' 'పల్సు'ను పోలిఉంటుంది. దీనికి నాలుక తెల్లగా పాలతోరకలాఉంటుంది అజీర్తివ్యాధిలో. ప్రధానంగా వాంతులుంటాయి అన్నిటికీమించి. ఏకాస్త అన్నంతిన్నా వికారం, వాంతి. పిల్లల అజీర్తికి మంచిమందు.

'ఇపికాక్' బలోహారపదార్థాలు, అయిసు, అయిసుక్రీము, అయిసునీళ్ళు సేవించడంచేత ఉదరం చల్లబడి అనేకమైన జఠరసంబంధమగు వ్యాధులుకలుగుతాయి. 'ఇపికాక్'లో నాలుక శుభ్రంగా వుంటుంది. అన్నిలక్షణాలకంటె వికారం విపరీతంగా వుండడం దీని ప్రత్యేకత.

"పల్సటిల్లా" "ఆర్సు" చల్లని పానీయాలు, అయిసుక్రీము సేవించడంచే కలిగే ఉదరవ్యాధులలో సహచరులు.

ఉడకబెట్టిన కోడిగుడ్లు భోజనానంతరం వుదరంలోవున్నట్లు 'ఎబియస్ నిగ్రు'లో భావన.

'పల్సులో' అన్నంతినిన కొన్నిగంటలకు పొట్టలో రాయివున్న ట్లుంటుంది.

"అయిరిన్" తెల్లవారగట్ల 2 లేక 3 గంటలకువచ్చే కలరావ్యాధిలో పని చేస్తుంది. రాత్రి తిన్న అన్నం వమనమవుతుంది; పుల్లని తెమడ-పసరువిరోచనాలు. కాని 'విరాట్రిం-ఆల్బు'లా ఒళ్ళుచల్లబడ్డం, శరీరం చలువలుకమ్మడం అంతగావుండదు.

14. శ్వాసకోశములయందలి ఎట్టి లక్షణములకు పల్సు పనిచేస్తుంది?

కుడిగాని లేక ఎడమగాని ఊపిరితిత్తుల పై భాగంలో పచ్చిగా వుంటుంది. ఊపిరితిత్తుల అగ్రభాగంలో రక్త ప్రసరణసరిగా జరుగకుండుటచే పై లక్షణంపుడుతుంది. "పల్సు" మనోతత్వంగల స్త్రీలలో క్షయవ్యాధియొక్క ప్రథమావస్థను గుర్తింపజేసే పల్సు ముఖ్యలక్షణం. ఈలా పచ్చిగావుంటూ దీనితోదగ్గుకూడా వుంటుంది. దగ్గగా దగ్గగా కొంచెం కఫంపడవచ్చు. కొందరికి సూర్యాస్తమయ సమయానికి కొద్దిగా వేడికూడ తగలడంకద్దు. ఊపిరితిత్తులలో క్షయవ్యాదియొక్క అంకురాలేమియు గోచరింపవు; కాని రానున్న క్షయనుగుర్తింపజేసేలక్షణాలుమాత్రం పొడజూపుతాయి. ఈలా క్షయకు దారితీసే పెక్కుమంది యువతులకు వుపకరించింది "పల్సు".

15. ముక్కువెంట రక్తం పడడం "పల్సు" లో ఎలాఉంటుంది ?

ధార క్రమంగా ఉంటుంది. ఒక్కమారుగా పడిపోదు. రక్తం ఎఱ్ఱగా వుండదు. సాధారణంగా ఋతుధర్మం నిలచిపోవుటచే ముక్కునుండి, నోటినుండి రక్తం స్రవిస్తుంది.

16 కంటి లక్షణాలలో 'పల్సటిల్లా' సూచక లక్షణాలేమి ?

కళ్ళ కలక : తృతీయావస్థయందు కంటినుండి ముద్దలాటి పసుపు, ఆకుపచ్చ మిశ్రమరంగు గల పుసులు కట్టేటప్పుడు పనిచేస్తుంది. పొంగు, ఆటలమ్మ తరువాత సంభవించే కంటి ఋగ్మతలకు అనన్య సామాన్యమగు మందు. తత్వం ఉద్రేక ఉపశమనాలు సరిపోతే పెక్కు కళ్ళవ్యాధులకు దివ్యమగు మందు. వికారం, కళ్ళు తిరగడంతో కూడిన కళ్ళ మసగలను నివారిస్తుంది. వస్తువులన్నియు రెండుగా కనుపిస్తాయి. (Diplopia) కనుగుడ్డుపై మొలకలు; కంటివెంట నీరు. కాని బాధలేకుండా వెల్తురును చూస్తుంది. కంట్లో నొక్కుచున్నట్లు పోట్లు. కన్నీరు చల్లగాలిలో ప్రకోపిస్తుంది. ఇది దీని స్వాభావిక లక్షణానికి విరుద్ధం. రెప్పలు వాస్తాయి, ముఖ్యంగా పై రెప్పలు. రెప్పల వంచలు వాచి ఎరుపుగా వుంటాయి. కాని ఒరుపు ఉండదు. గుడ్డుపైన అయే చిన్ని పుండ్లకు నిరుపమానమగు మందు.

17. ఎట్టి ముక్కు లక్షణములకు "పల్సటిల్లా" పనిచేస్తుంది ?

రొంప ముదిరి పండినప్పుడు ఉపయోగపడుతుంది. ప్రథమావస్థలో దీనిని యివ్వకూడదు. జలుబు ముదిరి ముద్దగావుండే పచ్చని ఆకుపచ్చ శ్లేష్మం పడుతుంది; జలుబుల్లో యిది మూంవదశ, కడపటి దశ కూడాను. ప్రథమంగా రొంప ముక్కులోనే వుండి పలుచని నీటి వంటి స్రావాన్ని వెలువరిస్తుంది. రెండవ స్థితిలో గొంతుగకు పాకి పొడిదగ్గు, గొంతుగ పచ్చి సంభవిస్తాయి. మూడవ స్థితిలో ఊపిరితిత్తుల లోనికి పాకి తెల్లగానుండు పలుచనిస్రావముతో ప్రారంభించి ముదిరి పండి ముద్దకట్టి పైవిధంగా తయారవుతుంది స్రావం. ఇది కడపటి అవస్థ. ఇట్టిస్థితిలో 'పల్సు' తరచుగా విడవకుండా వాడాలి. వాసన, రుచి తెలియకపోవడం 'పల్సు'లో మరొక ప్రత్యేక లక్షణం.

18. ఏ విధమగు చెవి ఋగ్మతలకు "పల్సటిల్లా" వాడాలి ?

చెవి పైభాగం వాపు, ఎరుపు. వెచ్చగానుంచితే ధనారింపు, ఆటు, పోటు. రాత్రిభాగంలో ఉద్రేకం. చెవినుండి ముద్దవంటి చిక్కని పసుపు, ఆకుపచ్చని రంగుగల స్రావం వెలువడుతుంది. చెవులు ఘడియలు పడినట్లుండి వినుపించదు. చెవిలో హోరు ధ్వని. నాడియొక్క ధనారింపు చెవిలో కొడుతుంది.

19. చెవి పోటుకు వాడనగు ముఖ్యమగు మూడు మందులను వాటి లక్షణములను వ్రాయుము.

(అ) 'పల్సటిల్లా' పై చెవి వాపు, ఎరుపు, ధనారింపు; ఆటు, పోటు.

(ఆ) 'కెమోమిల్లా' "పల్సు" వలెనే వుంటుంది. గాని పోటు, బాధ దానికంటె విస్తారంగా వుంటుంది. చెక్కిళ్ళు ఎఱ్ఱగా వుంటాయి.

(ఇ) "ప్లేంటేగో" పండ్లపోటుతో కూడిన చెవిపోటుకు వాడాలి.

20. శగ(Gonorrhoea)లో ఎప్పుడు పల్సటిల్లా ఉపయోగపడుతుంది?

స్రావం పసుపుపచ్చ, ఆకుపచ్చ మిశ్రమరంగులో ఉండి చిక్కని ముద్దగా వెడుతున్నప్పుడు వుపయోగపడుతుంది. తొడలలో నొప్పి.

గనేరియా అణగిపోవుటచే కలిగే అండ వ్యాధులకు అనగా వృషణాలు ముడుచుకుపోయి, వాచి తాకితే బాధగా వుంటుంది. పై చర్మం ఎఱ్ఱగా కందగడ్డలా ఉంటుంది. వీర్యం స్రవించే రెండు నాళాలయందు దిగలాగుచున్నట్లు సున్నితమగు పోట్లు, చురుకులు. రోగిని కదలనివ్వక వృషణాలు పైకి బిగబట్టె "పల్సు" యిస్తే స్రావం తిరిగి అంకురించి బాధలన్నియు తగ్గుతాయి. వేడికాపడంవల్ల వాపు హెచ్చినా బాధలు మాత్రం తగ్గుతాయి. పిల్లలకు వచ్చు వరిబీజానికిది మంచి మందు.

నెలసరి అగుటకుబదులు రక్తం ముక్కునుంచి స్రవిస్తుంది. అప్పుడు ఒక్క మోతాదు 'పల్సు' యిస్తే ఋతుధర్మం సవ్యంగాఅయే టట్లు చేస్తుంది. కొందరికి దీనిని విడువకుండా తరచు వాడాలి.

గర్భవతులకు గర్భాశయం, ఉదరం పచ్చిపుండులా ఉంటాయి. బిడ్డసంచిలో పిండం సవ్యమైనస్థానంలోవుండేలా చేస్తుంది. 'పల్సు'. బిడ్డనొప్పులు సరిగారానప్పుడు, నొప్పులువచ్చి బిడ్డపుట్టేవరకు క్రమాభి వృద్ధిచెందక ఆగిపోతున్నప్పుడు 'పల్సటిల్లా' ఒకమోతాదిస్తే బిడ్డ నొప్పులు సరిగావచ్చి ఒకగంటలో ప్రసవిస్తారు.

మైల సరిగాపోనప్పుడు, మావి బైటపడక లోన అంటిపెట్టుకు ఉన్నప్పుడు 'పల్సు' వాడితే మావి పడిపోవుటేకాక ప్రసవానంతరం రక్తస్రావభయమును లేకుండజేసి గర్భాశయానికి బలం చేకూరుస్తుంది.

స్థనాలువాచి బాధగానున్నప్పుడు, పాలు సరిగాపడక బాలింత రాలు విచారంగాను, దిగులుగాను ఉన్నప్పుడు బాగాపనిచేస్తుంది. నెల సరి అయే స్త్రీలకు పాలుపడుతాయి. (సైక్లమన్; మెర్క్యు).

21. జ్వరాల్లో 'పల్సు' లక్షణాలేమి ?

సిరస్సుకాలిపోతూవుంటుంది. పెదవులు ఆరిపోతాయి; అందుచే రోగి తరచు నాలుకతో పెదవులు తడుపుతాడు. దాహం ఏమాత్రం వుండదు. విడిచివచ్చే మన్యంజ్వరాల్లో క్వైనావాడినా జ్వరంవస్తూనే వుంటే దీన్నివాడాలి. సాయంకాలం 2 లేక 3 గంటలకు దాహం; తరువాత దాహంతగ్గి చలి, కుదుపు, ఆరాటం. ఒకప్పుడు ఒకచెయ్యి చల్లగావుంటుంది; రెండోది వెచ్చగా కాలిపోతూఉంటుంది.

22. ఆట్లమ్మలో 'పల్సు' ఎప్పుడువాడాలి ?

పడిశభారం ఎక్కువగా ఉండి, కంటివెంట నీరుకారుతూ 'ముస ముస' లాడుతున్నప్పుడు పల్సు వాడాలి. సాధారణంగా రాత్రిళ్ళు

పొడిదగ్గు; పగలు కళ్లెదగ్గు. పిల్లాడు దగ్గుతో లేచి కూర్చుంటాడు. చెవిపోటు. ప్రారంభంలో విపరీతంగా జ్వరం, రొంప వున్నప్పుడు పల్సు వాడకూడదు. ఆస్థితిలో "ఫెర్రొనైట్, జల్సిమియం"లు పనిచేస్తాయి. ఆటలమ్మ తగ్గిపోయాక వచ్చే కంటివ్యాధులకు "పల్సు" బాగా పని చేస్తుంది.

23. "పల్సు" సూచకమగు నడుమునొప్పి ఎట్టిది ?

నడుము బిగగట్టినట్లుంటుంది. కూర్చున్నా వెనుకకు వంగినా భరించరాని బాధ. విశ్రాంతిగాఉంటే నడుంనొప్పి కొంతనయం. వెన్ను వెంట చల్లనినీళ్ళుపోసినట్లు భావన.

24. కూర్చుంటే నడుంనొప్పి వుద్రేకించు లక్షణంగల కొన్ని మందులను వ్రాయుము.

జింకం; కోబాల్టు; సెపియా; కానబిస్ఇండికా; ఎగారికస్; బెరిబెరిస్; రూస్టాక్సు; పల్సు.

25. 'పల్సటిల్లా'కుగల నిద్రలక్షణములేమి ?

సరిగా నిద్రపోడు, స్థిమితంగా పడుకోడు, విపరీతంగా కలలు కంటాడు. నిద్రపట్టక లేచి పచార్లుచేస్తాడు. నిద్రలేచాక మత్తుగా, బద్ధకంగా ఉంటాడు. వెల్లకిలా పడుండి చేతులు తలపై పెట్టుకుంటాడు. ఎడమవైపు తిరిగి పడుండలేడు.

26. "పల్సటిల్లా" వాడకంలో అవసరమగు జాగ్రత్తయేమి ?

కళ్లె,కఫం పడే దగ్గులలో ఎన్నడుసూ 'పల్సటిల్లా' వాడరాదు. వాడితే కళ్లెగట్టిపడుతుందిగాని వ్యాధిమాత్రం ముదురుతుంది. జ్వరం తీవ్రంగాఉన్నప్పుడు ఆటలమ్మ, వేపపూతలలో ప్రథమావస్థలలో 'పల్సటిల్లా' వాడకూడదు.

పడిశెం, రొంప మొదలగు వ్యాధులలో ప్రథమావస్థలో పల్సు వాడరాదు. తుది అవస్థఅనగా రొంపపండినప్పుడు వాడాలి.

27. "పల్సటిల్లా" కుదిర్చే మూత్రవ్యాధులేవి ?

తరచు మూత్రం ఉబ్బుకొనివస్తుందిగాని వెడితే కొద్దిగా అవుతుంది. అమితంగా తీపు, బాధ, మంట. వీపుపై పడుకుంటే మూత్రానుమానం. నిద్రలో వెల్లకిలా వీపునతిరిగితే మూత్రం అవుతుంది. తుమ్మినా దగ్గినా మూత్రం అవుతుంది (కాస్టికం). అమిత సంతోషం ఉద్రేకం, ఆశ్చర్యం, నవ్వు లేక ధ్వనులు. చప్పుడుఅయితే మూత్రం అవుతుంది. తలుపుచప్పుడుకే మూత్రం అవుతుంది. మూత్రం చుక్కచుక్కలుగా అవుతుంది. తొలినిద్రలో మూత్రం బట్టల్లో అవుతుంది (సిపియా, కాస్టికం).

28. "గవజలు" (Mumps)లో "పల్సు" వాడనగు లక్షణములేమి ?

గవజలువాచి అవి అణిగితే ఆడవాళ్ళకు స్థనాలు, పురుషులకు వృషణాలు వాస్తాయి. పిల్లలకు గవజలవల్ల అమితంగా పిచ్చులు వాచినప్పుడు దీనిని వాడాలి. తరచు ఒకవ్యాధిపోయి మరోవ్యాధివస్తుంది. (Metastasis) అంటారు.

29. ఒకలక్షణం పోయి మరో లక్షణంలోకి అంటే 'మేటేస్టాసిస్' లక్షణంగాగల మందులేవి ? వివరించి వ్రాయుము.

"ఎబ్రోటినం"లో అసలువ్యాధి స్వరూపమే మారిపోతుంది. డాక్టరుగారుచూస్తే కొత్తవ్యాధిఅంటారు. విరోచనాలుగాని, కుసుముగాని అణిగి చలికుదుపు; లేక మెదడుగాని, కాలేయంగాని, మూత్రపిండాలుగాని చెడి క్రమంగా చిక్కిపోతాడు. ఇందులో చిక్కడం క్రిందనుండి పైకి అంటే ముందుగా కాళ్ళు సన్నబడి వూచకాళ్ళవుతాయి. క్రమంగా యీచిక్కడం పైకి పాకుతుంది.

'కార్బో వెజిటాబిలిస్'లో కూడ గవజలు అణగిపోయి వృషణాలు వాస్తాయి.

"పల్సు"లో మార్పు ఒకేవిధంగా ఉంటుంది.

30. "పల్సు"లోని మెటాస్టాసిస్ అంటే వ్యాధి తరచు మార్పుచెందడం ఏలా ఉంటుంది?

"పల్సులో" స్థానచలనంతో కూడిన నొప్పులుంటాయి. కీళ్ళనొప్పులు ఒకకీలునుండి మరొకకీలుకు తరచు మారుతాయి. బాధలు కూడ ఒకచోటనుండి మరొకచోటకు మారుతాయి. ఇందులో వ్యాధి మారదు. వున్న వ్యాధి యే స్థలంమారుతుంది'పల్సు'లో;'అబ్రాటినం' లోవలె వ్యాధిస్వరూపంలో మార్పుండదు. వున్న అసలువ్యాధే స్థానచలనం చెందుతుంది.

అతిసారం, మలబద్ధం:—విరోచనాలరంగు తరచు మారుతుంది. మలంకూడ ఒకసారి గట్టిగాను, మరోసారి నీళ్ళలాగా వెడుతుంది. విరోచనాలు యిప్పుడైనట్లు తరువాత విరోచనం ఉండదు. ఋతుస్రావం యీక్షణంలో అవడం తరువాతక్షణంలో ఆగిపోవడం.

ఈలా 'పల్సు'లో వ్యాధిలక్షణాలు మార్పుఉంటుంది. రోగి ఏ రెండుదఫాలు ఒకలాఉండదు. కాని వ్యాధిరూపంమాత్రంమారదు

31. ఒకపుట మించకుండా పల్సటిలాయొక్క ప్రధాన నైజలక్షణాలను తెల్పుము.

నెమ్మదిగా, అణకువగా వినయంగా వుంటారు. చెప్పినది కాదనలేరు. ప్రతివిషయానికీ ఏడుస్తారు. మళ్ళాఅంతలోనే సంతోషం. చంచలత్వం. తనను అంతా చులకనగా చూస్తున్నారని బాధపడుతుంది. ఇది స్త్రీలమందు. లావుగా ఊబగావుంటారు. నెలసరి సరిగాకాకఎగవేస్తుంది.

స్రావాలన్నియు ముద్దగా, చిక్కగా, పసుపు, ఆకుపచ్చమిశ్రమ రంగులో వుంటాయి.

లక్షణాలు తరచు మారుతాయి. చలి రెండుసార్లు ఒకేలా రాదు. రెండువిరోచనాలు ఒక్కలావుండవు. రెండుదఫాల వచ్చిన వ్యాధి ఒక్కలావుండదు. ఒకక్షణంలో కులాసాగా కేరింతాలు కొడుతూవుంటుంది. మరోక్షణంలో విచారంతో కుమిలిపోతూ వుంటుంది.

బాధలుకూడా చంచలంగా స్థలమార్పులతో వుంటాయి. చలితోకూడిననొప్పి. అకస్మాత్తుగా నొప్పిపుట్టి క్రమంగా తగ్గుతుంది. గర్భవేదనకు దివ్యమగుమందు.

నోరు ఆరుకుపోతుందేగాని దాహంవుండదు.

బలోహారపదార్థాలు. చల్లని పానీయాలు, అయిస్క్రీము తినడంచే కలిగే జఠరవ్యాధులకు మంచిమందు.

•అతిసారవిరోచనాలు రాత్రికాలంలో అవుతాయి; సాధారణంగా అజీర్తిచేసే పప్పుపదార్థాలు, కొవ్వుపదార్థాలు చల్లని అయిసుక్రీము తినుటచేత రాత్రిళ్లు సాధారణంగా అర్థరాత్రిదాటాక ఆకుపచ్చని విరోచనాలవుతాయి. తరచు విరోచనంరంగు మారుతుంది.

ఋతుస్రావం పాదాలకు చన్నీళ్లు సోకడంతో అణగిపోతుంది. నెలసరి ఎగవేసి వెడితే మైల కొద్దిగా వెడుతుంది. పగటిపూటమాత్రమే మైల అవుతుంది. పాలవంటి కుసుమ; దీనిరంగు తరచుమారుతుంది.

కంటి పై రెప్పలందు మొటిమలు (Styes) లేస్తాయి.

చల్లనినీరు పుక్కిటపట్టుటచే పంటినొప్పి వుపశమిస్తుంది.

మడమసీల చాల విస్తృత్తుగా వుంటుంది.

కాలికవ్యాధులచికిత్స దీనితో ప్రారంభించడం మంచిది.

సూర్యాస్తమయంవేళ జ్వరం తగుల్తుంది.

పిల్లలకువచ్చే వరిబీజం తగ్గిస్తుంది.

వల్సటిల్లా బాధలు, వ్యాధులు, చల్లదనం; చల్లనిగాలి చల్లని పైపూతలువల్ల తగ్గుతాయి.

వెచ్చదనం, వేడిగాలి, సాయంకాలం వ్యాధిలక్షణాలు హెచ్చుతాయి.

## 113. పైరొజన్ (Pyrogen)
## (Artificial sepsin)

1. "పైరొజన్" వాడనగు ప్రధాన సూచకమగు లక్షణసముదాయమేమి ?

విషపూరితస్థితులందు ఉపయోగపడు ఔషధరాజము 'పైరొజన్'; మితిమీరిన ఆరాటం.

క్షయజ్వరం, సూతికాజ్వరం, దోషగుణం, విషవాయువులు పీల్చుటచే వచ్చే వ్యాధులకు, అంగుడుపుండు, పళ్ళు విషపూరితమైనప్పుడు, పురాణజ్వరాలకు, మన్యజ్వరాలకు, గర్భస్రావం అగుటచే కలుగు విషలక్షణాలకు యీ మొదలగు వ్యాధుల్లో ఒకప్పుడు 'పైరజన్'ను సూచించే లక్షణాలు వుండవచ్చును.

ముఖ్యంగా యిందు నాడి అమితవుడుకుగా కొట్టుకుంటుంది. కాని ఉష్ణమానానికి అన్వయంగా ఉండకపోవడం "పైరొజన్"కు ప్రధాన సూచకలక్షణం. నాడి నిమషానికి 140 నుండి 170 వరకు కొట్టుకుంటుంది. ఉష్ణంఅంటే జ్వరం 105 నుండి 106 డిగ్రీలదాకా హెచ్చి వుంటుంది.

రుతుస్రావం, పురిటిమైల (Lochia) విరోచనాలు, వాంతులు, చమటలు, శ్వాస-యివన్నియుకూడ భరించరాని దుర్వాసన. ఆరాటం. ఇవి దీని ప్రధానసూచక లక్షణాలు.

2. జ్వరములందు "పైరోజన్"ను సూచించే ప్రధాన నైజలక్షణములేవి?

చలి-కుదుపు ప్రిళయంగా వస్తాయి; దానితోపాటు అమితమగు వేడి; చమటలు. అవయవాలన్నీ కుళ్ళిపోడిచినట్లునొప్పులు, ఆరాటం. కదలిక, ఉష్ణం ఉపశాంతిహేతువులు. 'ఆర్నికా, బ్యాప్టిషియాల్లో'వలె ఒళ్లు చితుకపోడిచినట్లుంటుంది. 'ఎపిటోరియం-పెర్-ఫ'లా ఎముకలు విరుగ గొట్టినట్లు నొప్పి, బాధ వుంటుంది. 'రూస్టాక్స్'లా ఆరాటం. కదిలినా, వేడినికలుగజేసినా బాధలు వుపశమిస్తాయి. కూర్చుంటే విపరీతమగుబాధ. సీతలంచేత, చల్లగాలి, తేమగాలివలన వ్యాధులు అంకురిస్తాయి.

విషజ్వరాల్లోను, క్షయ అంత్యావస్థలలోను, క్షయవ్యాధిలో వచ్చే జ్వరాలు యీలక్షణాలను కలిగివుంటాయి. ఈమందును సూచించేలక్షణాలుంటే సూతికాజ్వరం కొన్నిగంటలలో నివారణఅవుతుంది. సన్నిపాత (Typhoid) జ్వరాల్లో "బాప్టీషియా" లక్షణాలు అనగా మగత, మనోవికారాలు, ఒళ్ళునొప్పులు ఉండి 'ఆబేప్టీషియా' తలతన్నిన జ్వరం ఉధృతంగావున్నప్పుడు 'పైరోజన్' తప్ప గత్యంతరమే లేదు. జ్వరం 106° వుండి ఒళ్ళునొప్పులు, విరుపులు, తీపు, పోట్లు ఉంటే "పైరోజన్' ఒక్క-రోజులో ఆశ్చర్యకరమగు మార్పులను తెస్తుంది. ఆపోట్లు, బాధలు కదలినా, ఉష్ణోపచారాలుచేసినా ప్రుపశమించేఎడల అంతజ్వరమును పైరోజన్ నసింపజేస్తుంది.

నాడికి, జ్వరోద్రేకానికి పరస్పర సంబందంలేప్పుడు ఏవ్యాధి అయినాసరే పేరుతోనిమిత్తంలేకుండా "పైరోజన్"ను వాడాలి. జ్వరాల్లో అతిగావాగడం "పైరోజన్"యొక్క మరొక నైసర్గికలక్షణం.

3. "పైరొజన్" రోగికి మనోభావాలేమి ?

పరుపుఅంతా తానే అనేభావం; తలమాత్రం తలగడపైనున్నట్లు తెలుసు కాని మిగతాశరీరం యావత్తూ యెక్కడఉన్నదో తెలియదు. ఒకవెంపు పండుకుంటే ఒకమనిషినని, మరోవెంపు పండుకుంటే మరోమనిషినని అనేభావం. శరీరంయావత్తూ-కాళ్ళు చేతులు సమూహంతో వున్నట్లు మరోభావన.

4. 'పైరొజన్'కుగల హృద్రోగమెట్టిది ;

రోగి సదాహృదయాన్నిగూర్చి యోచిస్తాడు. (గుండెనాజు) గుండెల్లో 'పర్, బర్' మనే పలురకాల ధ్వనులు. ఇవి చెవిలోనికి ప్రతిధ్వనించడంచే నిద్రపట్టదు. గుండె పెద్దదగుచున్నట్లుబావన. రక్తం విషపూరితమగుటచే రోగి నీరసించి సొమ్మసిల్లుతాడు. జ్వరాల్లో గుండె ఆగిపోతున్నట్లనుపిస్తుంది. ఈ మొదలగు అనేక గుండెవ్యాధుల్లో యిది పనిచేస్తుంది.

5. "పైరొజన్"ను సూచించే గుండెలక్షణాలేమి ?

ప్రసవానంతరం స్రావాలు సరిగాకాక, కొంతమావి గర్భంలో నిలిచిపోయి కుళ్ళి దుర్వాసనగల స్రావాలు బైలుదేరుతాయి. ఒకప్పుడు స్రావాలు బహిర్గతంగాక అణగారిపోయి హటాత్తుగా చలి కుదుపుతో తీవ్రమగుజ్వరం 'గుబ-గుబ' వస్తుంది. జ్వరం 106° వరకు, 170 వరకు నాడివేగంఉండి చల్లటిచమటలు విపరీతంగా అసహ్యం కలిగిస్తూ పడుతాయి. ఈస్థితిలో యామండప రోగిని ఒకగంటలో తెప్పరిల్ల జేస్తుంది. గర్భవిచ్ఛిత్తి, గర్భస్రావం, ప్రసూతి సమయాల్లో యిలాంటి జ్వరపడి తిరిగిరోగి సంపూర్ణంగా ఆరోగ్యాన్ని పొందక రోగభూయిష్టమై సర్వదా ఏదో ఒకవ్యాధితో బాధపడుతూఉంటుంది. ఇట్టివాటికి 'పైరొజన్' సారూప్యతగలమందు.

6. 'పైరోజన్'యొక్క ప్రధాన సైజలక్షణములను అర పుటకు మించకుండ వ్రాయుము.

విషరక్తంచే పుట్టేవ్యాధులకు, సూతిక, దోషగుణం, అంగుడు పుండు, క్షయ యీ మొదలగు విషజ్వరాలకు, జ్వరతీవ్రతకు సమన్వయంగా నాడిలేకుండుటకు యిది ప్రధానమగుమందు. ఆరాటం. ఒళ్లు చితుకకొట్టినట్లు నొప్పులు; పసుపు గట్టిగా కటికచాపరాయిలా వుంటుంది.

నాలుక మొద్దుబారి, దళసరెక్కి, శుభ్రంగా, ఎఱ్ఱగా, నిగారింపుగా వార్నిష్పూసినట్లుండి, నాలుక పగిలి బాధవలన మాట్లాడ్డం కష్టంగావుంటుంది.

రుచి-తియ్యగా,కుళ్ళుచీమువలె దుర్వాసనవేయు లాలాజలం.

వాంతులు : విరామంలేని వాంతులు. ముక్కుపగిలిపోయే వాసనవేయు బూడిదరంగువాంతులు. ప్రేగులకు చలనశక్తి నసించుటచే మలం వాంతిలో నోటిగుండాపోతుంది. (ఓపియం; ప్లంబం).

అతిసారం : బాధ ఏమాత్రము లేకుండా నల్లగాను, బూడిదరంగుగాను, మలం దుర్గంధభూయిష్టమై ఉంట్లుంది. మలం తెలియకుండా అపానువాయువు విడిచేటప్పుడు అవుతుంది.

మలబద్ధం : అసలువిరోచనానుమానమేవుండదు. కుళ్ళుకంపువేయుమలం నల్లని పెద్దరాళ్ళవలె అవుతుంది. పిష్టంకడుతుంది.

ప్రసవం ; మావి పూర్తిగా బైటపడక లోపలకుళ్లి దుర్వాసన. దానివలన చలి, కుదుపు; వొళ్ళు తెలియని జ్వరం పెళ్ళుమని వస్తుంది.

లాలాజలం పల్చగా, బూడిదరంగుగా ఉండి దుర్వాసన వేస్తుంది. గుండెదెబ్బయొక్క ధనారింపు చెవిలో ప్రతిధ్వనిస్తుంది.

నాడి జ్వరంతో సంబంధంలేకుండా విపరీతంగా కొట్టుకుంటుంది; చలి రెండుభుజాలమధ్యనా ప్రారంభిస్తుంది. విపరీతమగు జ్వరం, కుదుపు· ఒళ్ళుకూలాన్నమైనట్లు నొప్పులు. ఎముకల్లోకూడ పోట్లు. విష జ్వరం· జ్వరం 106° వరకూ వస్తుంది; నాడి నిమిషానికి 170 దాకా కొట్టుకుంటుంది. దుర్గంధం వేయు చల్లని చమటలు.